కఫవాతకం । అపస్మారప్లీహమేదఃశ్లీపదార్శపాండురోగకం ।
అరుచింయోనిశూలంచకాసమర్శశ్చకృఛ్రికం । పిత్తంచామ
మతీసారంక్రిమింశ్వాసంచకుష్ఠకం । విషదోషంహరేదాశుచ్ఛ
దించైవవినాశయేత్ ॥

తా॥ బోడతరము చేదుగను పాకమువలన కారముగను ఉష్ణవీర్యముగలదగను మధురముగను చులకనగనుండును. ఇది బుద్ధి కాక బలము ఆయురారోగ్యము వీటిని వృద్ధిజేయును. దోషములను భేదించును. మరియు నిది గళగండము గండమాల అపచీ కఫము వాతము అపస్మారము ప్లీహము మేదోరోగము ఏనుగకాలు పాండురోగము అరుచి యోనిశూల కాసము అర్శస్సు మూత్రకృచ్ఛ్రము పిత్తము ఆమదోషము అతి సారము క్రిములు శ్వాసము కుష్టువు విషదోషము వాంతి వీటిని నశింపంజేయు.

## పెద్దబోడతరము.

శ్లో॥ మహాముండీలోభనీయాభిన్నగ్రంధినికాస్మృతా ।
భూతవృక్షఃకులహాలోలంబుశాలూకదంబకః ॥

టీక॥ 1 మహాముండీ 2 లోభనీయా 3 భిన్నగ్రంధినికా 4 భూతవృక్షః 5 కులహాలః 6 లంబుశా 7 కదంబకః యీ 7 న్ను పెద్దబోడతరము పేళ్ళు.

## పెద్దబోడతర గుణము.

శ్లో॥ మహాముండీతుమధురాతిక్తాచోష్ణారసాయనీ ।
రుచ్యాస్వర్యప్రమేహఘ్నీవాతనాశకరీమతా ।
అన్యేగుణాస్తుముండీవద్దేయానైఘంట్యశ్చసూరిభిః ॥

తా॥ పెద్దబోడతరము మధురముగను చేదుగను ఉష్ణముగనునుండును. మరియు ఆయురారోగ్యము రుచి కంఠమునకు సుస్వరము వీటిని గలుగంజేయు. మరియు నిది ప్రమేహము వాతము వీటిని నివర్తింపంజేయు. ఇది (బోడతరముయొక్క గుణములే గలిగియుండును.)

## విష్ణుబోడతరము.

శ్లో॥ హపుషావపుషామిశ్రామిశ్రగంధావిగంధికా ।
అపరాతుస్వచ్ఛఫలాకట్వంగాధ్వాంక్షనాసికా ।
విషఘ్నీప్లీహనాశాచకులఘ్నీచాపరాంతికా ॥

టీక॥ 1 హపుషా 2 విపుషా 3 మిశ్రీ 4 మిశ్రగంధా 5 విగంధికా 6 స్వచ్ఛ ఫలా 7 కట్వంగా 8 ధ్వాంక్ష నాసికా 9 విషఘ్నీ 10 ప్లీహనాశా 11 కులఘ్నీ 12 అపరాంతికా ఈ 12 న్ను విస్తుబోడతరమునకు పేర్లు.

విస్తుబోడతర గుణము.

శ్లో॥ హపుషాకటుతిక్తోష్ణాగురుశ్లేష్మబలాసజిత్ ।
అర్శోగుల్మవికారాంశ్చహంతిజంతూదరైస్సహా॥

తా॥ విస్తుబోడతరము కారముగను చేదుగనునుండు. మరియు నిది ఉష్ణము గురుత్వము వీటినిజేయు. ఇది శ్లేష్మము తెమడ మూలవ్యాధి గుల్మము క్రిములు ఉదర రోగము వీటిని నశింపంజేయు.

తెల్లసుగంధిపాల.

శ్లో॥ శారిబాశారదాగోపాగోపవల్లీప్రతానికా ।
గోపకన్యాలతాశ్వేతాలతాస్ఫోటాకాష్ఠశారిబా ।
ఉత్పలాశారిబానంతాకరాళాగజజిహ్వకా ।
సైషాసుగంధమూలాచభల్లీచల్లీతథాస్మృతా ॥

టీక॥ 1 శారిబా 2 శారదా 3 గోపా 4 గోపవల్లీ 5 ప్రతానికా 6 గోప కన్యా 7 లతా 8 శ్వేతలతా 9 కాష్ఠశారిబా 10 ఉత్పలా 11 శారిభా 12 అనంతా 13 కరాళా 14 గజజిహ్వకా 15 సుగంధమూలా 16 భల్లీ 17 ఛల్లీ యీ 17 న్ను తెల్లసుగంధిపాల పేళ్ళు.

తెల్లసుగంధిపాల గుణము.

శ్లో॥ శారిబాస్నిగ్ధమధురాశీతాగ్రాహాత్రిదోషజిత్ ।
వాతాస్రశూలపిత్తామజ్వరదాహవినాశినీ ॥

తా॥ సుగంధపాల మధురముగను నునుపుగను శీతముగనునుండు. మరియు నిది గ్రహణి త్రిదోషములు వాతము రక్తదోషము పిత్తము ఆమచలనము జ్వరము తాపము వీట్లను నశింపంజేయు.

నల్లసుగంధిపాల.

శ్లో॥ శారిబాన్యాకృష్ణమూలకృష్ణచందనశారిబా । భద్రాచందన
గోపీతుచందనాకృష్ణవల్ల్యపి । సుభద్రాత్రిదశాహ్వైవమసూరా

కాలవేశికా । కిథితాతుమహాశ్యామపాలందీస్తనేతికా తా ।
జంబూవల్లీదుగ్ధగర్భానీవల్లీస్వేతికామతా ॥

టీక॥ 1 శారిబా 2 కృష్ణమూల 3 కృష్ణచందనశారిబా 4 భద్రా 5 చందనగోపా 6 చందనా 7 కృష్ణవల్లీ 8 సుభద్రా 9 త్రిదశా 10 మసూరా 11 కాలపేశికా 12 మహాశ్యామా 13 పాలందీ 14 జంబూవల్లీ 15 దుగ్ధగర్భ 16 నీవల్లీ 17 నేతికా యీ 17 న్ను నల్లసుగంధిపాలపేర్లు.

నల్లసుగంధపాల గుణము.

శ్లో॥ సుగంధిమూలానాం గ్రాహ్యస్వాదుకఫవాతజిత్ ।
తృష్ణారుచిప్రశమనీరక్తపిత్తాతిసారజిత్ ॥

తా॥ నల్లసుగంధపాల విరేచనము కఫము వాతము దప్పి అరుచి రక్తపిత్తము శూల వీటిని నశింపజేయుటయేగాక అగ్నిదీప్తిని గలుగజేయును.

భావంచి.

శ్లో॥ వాకూచీసోమరాజీచ సోమవల్లీసువల్యపి ।
అవల్గుజకృష్ణఫలాస్యేపూతీఫలామతా ।
చంద్రరేఖాతిధాసోమాకుష్ఠఘ్నీనామతోపరా ॥

టీక॥ 1 వాకూచీ 2 సోమరాజీ 3 సోమవల్లీ 4 సువల్లీ 5 అవల్గుజ 6 కృష్ణఫలా 7 పూతిఫలా 8 చంద్రరేఖా 9 సోమా 10 కుష్ఠఘ్నీ యీ 10 న్ని భావంచిపేర్లు.

భావంచి గుణము.

శ్లో॥ వాకూచీమధురాతిక్తాకటుపాకారినాయనీ ।
విష్టంభినీహిమారుచ్యాసరాహృద్యాప్రసాదినీ ।
రూక్షావాంతికఫశ్వాసకుష్ఠమేహజ్వరక్రిమీన్ ।
తత్ఫలంపిత్తలంకృచ్ఛ్రకుష్ఠవాతకఫాపహం ॥

తా॥ భావంచి మధురముగను చేదుగను పాకమునందు కారముగనుండును. మరియు ఆయురారోగ్యములను వృద్ధిజేయును. మలబద్ధమునుజేయును. చల్లగనుండును. రుచిని బుట్టించును. హృదయమునకు మేలుజేయును. వేగముకలదిగనుండును. రక్తపిత్తమును బోగొట్టును. తాపము నిచ్చును. మరియు కఫము శ్వాసము కుష్ఠువు మేహజ్వరము క్రిములు వీటిని నశింపజేయును. దీనిఫలము పిత్తమునుజేయును. మరియు మూత్రకృచ్ఛ్రము కుష్ఠువు వాతము కఫము వీటిని హరింపజేయును.

## వ్రుంగకాయ గుణము.

శ్లో॥ తచ్ఛలాటుత్రిదోషఘ్నో మధురస్సర్వరోగహృత్ ।
దీపనంబృంహణంతద్వత్పిత్తలంకఫవాతనుత్ ।
కాసశ్వాసక్షయాన్ హంతిక్రిమిరోగవ్రణాపహః ।
తత్ఫలంకాసవమనశోధవ్రణవిషాపహం ॥

తా॥ వ్రుంగకాయ త్రిదోషములను బోగొట్టును. మధురముగనుండును సమస్త రోగముల నశింపంజేయు. అగ్నిదీపనము శరీరపుష్టి పిత్తము వీటినిగలుగంజేయు మరియు నిది కఫము వాతము కాసము శ్వాసము క్షయము క్రిములు వ్రణములు వీటిని నశింపంజేయు. దీనిఫలము కాసము వాంతి వాపు వ్రణము విషము వీటిని నశింపంజేయు.

## చేతిసార.

శ్లో॥ కట్వలాబూర్నితుంబీచలంబాపిండిఫలాతథా ॥
బృహత్ఫలారాజపత్రీఉషాస్యాద్వప్రకీర్తితా ।
ఇక్ష్వాకుఃక్షత్రియవరఃతిక్తబీజామహాఫలా ॥

టీక॥ 1 కట్వలాబూ 2 నితుంబి 3 లంబా 4 పిండిఫలా 5 బృహత్ఫలా 6 రాజపత్రీ 7 ఉషా 8 ఇక్ష్వాకు 9 క్షత్రియవర 10 తిక్తబీజా 11 మహాఫలా యీ 11 న్ను చేతిసారపేళ్ళు

## చేతిసార గుణము.

శ్లో॥ ఇక్ష్వాకుర్వమనేశస్తఃకాసశ్వాసజ్వరాపహః ।
అగ్నిమాంద్యంవిషంహంతిస్థావరంజాంగమంతథా ॥

తా॥ చేతిసార వాంతిని గలుగజేయుటయందు ప్రశస్తముగనుండు. మరియు నిది కాసము శ్వాసము జ్వరము అగ్నిమాంద్యము స్థావరవిషము జంగమవిషము (అనగా పాషాణాదివిషములు సర్పాదివిషములు) వీట్లను నశింపంజేయు.

## దే వ దా ళి.

శ్లో॥ జీమూతకాదేవదాళివృంతకోశోగరాగరి।ప్రోక్తాఖువిషహావల్లి
దేవదాళీచచంద్రికా।మహాకోశఫలాతద్వజ్జాలాతీచతురంగకః।
కర్కోటకీకదంబశ్చ ఘోషాలోమశపత్రకః । మూషికాంబు
బుధాకశ్చేతర్కారీస్యైవకీర్తితా ॥

టీక॥ 1 జీమూతకా 2 దేవదాళి 3 వృంతకోశ 4 గరాగరీ 5 ఆఖువిషహా 6 వల్లీ 7 దేవదాళీ 8 చంద్రికా 9 మహాకోశఫలా 10 జాలాలీ 11 చతురంగక 12 కర్కోటకీ 13 కదంబ 14 ఘోషా 15 లోమశపత్రక 16 మూషికా 17 అంబు 18 బుధాళ 19 తర్కారీ యీ 19 న్ని దేవదాళిపేర్లు.

దేవదాళి గుణము.

శ్లో॥ దేవదాళీప్రయోక్తవ్యా హిధ్మాశ్వాసజ్వరాన్ జయేత్ ।
శోఫపాండ్వామయవిషశోషగరేషు వమనే హితా ॥

తా॥ దేవదాళి హిధ్మ శ్వాస జ్వరము శోఫ పాండురోగము విషమజ్వరము శోష విషము వాంతి వీటిని నివర్తింపఁజేయును.

చేతిదోస.

శ్లో॥ కటుకా త్రపుసీ ప్రోక్తా విపాండుర్హస్తిపర్ణినీ ।
ఛర్దాయనీ మూత్రఫలా లతా కర్కటికాపి చ ॥

టీక॥ 1 కటుకా 2 త్రపుసీ 3 విపాండు 4 హస్తిపర్ణినీ 5 ఛర్దాయనీ 6 మూత్రఫలా 7 లతా 8 కర్కటికా యీ 8 న్ని చేతిదోసపేర్లు.

ములుదోస.

శ్లో॥ త్రపుసః కంటకిలతా సుధావాస స్తథైవ చ ॥

టీక॥ త్రపుస 2 కంటకిలతా 3 సుధావాస యీ 3 న్ను ములుదోసపేర్లు.

చేతిదోస ములుదోస వీటిగుణము.

శ్లో॥ కర్కటీ కఫపిత్తఘ్నీ కృఛ్రమూత్రవికారజిత్ ।
పాండుహృద్రోగశమనీ దీపనీ జ్వరనాశినీ ॥

తా॥ దోస కఫము పిత్తము మూత్రకృఛ్రము పాండురోగము హృద్రోగము జ్వరము వీటిని నశింపఁజేయుటయేగాక అగ్నిదీపనమును బాగా గలుగఁజేయును.

నక్కదోస.

శ్లో॥ కర్కటీ లోమశీ వ్యాళపత్రైర్వారు ర్బృహత్ఫలా ॥

టీక॥ 1 కర్కటీ 2 లోమశీ 3 వ్యాళపత్రా 4 ఏర్వారు 5 బృహత్ఫలా యీ 5 న్ను నక్కదోసకాయపేర్లు.

## నక్కదోస గుణము.

శ్లో॥ కర్కటీశీతలారూక్షా గ్రాహిణీమధురాగురుః।
రుచ్యాపిత్తహరాసామాపక్వోష్ణాపిత్తవహ్నికృత్ ॥

తా॥ నక్కదోసకాయ శీతలముగనుండును. తాపమునిచ్చును మలమునుబంధించును. తీపుగనుండును గురుత్వమునుజేయును. రుచినిపుట్టించును. పిత్తమునుబోగొట్టును. నక్కదోసపండు కాక పిత్తము అగ్నిమాంద్యము వీటిని గలుగంజేయు.

## కిరుబూజాదోస.

శ్లో॥ అథపద్భుజామధుఫలాపత్రశ్రేణీవృంతకర్కటీతిక్తా ।
తిక్తాఫలామధూకావృంతోర్వారుశ్చపట్టమ్రభాంచలేధా ॥

టీక॥ 1 పద్భుజా 2 మధుఫలా 3 పత్రశ్రేణీ 4 వృంతకర్కటీ 5 తిక్తాఫలా 6 మధూకా 7 వృంతోర్వారుః 8 పట్టమ్రభా యీ 8 న్ని కరుబూజాదోసపేళ్ళు.

## కరుబూజాదోస గుణము.

శ్లో॥ తిక్తంబాల్యేతదనుమధురంకించిదామ్లంచపాకేనిః। పక్వంచేత్త
దనుమ్భృతి సంతర్పణంపుష్టిదాయి । వృష్యందాహశ్రమహర
మిదంమూత్రవృద్ధింప్రకుర్యాత్ । పిత్తోన్మాదాపహృతినిపుణం
పద్భుజందీఘుణకారి ॥

తా॥ లేతకరుబూజాదోస చేదుగనుండును. కొంచము ముదిరిన పిదప తీపుగనుండును. పండిన పిదప కొంచము పుల్లగనుండును. బాగుగ పండిమాగిన పిదప పితృదేవతలకు ప్రీతిగనుండును. మరియు నిది పుష్టినిచ్చును. శుక్లమును వృద్ధిజేయును తాపము శ్రమ వీటినిబోగొట్టును. మూత్రమును వృద్ధిజేయును. పిత్తము ఉన్మాదము వీటిని నివర్తింపంజేయును. దీఘుణకారిగనుండు.

## చేదుబీర.

శ్లో॥ కోశాతకీకృతచ్ఛిద్రాజాలినీకృతవేతసా ।
క్ష్వేళసుతిక్తాఘోంటాలీమృదంగఫలినీచసా ॥

టీక॥ 1 కోశాతకీ 2 కృతచ్ఛిద్రా 3 జాలినీ 4 కృతవేతసా 5 క్ష్వేళ 6 సుతిక్త 7 ఘోంటాలీ 8 మృదంగఫలినీ యీ 8 న్ని చేదుబీరపేళ్ళు.

తా॥ పెద్దబీర వగరుగనుండు. మరియు నిది గుల్మము మహోదరము కఫము దురద కుష్ఠము వాతము క్రిమిరోగము శోఫ వీటిని నశింపఁజేయు.

పొట్లబీర కాయ గుణము.

శ్లో॥ కఫపిత్తహరంవృష్యంలఘుకోశాతకీఫలం ।
కుష్ఠమేహాక్షయశ్వాసకాసారుచిహరంపరం ॥

తా॥ పొట్లబీరకాయ కఫపిత్తముల బోగొట్టును. మరియు నిది శుక్రమును వృద్ధిజేయును. మరియు కుష్ఠువు మేహము క్షయము శ్వాసము కాసము అరుచి వీనిని నశింపఁజేయు.

నిమ్మబీర కాయ గుణము.

శ్లో॥ విషఘ్నంమధురంవృష్యంమహాకోశాతకీఫలం ॥

తా॥ నిమ్మబీరకాయ విషమును బోగొట్టును. మధురముగనుండును. శుక్రమును వృద్ధిజేయును.

నేతిబీర కాయ గుణము.

శ్లో॥ రక్తపిత్తహరంరుచ్యంఘృతకోశాతకీఫలం ।
వృష్యంహిక్కావిషహరంశీతజ్వరవినాశనం ॥

తా॥ నేతిబీరకాయ రక్తపిత్తమును బోగొట్టును. రుచిగనుండును శుక్రమును వృద్ధిజేయును. మరియు నిది ఎక్కిళ్ళు విషము చలిజ్వరము వీనిని నశింపఁజేయు.

కాకర.

శ్లో॥ కారవేల్లంకటిల్లంస్యాదుగ్రకాండంసుకాండకం ।
కారవల్లీవారివల్లీబృహద్వల్లీపరాస్మృతా॥

పేర్లు॥ 1 కారవేల్ల 2 కటిల్ల 3 ఉగ్రకాండ 4 సుకాండక యీ 4 న్ను కాకర పేర్లు మరియు 1 కారవల్లి 2 వారివల్లి 3 బృహద్వల్లి యీ 3 న్ను పెద్దకాకర పేర్లు.

కాకర గుణము.

శ్లో॥ కారవేల్లంహిమంభేదిలఘుతిక్తామవాతలం । పిత్తాస్రకామిలా
పాండుకఫమేహాక్రిమీన్ జయేత్ । న్యాత్కారవల్లీఫలమీాష
దుష్ణంసరాస్వమయఘ్నంరుచిరంక్రిమిఘ్నం । చక్షుష్యమేతల్ల

ఘు దీపనంస్యాద్దోషఘ్నం సింహాఫలైస్సమానం । తీక్ష్ణో
ష్ణం దోషజిద్వన్యాకారవల్లీ విషాపహా । ప్రసేకశ్వాసకాసార్శః
క్రిమికుష్ఠవ్రణాన్ జయేత్ ॥

తా॥ కాకర చలవజేసును. త్రిదోషముల భేదించును. చులకననిచ్చును. వాతమును జేయకుండును. మరియు నిది పిత్తరక్తము కామిల పాండువు కఫము మేహము క్రిములు వీటిని నశింపజేయు. కాకరకాయ కొంచెము ఉష్ణమును జేయును. సర్వరోగముల బోగొట్టును. రుచినిచ్చును. క్రిములను బోగొట్టును. నేత్రములకు మేలు జేసును. చులకననిచ్చును. అగ్నిదీపనము జేసును సింహాఫలమువలెనే దోషమును బోగొట్టును. మరియు అడవికాకరకాయ మిక్కిలి కాకజేసును. దోషములను విషములను బోగొట్టును. నోటియందు నీరూరును. మరియు నిది శ్వాసము కాసము మూలశంక క్రిములు కుష్టువు వ్రణములు వీట్లను నశింపజేయు.

ఆగాకర.

శ్లో॥ మహాజాలీ ఫలవతీ పీతపుష్పీ నిరుచ్యతే ।
కర్కోటకీ విషఘ్నీ చ కంటకీ నళినీ నళీ ॥

టీక॥ 1 మహాజాలీ 2 ఫలవతీ 3 పీతపుష్పీ 4 కర్కోటకీ 5 విషఘ్నీ 6 కంటకీ 7 నళినీ 8 నళీ యీ 8న్ని ఆగాకర పేళ్ళు.

ఆగాకర గుణము.

శ్లో॥ తద్వత్కర్కోటకీపుష్పం కిలాసారుచినాశనం ।
కర్కోటకీఫలం హృద్యం కషాయ మధురం గురు ।
దీపనం పాచనం రుచ్యం కేశ్యం మేధ్యం త్రిదోషనుత్ ॥

తా॥ ఆగాకర కాకరయొక్క గుణములు కలదైయుండును. దాని పుష్పములు కిలాసకుష్టువు అరుచి వీటిని బోగొట్టును. మరియు నిది ఆగాకరకాయ హృదయమునకు మేలుజేసును. వగరుగను తీపుగనునుండు. గురుత్వమును జేసును అగ్నిదీప్తి పాచనము వీటిని జేసును. రుచిగనుండును వెంట్రుకలు బుద్ధి వీటిని వృద్ధిజేసును. త్రిదోషప్రకోపమును బోగొట్టును.

గోష్ఠాగాకరం.

శ్లో॥ వంధ్యాకర్కోటకీ దేవీ మనోజ్ఞా చ సుమాంగనా ।
నాగారీ నాగదమనీ విషకంటకినీ తథా ।

విజ్ఞేయామజ్జమదనీకన్యాభూతప్రమర్దనీ।
వంధ్యాపాదాప్రజాప్రోక్తా విజ్ఞేయాయోగీశ్వరీతథా ॥

టీక॥ 1 వంధ్యాకర్కోటకీ 2 దేవీ 3 మనోజ్ఞా 4 కుమారికా 5 నాగారీ 6 నాగమర్దనీ 7 విషకంటకినీ 8 మజ్జమదనీ 9 కన్యాభూతప్రమర్దనీ 10 వంధ్యా 11 పాదా 12 ప్రజా 13 యోగీశ్వరీ యీ 13 న్ను గొడ్డుకాకర పేళ్ళు.

గొడ్డుకాకర గుణము.

శ్లో॥ వంధ్యాకర్కోటకీతిక్తాకటూష్ణాలఘుస్మృతా।
రసాయనీశోధనీచగ్రహపీడావిషాపహా ।
కఫనేత్రశిరోరోగవ్రణవీసర్పకాసజిత్ ।
భగందరంరక్తదోషంవంధ్యాత్వంచవినాశయేత్ ॥

తా॥ గొడ్డుకాకర చేదుగను కారముగనునుండు. కాకచేయును. చులకనగనుండును. బలకరముగనుండు. శోధనము జేయును. మరియు గ్రహపీడ విషము శ్లేష్మము నేత్రరోగము శిరోరోగము వ్రణము విసర్పము కాసము భగందరము రక్తదోషము వంధ్యత్వము వీట్లను బోగొట్టును.

బుడ్డకాకర.

శ్లో॥ అనంతాసూక్ష్మమూలాచఖములావల్లికాప్రియా ॥

టీక॥ 1 అనంతా 2 సూక్ష్మమూలా 3 ఖములా 4 వల్లికాప్రియా యీ 4 న్ను బుడ్డకాకర పేళ్ళు.

బుడ్డకాకర గుణము.

శ్లో॥ కషాయాపిచ్ఛిలాగుర్వీసూక్ష్మవల్లీసుశీతలా।
రక్తపిత్తప్రశమనీమూత్రదోషనివారిణీ ।
కామిలాయాంవిశేషేణశస్యతేవ్రణరోపిణీ ॥

తా॥ బుడ్డకాకర వొగరుగను జిగటగనునుండు. గురుత్వము చలువ వీటిని జేయును మరియు రక్తపిత్తము మూత్రదోషము వీటిని బోగొట్టును. విశేషముగ కామిల యందుపయోగించుటయేగాక వ్రణములను సగా నార్చును.

ఆరె.

శ్లో॥ అశ్మంతకశ్చంద్రకస్తుకుశలీ తామ్రపత్రికా।
శ్లక్ష్ణత్వగ్వాలుకాపర్ణా స్యాత్తోయమళపత్రకః।
శఫరీచ గదాచైవ పాషాణాంతక ఏవచ॥

టీక॥ 1 అశ్మంతక 2 చంద్రక 3 కుశలీ 4 తామ్రపత్రికా 5 శ్లక్ష్ణత్వక్ 6 వాలుకాపర్ణ 7 యమళపత్రక 8 శఫరీ 9 గదా 10 పాషాణాంతక యీ 10 న్ని ఆరె పేళ్లు.

ఆరె గుణము.

శ్లో॥ అశ్మంతస్తువరో గ్రాహీ శీతోష్ణః కఫవాతజిత్।
నిహంతి గండమాలాస్రగళగండగళామయాన్।
తత్ఫలం లేఖనం గ్రాహి గురు శ్లేష్మానిలాపహం॥

తా॥ ఆరె వగరుగను మలబద్ధకారిగను శీతోష్ణముగనునుండు. మరియును కఫ వాతము గండమాల రక్తదోషము గళగండము కంఠరోగము వీటిని బోగొట్టును. ఆరె పండు లేఖనము మలబద్ధకము గురుత్వము వీటిని జేయును. మరియు శ్లేష్మము వాతము వీటిని హరింపఁజేయు.

రెండవ ఆరె.

శ్లో॥ ద్వితీయోశ్మంతకో యస్తు గుణతశ్చ మతోన్యథా।
ప్రలంబచ్ఛదనః ప్రోక్తో లక్ష్మీశ్రకరకరాళినీ॥

టీక॥ 1 ప్రలంబచ్ఛదన 2 లక్ష్మీశ్రకర 3 కరాళినీ యీ 3 న్ను రెండవ ఆరె పేళ్ళు. (మొదటి ఆరెకంటె భిన్నగుణములుగలదని తెలిసికొనవలయు.)

రెండవ ఆరెగుణము.

శ్లో॥ అశ్మంతకోరసేతిక్తశ్శ్లేష్మకాసాదిపిత్తజిత్।
వ్రణకోపనశూలఘ్నః కర్ణమూలవ్రణాపహః॥

తా॥ రెండవఆరె వగరుగనుండు. మరియు నిది శ్లేష్మము కాసములు పిత్తము మిగుల వ్రణములు శూలము కర్ణమూలము వీటిని నివర్తింపఁజేయు.

ఆ రె పు వ్వు.

శ్లో॥ ధాతకీకుంజరాసింధుపుష్పీప్రమదినీమదా ।
పార్వతీయాతామ్రపుష్పీసుభిక్షామేఘవాసినీ ॥

టీక॥ 1 ధాతకీ 2 కుంజరా 3 సింధుపుష్పీ 4 ప్రమదినీ 5 మదా 6 పార్వతీయా 7 తామ్రపుష్పి 8 సుభిక్షా 9 మేఘవాసిని యీ 9 న్ని ఆరెపువ్వుపేళ్ళు.

ఆరెపువ్వు గుణము.

శ్లో॥ ధాతకీకటుకాశీతామందోష్ణాతువరాలఘుః।
తృష్ణాతీసారపిత్తాస్రవిషకృమివిసర్పజిత్ ॥

తా॥ ఆరెపువ్వు కారముగను శీతలముగను నుండు. కొంచెము కాకజేసును. వగరుగ లఘువుగనుండును. మరియు దప్పి అతిసారము పిత్తము రక్తదోషము విషము క్రిములు విసర్పము వీట్లను నశింపంజేయు.

కో వి దా ర.

శ్లో॥ కోవిదారోథఉద్దాళః కాంచనఃకుండలీకులీ ।
తామ్రపుష్పీచమరికోమహాయమళపత్రకః ॥

టీక॥ 1 కోవిదార 2 ఉద్దాల 3 కాంచన 4 కుండలీ 5 కులీ 6 తామ్రపుష్పీ 7 చమరిక 8 మహాయమళపత్రక యీ 8 న్ని కోవిదారపేళ్ళు. దీనినే కాంచనాళ మనియెదరు.

కోవిదార గుణము.

శ్లో॥ కోవిదారఃకషాయస్స్యాత్సాంగ్రాహీవ్రణరోగజిత్ ।
గండమాలాగుదభ్రంశశమనఃకఫపిత్తహా ॥

తా॥ కోవిదారము వగరుగనుండు. ఇది మలబద్ధము వ్రణము గండమాల గుదభ్రంశము కఫము పైత్యము వీటిని నశింపంజేయు.

మే డి.

శ్లో॥ ఉదుంబరఃక్షీరవృక్షోజంతువృక్షస్సదాఫలః ।
హేమదుగ్ధఃకృమిఫలోయజ్ఞాంగశ్శీతవల్కలః ॥

టీక॥ 1 ఉదుంబర 2 క్షీరవృక్ష 3 జంతువృక్ష 4 సదాఫల 5 హేమదుగ్ధము 6 కృమిఫల 7 యజ్ఞాంగ 8 శీతవల్కల యీ 8 న్ని మేడిపేళ్ళు.

మేడి గుణము.

శ్లో॥ ఉదుంబరోహిమోవ్రణ్యఃకఫపిత్తాస్రజిద్గురుః ॥

తా॥ మేడి శీతలముగనుండును. మరియు వ్రణములు కఫము పిత్తము రక్తదోషము వీటిని బోగొట్టును. గురుత్వమును జేసును.

మేడిపండు గుణము.

శ్లో॥ ఔదుంబరంఫలమతీవహిమంసుపక్వం పిత్తాపహంచమధురం
శ్రమమేహహారి। ఆమంకాషాయమధురంరుచిదీపనంచమాంం
సస్యవృద్ధికరణంశ్రమనాశకారి ॥

తా॥ బాగుగ పండిన మేడిపండ్లు మిక్కిలి చలువజేసును. పిత్తమును బోగొట్టును తియ్యగనుండును. శ్రమ మేహము వీటిని బోగొట్టును. ముదిరిన మేడికాయ వగరుగను తియ్యగను రుచిగనునుండు. అగ్నిదీపనమును జేసును. శరీరమునకు మాంసవృద్ధినిజేయును శ్రమను బోగొట్టును.

బ్రహ్మమేడి.

శ్లో॥ కాకోదుంబరికాఫల్గుర్మలాయూశ్విత్రభేషజం।
ఫల్గుణీఫలహారీచరాజఫల్గుశివాటికా ॥

టీక॥ 1 కాకోదుంబరికా 2 ఫల్గు 3 మలాయూ 4 శ్విత్రభేషజ 5 ఫల్గుణీ 6 ఫలహారీ 7 రాజఫల్గు 8 శివాటికా యీ 8 న్ని బ్రహ్మమేడిపేళ్ళు.

బ్రహ్మమేడి గుణము.

శ్లో॥ కాకోదుంబరికాతద్వద్విశేషాచ్ఛ్విన్ననాశినీ।
కఫపిత్తకరోగ్రాహీంకుష్ఠకండూవ్రణాపహా।
రక్తపిత్తహరశ్చైవపాండుశోఫహరఃపరః ॥

తా॥ బ్రహ్మమేడి మేడియొక్క గుణము కలదైయుండును. విశేషముగ గాయము కుష్ఠువు దురద వ్రణములు రక్తపిత్తము పాండువు వాపు వీనిని బోగొట్టును. మరియు కఫము పిత్తము వీట్లను గలుగంజేయు. మలమును గట్టిపరచును.

సీమమేడి.

శ్లో॥ అంజీరంమజ్జలంజ్ఞేయంకాకోదుంబరికాఫలం ॥

టీక॥ 1 అంజీర 2 మజ్జుల 3 కాకోదుంబరికాఫల యీ 3 న్ను సీమమేడి (అనగా అంజీరుపండు) పేళ్లు.

సీమమేడిగుణము.

శ్లో॥ అంజీరంశీతలంస్వాదుర్గురుఃపిత్తాస్రవాతజిత్ ॥

తా॥ సీమమేడి (అనగా అంజీరుపండు) చలువజేసును. రుచిగనుండును. గురుత్వము జేసును. మరియు పిత్తరక్తము వాతము వీనిని బోగొట్టును.

అగ్నిమేడి.

శ్లో॥ ఆవర్తకీతిందుకినీవిభాండీసితకీలతా ।
చర్మరంగారక్తపుష్పావామావర్తవిషాణికా ॥

టీక॥ 1 ఆవర్తకీ 2 తిందుకినీ 3 విభాండీ 4 సితకి 5 లతా 6 చర్మరంగా 7 రక్తపుష్ప 8 వామావర్త 9 విషాణికా యీ 9 న్ని అగ్నిమేడిపేళ్ళు.

అగ్నిమేడి గుణము.

శ్లో॥ ఆవర్తకీస్యాదూర్ధ్వదోషఘ్నీకఫపిత్తవిషాపహా ।
శోఫగుల్మోదరానాహక్రిమ్యర్శోవినివర్తిని ॥

తా॥ అగ్నిమేడి ఊర్ధ్వదోషము కఫము పిత్తము విషము శోఫ గుల్మము మహోదరము కడుపుబ్బరము క్రిములు మూలవ్యాధి వీటిని నశింపజేయు.

రెండవ అగ్నిమేడి.

శ్లో॥ అజశృంగీమేషశృంగీసర్పదంష్ట్రీచవర్తికా ।
తిక్తదుగ్ధాక్షిభైషజ్యంపుత్రశ్రేణీవిషాణికా ।
ఉష్ట్రరోమశపర్ణీచవివృత్శోఘునశృంగకః ।
విషఘ్నఃపాదవృక్షశ్చకాలీచెక్షుష్యపవచ ॥

టీక॥ 1 అజశృంగి 2 మేషశృంగి 3 సర్పదంష్ట్రి 4 వర్తికా 5 తిక్తదుగ్ధా 6 అక్షిభైషజ్య 7 పుత్రశ్రేణీ 8 విషాణికా 9 ఉష్ట్రరోమశపర్ణీ 10 వివృత 11 ఘునశృంగక 12 విషఘ్న 13 పాదవృక్ష 14 కాలీ 15 చెక్షుష్య యీ 15 న్ను రెండవ అగ్నిమేడిపేళ్లు. (దీనినే అజశృంగియని జెప్పుదురు.)

రెండవ అగ్నిమేడి గుణము.

శ్లో॥ అజశృంగీరసేస్వాదుశ్శీతజ్వరవిషాపహా ।
శ్వాయథుంపవనంహంతితృష్ణావమథునాశినీ ॥

తా॥ రెండవ అగ్నిమేడి రుచికరముగనుండు. ఇది శీతజ్వరము విషము వాపు వాతము దప్పి వాంతి వీటిని నశింపంజేయు.

తేలుమణిచెట్టు.

శ్లో॥ శణపుష్పీబృహత్పుష్పీస్యైవోక్తాశణఘుంటికా । మహాశణా మాల్యపుష్పావామనికటుతిక్తకా । వక్రోహిదంష్ట్రీకాకోళీ వృశ్చికావ్యాళిధూమికా । ధూమపత్రావిశల్యాచవిషఘ్నీ నేత్రరోగహావిషాణీదక్షిణావర్తాదేవలాంగూలికాచసా ॥

టీక॥ 1 శణపుష్పీ 2 బృహత్పుష్పీ 3 స్యైవోక్తా 4 శణఘుంటికా 5 మహాశణా 6 మాల్యపుష్పా 7 వామనీ 8 కటుతిక్తకా 9 వక్ర 10 అహిదంష్ట్ర 11 కాకోళీ 12 వృశ్చికా 13 వ్యాళిధూమికా 14 ధూమపత్రా 15 విశల్యా 16 విషఘ్న 17 నేత్రరోగహా 18 విషాణీ 19 దక్షిణావర్త 20 దేవలాంగూలికా యీ 20 న్ని తేలుమణిచెట్టుపేళ్ళు. (ఇది బల్లిలో భేదమని కొన్నినిఘంటులయందు చెప్పబడియున్నది.)

రెండవ తేలుమణిచెట్టు.

శ్లో॥ ద్వితీయాదక్షిణావర్తావృశ్చికాళీవిషాణికా ।
సమరావృశ్చిపత్రీచనిగాచనగవృశ్చికా ।
బదనీమేఘపుష్పీచతథానాపురపుష్పికా ॥

టీక॥ 1 దక్షిణావర్త 2 వృశ్చికాళి 3 విషాణికా 4 సమరా 5 వృశ్చిపత్రీ 6 నగవృశ్చికా 7 బదనీ 8 మేఘపుష్పీ 9 పురపుష్పికా యీ 9 న్ని రెండవ తేలుమణిచెట్టుపేళ్ళు.

తేలుమణిచెట్టు గుణము.

శ్లో॥ శణపుష్పీరసేతిక్తావామనీకఫపిత్తనుత్ ।
వీర్యవృద్ధికరీసాస్యాత్ రక్తనాళీపహారాపరం ।
నిరంతిచాస్యబీజానిగర్భఘ్నానీతి కేచనా ॥

తా॥ తేలుమణిచెట్టు వగరుగనుండు. మరియు నిది కఫము పిత్తము రక్తస్రావము వీటిని నివర్తింపంజేయుటయేగాక వీర్యవృద్ధికరముగనుండు. మరియు నిది వమనకరముగనుండు. దీని విత్తులు గర్భస్రావమును గలుగంజేయునని కొందరు వచించెదరు.

దొండ.

శ్లో॥ బింబీరక్తఫలాగోష్ఠాతుండీదంతచ్ఛదోపమా ।
మధుపక్వామహాద్రాక్షీశ్లేష్మకృద్బోధనాశినీ॥

టీక॥ 1 బింబీ 2 రక్తఫలా 3 గోష్ఠా 4 తుండీ 5 దంతచ్ఛదోపమా 6 మధుపక్వా 7 మహాద్రాక్షీ 8 శ్లేష్మకృత్ 9 బోధనాశినీ యీ 9 న్ని దొండపేళ్ళు.

దొండ గుణము.

శ్లో॥ బింబీవాంతిప్రదాహంతిరక్తపిత్తాస్రకామిలాః ।
తత్ఫలంశీకలంస్వాదుగురుపిత్తాస్రదాహజిత్ ।
స్తంభనంలేఖనంవాతవిబంధాధ్మానకారకమ్ ॥

తా॥ దొండ వమనము జేయించును. మరియు రక్తపిత్తము రక్తదోషము కామిల వీటిని బోగొట్టును దొండపండు చలువజేసును. రుచిగనుండును గురుత్వము జేయును. పిత్తరక్తము తాపము వీనిని బోగొట్టును. వీర్యస్తంభనముజేయును. రేఖనకారిగనుండును మరియు నిది వాతము మలబద్ధము కడుపుబ్బరము వీటిని గలుగంజేయు.

తియ్యదొండ.

శ్లో॥ మధుతుండీరక్తఫలాతుండికేరీఫలామతా ।
ఓష్ఠోపమఫలాదీర్ఘాపీలుపర్ణీచతుండికా ।
ఛర్దినీతిత్తిరిఫలాస్త్రైవకాంచననామికా ॥

టీక॥ 1 మధుతుండీ 2 రక్తఫలా 3 తుండికేరీఫలా 4 ఓష్ఠోపమఫలా 5 దీర్ఘా 6 పీలుపర్ణీ 7 తుండికా 8 ఛర్దినీ 9 తిత్తిరిఫలా 10 కాంచననామికా యీ 10 న్ని తియ్యదొండపేళ్ళు.

తియ్యదొండ గుణము.

శ్లో॥ వమనీకఫపిత్తాస్రశోషపాండుక్షయాపహా ।
తస్యాఃఫలంగురుస్తన్యంశ్వాసకాసనివారణమ్ ॥

తా॥ తియ్యదొండ వాంతినిజేయించును. మరియు కఫము పిత్తము రక్తదోషము వాపు. పాండువు క్షయము వీనిని బోగొట్టును. దీనిఫలము గురుత్వముజేసును. బాలను వృద్ధిజేసును. శ్వాసను కాసను వాతము వీటిని బోగొట్టును.

ఆరుదొండ.

శ్లో॥ ఆర్జటస్స్యాదార్తగళోబహుకంటః ప్రఘుషణః॥

టీక॥ 1 ఆర్జట 2 ఆర్తగళ 3 బహుకంటక 4 ప్రఘుషణ యీ 4 న్ను ఆరుదొండ పేళ్ళు.

ఆరుదొండ గుణము.

శ్లో॥ ఆర్జటస్తువరశ్శీతో వ్రణశోధనరోపణః ॥

తా॥ ఆరుదొండ వొగటుగ శీతలముగనుండును, మరియు వ్రణములను శోధించి మాన్పును.

లింగదొండ.

శ్లో॥ లింగినీబహుపత్రీస్యాదీశ్వరీశైవవల్లరీ ।
స్వయంభూలింగసంభూతాలింగాచిత్రఫలాన్వితా ।
చండాలింగంగజాదేవీచండాయస్తంభినీతథా ॥

టీక॥ 1 లింగినీ 2 బహుపత్రీ 3 ఈశ్వరీ 4 శైవవల్లరీ 5 స్వయంభూ 6 లింగసంభూతా 7 లింగా 8 త్రిఫలాన్వితా 9 చండః 10 లింగ 11 గజా 12 దేవీ 13 చండా 14 అయస్తంభినీ యీ 14 న్ను లింగదొండ పేళ్ళు.

లింగదొండ గుణము.

శ్లో॥ లింగినీకటురుష్ణాచదుర్గంధాచరసాయనీ ।
సర్వసిద్ధికరీదివ్యాస్యాద్వరనసశోధినీ॥

తా॥ లింగదొండ కారముగను ఉష్ణముగను తియ్యగను దుర్వాసనకలదిగను మిగుల బలకారిగనునుండు. సర్వసిద్ధులనిచ్చును నాలుకను శోధించును.

కాకిదొండ.

శ్లో॥ కాకనాసాధ్వాంక్షనాసాకాకతుండాధ్వజా కా ।
మురంగీస్యాద్రక్తఫలాతుండికేశసనాస్థలా ॥

టీక॥ 1 కాకనాసా 2 ధ్వాంక్షనాసా 3 కాకమండూకపర్ణికా 4 సురంగీ 5 రక్తఫలా 6 తుండికేశీ యీ 6 న్ను కాకిదొండపేళ్లు.

కాకిదొండ గుణము.

శ్లో॥ సురంగీచ ఫలేత్యుష్ణాతిక్తాచకఫనాశినీ।
అర్శసోనిచయంహాన్తికఫసంఘాతభేదినీ॥

తా॥ కాకిదొండపండు మిక్కిలి ఉష్ణముగను చేదుగనునుండు. మరియు నిది కఫము అనేకవిధములైన మూలరోగములు కఫరోగములు వీనిని నశింపంజేయు.

త్రిఫలానిర్ణయము.

శ్లో॥ హరీతక్యాస్త్రయోభాగాశ్చైవాద్వాదశభాగికా ;
షడ్భాగాస్సుర్విభీతస్యత్రిఫలేయంప్రకీర్తితా॥

తా॥ కరక్కాయ 3 భాగములు ఉశిరికకాయ 12 భాగములు తానికాయ 6 భాగములు యీ మూటిని యీ ప్రకారము చేర్చిన త్రిఫలవంబడు.

త్రిఫలముల పేర్లు.

శ్లో॥ త్రిఫలైతత్రయేణస్యాద్వరాశ్రేష్ఠాఫలోత్తమా॥

తా॥ కరక ఉసిరిక తాని అను నీమూడును త్రిఫలములనియు వరాయనియు ఫలోత్తమాయనియు జెప్పంబడు.

త్రిఫలముల గుణము.

శ్లో॥ త్రిఫలాకుష్ఠమేహార్శఃకఫపిత్తవినాశినీ।
చక్షుష్యారోపణీహృద్యావయస్థాపినీపరా॥

తా॥ త్రిఫలములు కుష్ఠువు మేహము అర్శస్సు కఫము పిత్తము వీనిని నశింపంజేయు. నేత్రములకు హితకారిగనుండు. వ్రణములనార్చును హృదయమునకు మేలుజేయును వయస్సును స్థాపించును.

కరక్కాయ.

శ్లో॥ హరీతకీభయాపథ్యాప్రాణదాప్రాణనామృతా।
[illegible] మోఘాహైమవతీవయస్థాశ్రేయసీశివా।
[illegible] నదోహేమశేరుద్రవారుదే॥

టీక॥ 1 హారీతకి 2 అభయా 3 పథ్యా 4 ప్రపథ్యా 5 పూతనా 6 అమృతా 7 జయా 8 అమోఘా 9 హైమవతీ 10 వయస్థా 11 శ్రేయసీ 12 శివా 13 నిమ్నినీ 14 ప్రాణదా 15 రోహిణీ 16 రుద్రవారుణీ యీ 16 న్ను కరక్కాయ పేర్లు.

### హారీతకీనామ కారణము.

శ్లో॥ హారస్యభవనేజాతాహారితాచస్వభావతః ।
హారయేత్సర్వరోగాంశ్చతేనప్రోక్తాహారీతకీ ॥

తా॥ కరక్కాయ పరమేశ్వరుని గృహమునందుబుట్టిన దగుటవలనను స్వభావము చే పచ్చగనుండుటవలనను సమస్తరోగముల హరింపంజేయునదగ నుండుటవలనను హారీతకీయని చెప్పంబడెను.

### హారీతక్యుత్పత్తి.

శ్లో॥ బిందవఃపతితాస్తస్య శక్రస్యపిబతోఽమృతం ।
మనుష్యాణాంహితార్థాయభూమౌసంజాతా హారీతకీ ॥

తా॥ ఇంద్రుం డమృతపానము చేయుచుండునపుడు ఏడమృత పానబిందువులు భూమియందుపడి మనుజుల హితార్థమై ఏడువిధములైన కరక్కాయ లుద్భవిల్లెను.

### కరక్కాయ భేదములు.

శ్లో॥ జీవంతీపూతనాపశ్చాదమృతావిజయాభయా ।
రోహిణీచేతకీసప్తభేదభిన్నాహారీతకీ ॥
సప్తానామపిజాతీనాంప్రధానంవిజయాస్మృతా ।
సుఖప్రయోగసులభాసర్వవ్యాధిషుశస్యతే ॥

తా॥ కరక్కాయ జీవన్తి పూతనా అమృతా విజయా అభయా రోహిణీ చేతకీ అనియేడువిధంబులుగనుండును. పైజెప్పిన యేడువిధముల కరక్కాయలలో విజయ యనునది ప్రధానము కాబట్టి సర్వరోగములయందు తొలుతనుపయోగించుటకు యోగ్యమైనది.

### హారీతకీసప్తవిధనామ కారణము.

శ్లో॥ జీవంతీజీవనోద్యోగాత్పావనాత్పూతనాస్మృతా ।
సుధావదమృతాజ్ఞేయవిజయావిజయప్రదా ।

నృణామభయదాయస్మాదభయాతత్ప్రకీర్తితా ।
రోహిణీతుగుణారోహాచ్చేతనాచ్చేతకీమతా ॥

తా॥ కరక్కాయ మనుజులకు ఆయుష్యమును వృద్ధిజేయుటవలన జీవంతియనియు శరీరమును పరిశుద్ధపరచుటవలన పూతనయనియు అమృతప్రాయముగ నుండుటవలన అమృతయనియు జయమునిచ్చుటవలన విజయయనియు భయమును బోగొట్టుటవలన అభయయనియు మంచిగుణము నిచ్చుటవలన రోహిణియనియు జ్ఞానములు గలుగజేయుటవలన చేతకియనియు సప్తవిధనామములను వహించె.

సప్తవిధహరీతకీ ఉత్పత్తి దేశము.

శ్లో॥ విజయావింధ్యదేశేషుకన్యాకుబ్జేషురోహిణీ ।
సౌరాష్ట్రేపూతనాచైవగంగాయాశ్చామృతాతటే ।
కాశ్మీరదేశేజీవంతీచేతకీహిమనద్గిరౌ ।
అభయావింధ్యదేశేషుజాతాచైవహరీతకీ ॥

తా॥ విజయయను కరక్కాయ వింధ్యదేశమునందును రోహిణియనునది కన్యాకుబ్జమునందును పూతనయనునది సౌరాష్ట్రదేశమునందును అమృతయనునది గంగాతీరమునందును జవంతియనునది కాశ్మీరదేశమునందును చేతకియనునది హిమవత్పర్వతమునందును అభయయనునది వింధ్యపర్వతమునందును జన్మించెను.

సప్తవిధహారీతకీ స్వరూప తదుపయోగము.

శ్లో॥ జీవంతీస్వర్ణవర్ణాభాపూతనాస్థిమతీయుతా ।అమృతామాంసలాప్రోక్తా విజయాతుంబరూపిణీ । పంచాంగిత్వభయాజ్ఞేయాస్మృతావృత్తాతురోహిణీ।త్ర్యంగితుచేతకీజ్ఞేయాకర్మతాసామథోచ్యతే ॥ సర్వరోగేషుజీవంతీప్రలేపేపూతనాహితా। శద్ధ్యర్థమమృతాప్రోక్తావిజయాసర్వరోగహృత్ ।అక్షిరోగేఽభయాశస్తారోహిణీవ్రణరోహిణీ । చేతకీచూర్ణయోగేస్యాత్సప్తధైవప్రకీర్తితా ॥

తా॥ జీవంతియను కరక్కాయ బంగారువంటి వర్ణముకలదైయుండును పూతనయనునది నరములతోఁగూడియుండును. అమృతయనునది విశేషమజ్జతోఁ గూడియుండును. విజయయనునది సొరకాయవలెనుండును. అభయయనునది 5 అంచు

లతో గూడియుండును. రోహిణియనునది గుండుగనుండును. చేతకి అనునది 3 అంచులతో గూడియుండును. జీవంతి యనునది సమస్తరోగములయందును పూతనయనునది లేపనమునందును అమృతయనునది శరీరశోధనమునందును విజయయనునది సర్వరోగములబోగొట్టుటయందును అభయయనునది నేత్రరోగమునందును రోహిణియనునది వ్రణములనార్చుటయందును చేతకియనునది చూర్ణయోగమునందు నుపయోగించును.

## ప్రశస్తహరీతకీ స్వరూపము.

శ్లో॥ కాలయోగాత్స్వయంపాకా త్ప్రాప్తితాతుమహీతలే । నవా స్నిగ్ధాఘనావృత్తాగుర్వీక్షిప్తాచయాంభసి । నిమజ్జేత్సాప్రశస్తా స్యాద్రోగఘ్న్యతిగుణప్రదా । శోణాచ్ఛిన్నాగుడనిభాకించిత్కల్పాకషాయిణీ। స్థూలత్వక్సరసాస్వల్పబీజాగుర్వీహరీతకీ ॥

తా॥ కాలక్రమమున బాగుగపండి భూమిపైరాలినదియు క్రొత్తగను నున్నగను గట్టిగను గుండ్రముగను లావుగను నీళ్ళలోవైచిన మునుగునదిగను యెఱ్ఱగను గల్గిన లోపల బెల్లపు వర్ణములో తుల్యమైన వర్ణముకలదిగను కొంచము వగరుగను లావుగనుండు. బెరడుగలదై రసముతోగూడి చిన్నవిత్తులు గలిగియుండునదియునైన కరక్కాయ మిక్కిలి ప్రశస్తమైనదగుటచే నది సమస్తరోగములబోగొట్టి సుగుణముల నిచ్చును.

## కరక్కాయ గుణము.

శ్లో॥ బీజాస్థితిక్తామధురాతదంతా త్వద్భాగతస్యా త్కటురుష్ణవీర్యా । మాంసాంశతశ్చామ్లకషాయయుక్తా హరీతకీపంచరసాశ్రితేయం॥ హరీతకీపంచరసాలవణాతుపరోత్కటా।రూక్షోష్ణాదీపనీమేధ్యాస్వాదుపాకారసాయనీ। సరాబుద్ధిప్రదావృష్యా చక్షుష్యాబృంహణీలఘుః । శ్వాసకాసప్రమేహార్శః కుష్ఠశోథోదరాస్కృమీన్ । వైస్వర్యగ్రహణీదోష విబంధవిషమజ్వరాన్ । గుల్మాధ్మానవ్రణచ్ఛర్ది హిక్కాకం డూహృద్దామయాన్ । విబంధంసోతిసాంపాండుమూరుస్తంభమరోచకం। కామిలాంశూలమానాహంప్లీహానంచాపకర్షతి । మధురామ్లతయావాతంకషాయస్వాదుభావతః । పిత్తంహంతికఫంహంతికటుకేనహరీతకీ ॥ చర్వితావర్ధయత్యగ్నింపేషితామల

శోధనీ । స్విన్నాసంగ్రాహిణీప్రోక్తా భ్రిష్టాపథ్యాన్నదోషనుత్ ॥ చేతకీచధృతాహస్తేయావత్తిష్ఠతిదేహినః । తావద్విరిచ్యతేదేహీతత్ప్రభావాన్నసంశయః । క్వచిదాస్వాదనాదేవ క్వచిదాఘ్రాణమాత్రతః । క్వచిత్స్పర్శనమాత్రేణక్వచిద్దర్శనమాత్రతః । మలాన్విసర్జయేచ్చైవప్రభావేనహరీతకీ॥ హరీతకీమనుష్యాణాంమాతేవహితకారిణీ । కదాచిత్కుప్యతేమాతా నోదరస్థాహరీతకీ ॥ హరితకీమనుష్యాణాం సుఖోపాయంరసాయనం ॥ పథ్యత్వేచవరాప్రోక్తాసర్వామయవినాశినీ ॥ ఉన్మీలినీబుద్ధిబలేంద్రియాణాం నిర్మూలినీపిత్తకఫానిలానాం । సంశోధనీమూత్రశకృన్మలానాం హరీతకీపథ్యతమానరాణాం॥

తా॥ కరక్కాయయొక్కవిత్తు దానిఅస్థి ఇవి చేదుగను కరక్కాయయొక్క మధ్యభాగము మధురముగను దానిబెరడు కారముగను ఉష్ణమైన వీర్యముకలదిగను దానిమాంసము పుల్లగను వగరుగను నుండుటవలన కరక్కాయ తిక్తాది 5 విధములైన రసములు కలదైయుండును. మరియు నిది ఉష్ణగను మిక్కిలి వగరుగనునుండు. [illegible]క జేసును. ఉష్ణముగనుండును. అగ్నిదీపనమునుజేసును గ్రంథాకర్షణ శక్తినిచ్చును. పాకమువలన రుచిగను ఆయురారోగ్యవృద్ధికారిగను వేగముగలదిగనుముండు బుద్ధినిచ్చును. మరియు శుక్లవృద్ధి నేత్రములకు హితము శరీరపుష్టి వీట్లను గలుగంజేయు. తేలికనిచ్చును. మరియు నిది శ్వాసము కాసము ప్రమేహము మూలశంక కుష్టువు వాపు ఉదరరోగము నులిపురుగులు స్వరభంగము గ్రహణీ మలబద్ధము విషమజ్వరము గుల్మము ఆధ్మానము వ్రణములు వాంతి ఎక్కిళ్ళు దురద హృద్రోగము స్రోతస్సుల నడ్డగించుట పాండువు ఊరుస్తంభము అరుచి కామిలి శూల కడుపుబ్బరము ప్లీహము వీట్లను నశింపంజేయు. కరక్కాయ మధురముగను పుల్లగను నుండుటవలన వాతమును వగరుగనుండుటవలన పిత్తమును కారముగనుండుటవలన కఫమును బోగొట్టును. కరక్కాయ నమిలిన అగ్నిదీప్తిని గలుగంజేయు. నూరిపుచ్చుకొనిన విరేచనమును జేయించు. ఉడికించి పుచ్చుకొనిన మలమును గట్టిపరచును. వేయించిపుచ్చుకొనిన అన్నదోషమును బోగొట్టును. చేతకి యను కరక్కాయను చేతనుంచుకొని యుండు వరకు విరేచనములగును. మంచికరక్కాయను తినుటవల్లను వాసన జూచుటవల్లను తాకుటవల్లను చూచుటవల్లను మలోత్సర్గమును జేయించు. కరక్కాయ తల్లివలె

నేమనుజులకు హితము జేయుచుండును. మరియు సుఖమునిచ్చునట్టి రసాయనౌషధముగనుండును. సమస్తరోగముల నశింపజేయు. బుద్ధి బలము ఇంద్రియములు వీటిని వృద్ధిపరచును. వాతపిత్తకఫ ప్రకోపమును శమింపజేయు. మలమూత్రములు సప్తమలములు వీటిని బాగుగశోధించును. కావున కరక్కాయ మనుజులకు మిక్కిలి పథ్యకరమైనదిగనుండును.

హారీతకీ సేవనానర్హులు.

శ్లో॥ తృష్ణాయాంకంఠశోషేచహనుస్తంభేగళగ్రహే ।
నవజ్వరేతథాక్షీణేనప్రశస్తాహారీతకీ ॥
అధ్వాతిఖిన్నఃపరిహీనదేహోరూక్షఃకృశోలంఘనకర్శితశ్చ ।
పిత్తామయీగర్భవతీచనారీవిముక్తరక్తాస్త్వభయాంనఖాదేత్ ॥

తా॥ దప్పి గొంతెండుట హనుస్తంభము గళగ్రహము నవజ్వరములు శరీరక్షయము వీనియందు కరక్కాయ అప్రశస్తము. మరియు మార్గాయాసము హీనదేహము రూక్షకృశత్వము లంఘనముచే కృశించుట పిత్తరోగము ఇవిగలవారు గర్భిణీస్త్రీలు రక్తస్రావము చేయబడినవారు వీరలు కరక్కాయను భక్షింపజనదు.

హారీతక్యుపయోగము.

శ్లో॥ అనిలంసుసితంగుడతైలయుతంఘృతశర్కరయాసహపిత్తమపి ।
మధుపిప్పలిభిశ్చకఫంసుసితంశమయేచ్ఛమయేచ్ఛమయేదభయా

తా॥ కరక్కాయను బెల్లము తైలము వీటితో సేవించిన వాతప్రకోపమును నెయ్యి చక్కెర వీటితో సేవించిన పిత్తప్రకోపమును తేనె పిప్పళ్లు వీటితో సేవించిన కఫప్రకోపమును నశింపజేయు.

శ్లో॥ గ్రీష్మేతుల్యగుడాంసుసైంధవయుతాంమేఘావనద్ధాంబరేతుల్యాం
శర్కరయాశరద్యమలయాం శుంఠ్యాతుషారాగమే । పిప్ప
ల్యాశిశిరేవసంతసమయేక్షౌద్రేణసంయోజితాం। రోగాన్ హంతి
హారీతకీచసివిధాన్ తాన్ హ్యయధాపన్నగాన్ ॥

తా॥ కరక్కాయను యెండకాలమునందు బెల్లముతోను వర్షాకాలమునందు సైంధవలవణముతోను శరత్కాలమునందు తెల్లచక్కెరతోను హేమంతకాలమునందు శొంఠితోను శిశిరకాలమునందు పిప్పళ్లతోను వసంతకాలమునందు తేనెతోనుచేర్చి

భుజించిన " గరుత్మంతుడు సర్పముల నశింపంజేయునటుల " సర్వరోగములను నశింపం జేయు.

## తాడికాయ.

శ్లో॥ విభీతకఃకర్షఫలో వాసంతోఽక్షఃకలిద్రుమః । సంవర్తకో భూతవాసఃకలివృక్షోవిభీదకః । హార్యోపవనసంభూతసుమూలో బహువీర్యకః । సంఘాతుస్తుషజాతశ్చవింధ్యవాసీవసంతకః। బహువీర్యవరాలక్ష్మీర్వినాశోఽక్షఫలస్మృతః॥

టీక॥ 1 విభీతక 2 కర్షఫల 3 వాసంత 4 అక్ష 5 కలిద్రుమ 6 సంవర్తక 7 భూతవాస 8 కలివృక్ష 9 విభీదక 10 ఉపవనసంభూత 11 సుమూల 12 బహువీర్యక 13 సంఘాత 14 తుషజాత 15 వింధ్యవాసీ 16 వసంతక 17 బహువీర్యవరా 18 లక్ష్మీ 19 వినాశ 20 అక్షఫల యీ 20 న్ని తాడికాయ పేళ్లు.

## తాడికాయ గుణము.

శ్లో॥ విభీతకఃకటుఃపాకీలఘుశ్శీతో బలాసనుత్ ।
కాసాక్షికఫవాతఘ్నః కేశవృద్ధికరఃపరః॥

తా॥ తాడికాయ చేదుగను మలకనగను శీతముగనునుండు. మరియు నిది బలాసరోగము కాసము నేత్రరోగము కఫము వాతము వీటిని నశింపంజేయుటయే గాక కేశవృద్ధికరముగను జీర్ణకారిగనునుండు.

## ఉసిరిక.

శ్లో॥ వయస్థామలకంవృష్యంధాత్రీఫలరసంశివం ।
ధాత్రీఫలంశ్రీఫలంచతథామృతఫలంస్మృతం ।
అమలకీశీతఫలీశీతామృతఫలంస్మృతం ॥

టీక॥ 1 వయస్థ 2 అమలక 3 వృష్య 4 ధాత్రీ 5 ఫలరస 6 శివ 7 ధాత్రీఫల 8 శ్రీఫల 6 అమృతఫల 10 అమలకీ 11 శీతఫలీ 12 శీతామృతఫల యీ 12 న్ను ఉసిరిక పేళ్ళు.

## ఉసిరిక గుణము.

శ్లో॥ కషాయకటుతిక్తామ్లంస్వాదుకేశ్యంహిమంలఘు ।
త్రిదోషశమనంవృష్యంకఫజ్వరవినాశనం ॥

తా॥ ఉసిరిక కారముగను చిరుచేదుగను వగరుగను పుల్లగను రుచికరముగను శీతలముగను లఘువుగనునుండు. మరియు నిది త్రిదోషములు కఫము జ్వరము వీటిని నశింపజేయుటయేగాక వీర్యవృద్ధికరముగను కేశవృద్ధికరముగనునుండు.

పుస్తుకాంతిరే.

శ్లో॥ తద్వద్ధాత్రీఫలంవృష్యంవిశేషాద్రక్తపిత్తజిత్ ।
అమ్లత్వాత్పవనంహంతిపిత్తంమాధుర్యశైత్యతః ।
కఫంరూక్షకషాయత్వాత్ఫలస్మాత్త్రిమధికంఫలం ॥

తా॥ ఉసిరిక కరక్కాయతో సమానమైన గుణముగలదిగ నుండుటయేగాక విశేషముగ రక్తపిత్తమును బోగొట్టును. శుక్రమును వృద్ధిజేయును. మఱియు నిది పుల్లగనుండుటవలన వాతమును తియ్యగ శీతలముగనుండుటవలన పిత్తమును రూక్షగ వగరుగ నుండుటవలన కఫమును బోగొట్టును.

రేల.

శ్లో॥ కర్ణికారోరాజవృక్షఃప్రగ్రహఃకృతమాలకః। సారోగ్యశింబీ శమ్యాకో వ్యాధిఘాతో వఘాతకః । ఆరగ్వధో దీర్ఘఫలో వ్యాధిఘ్నశ్చతురంగుళః । ఆరేవత స్తథాకర్ణీకర్ణికారో ధరేచకః।కుండలీహేమపుష్పశ్చపరివ్యాధోనృపద్రుమః।స్వర్ణశేఫాలికాస్వర్ణా కుష్ఠసూదనఏవచ । స్వర్ణశల్యామఘాతశ్చ స్వర్ణద్రుమఃక్రిమిమారకః ॥

టీక॥ 1 కర్ణికార 2 రాజవృక్ష 3 ప్రగ్రహ 4 కృతమాలక 5 సారోగ్య 6 శింబీ 7 శమ్యాక 8 వ్యాధిఘాత 9 అవఘాతక 10 ఆరగ్వధ 11 దీర్ఘఫల 12 వ్యాధిఘ్న 13 చతురంగుళ 14 ఆరేవత 15 కర్ణీ 16 కర్ణికార 17 రేచక 18 కుండలీ 19 హేమపుష్ప 20 పరివ్యాధ 21 నృపద్రుమ 22 స్వర్ణశేఫాలికా 23 స్వర్ణా 24 కుష్ఠసూదన 25 స్వర్ణశల్యా 26 అఘఘాత 27 స్వర్ణద్రు 28 క్రిమిమారక యీ 28 న్ని రేలపేళ్ళు.

రేల గుణము.

శ్లో॥ ఆరగ్వధోగురుస్స్వాదుశ్శీతలోమృదురేచనః । జ్వరహృద్దోగిపిత్తాస్రవాతోదావర్తశూలనుత్ । తత్ఫలంస్రంసనంరుచ్యం గ్రాహికంపిత్తకఫాపహం । తస్మజ్జామధురాపాకే తిక్తాస్నిగ్ధా

సమీరజిత్ । పత్రాణి రేచకాణిస్యుః కఫమేదోహరాణిచ ।
తత్ఫలంమధురంబల్యంవాతపిత్తజ్వరాన్ హరేత్ ॥

తా॥ రేలగురుత్వముజేసును. రుచినిపుట్టించును చల్లగనుండును. కొంచెముగ విరేచనముజేయించును. మరియు జ్వరము హృద్రోగము పిత్తరక్తము వాతము ఉదావర్తము శూల వీటిని నశింపంజేయు. రేలపూలు వాతమునుజేసును. మలమును బంధించును చేదుగనుండును. మరియు పిత్తము కఫము వీనిని బోగొట్టును. రేలగుజ్జు పాకమువలన మధురముగను చేదుగనునుండు. పిత్తము వాతము వీటిని బోగొట్టును. రేలాకు విరేచనమును జేయించు కఫము మేదోరోగము వీనిని బోగొట్టును. రేలపండు మధురముగను బలకారిగనుండు. మరియు వాతము పిత్తము జ్వరము వీట్లను నశింపంజేయు.

## పిన్నదంతి.

శ్లో॥ దంతీశీఘ్రానికుంభాన్యాదుపచిత్రామకూలికా ।
పదోదుంబరపర్ణీచ విశల్యాచగుణప్రియా ॥

టీక॥ 1 దంతీ 2 శీఘ్రా 3 నికుంభా 4 ఉపచిత్రా మకూలికా 5 పద 6 ఉదుంబరపర్ణీ 7 విశల్యా 8 గుణప్రియా యీ 8 న్ను పిన్నదంతి పేళ్ళు. దీనినే నేలదంతీ యని చెప్పుదురు.

## పెద్దదంతి.

శ్లో॥ వరుణీచవరాంగీచతెర్థ్వ వచదజయాపహా ।
ఆవర్తకా కేశరుహాచ్ఛ వృషభద్రకా ।
విశోధనీ శ్యేనఘంటామధుపుష్పచ్ఛదాతథా ।
నాగస్ఫోటావిశాలాచకర్తై ఏరండఫలాచనా ॥

టీక॥ 1 వరణీ 2 వరాంగీ 3 జయాపహా 4 ఆవర్తకా 5 కేశరుహా 6 వృషభద్రకా 7 విశోధనీ 8 శ్యేనఘంటా 9 మధుపుష్పచ్ఛదా 10 నాగస్ఫోటా 11 విశాలా 12 కర్త్రీ 13 ఏరండఫలా యీ 13 న్ను పెద్దదంతి పేళ్లు.

## దంతీద్వయ గుణములు

శ్లో॥ దంతీతిక్తోష్ణకటుకాకఫవాతోదరాపహా ।
అర్శోవ్రణాశ్మరీశూలంహంతిదీపనశోధనీ ॥

తా॥ దంతి వగరుగను ఉష్ణముగను చేదుగనునుండు. మరియు నిది కఫము వాతము మహోదరము అర్శస్సు వ్రణము మూత్రకృచ్ఛ్రము శూల వీటిని నశింపం జేయుటయేగాక అగ్నిదీపనము మలశోధనము వీటిని గలుగంజేయు.

ఎలుకచెవియాకు.

శ్లో॥ ద్రవంతీశంబరీచిత్రాన్యగ్రోధీమూషికాహ్వయా ।
ప్రత్యక్శ్రేణీపరాగండాపత్రశ్రేణ్యాఖుపర్ణికా ।
కృషికావృకపర్ణీచపత్రపంజ్యలికాతథా ।
మాతాభూమిచరాస్సైవజుంకపర్ణీచనామతః ॥

టీక॥ 1 ద్రవంతీ 2 శంబరీ 3 చిత్రా 4 న్యగ్రోధీ 5 మూషికాహ్వయా 6 ప్రత్యక్శ్రేణీ 7 విషా 8 గండా 9 పత్రశ్రేణీ 10 ఆఖుపర్ణికా 11 కృషికా 12 వృకపర్ణీ 13 పత్రపంజీ 14 అలికా 15 మాతా 16 భూమిచరా 17 జుంకపర్ణీ యీ 17 న్ను ఎలుకచెవియాకు పేర్లు.

ఎలుకచెవియాకు గుణము.

శ్లో॥ ఆఖుపర్ణీరసేస్వాదుః ప్రమేహాబహుమూత్రజిత్ ।
కఫపిత్తజ్వరేపాండుక్రిమికుష్ఠభగందరే ॥

తా॥ ఎలుకచెవియాకు రుచికరముగనుండు. ఇది ప్రమేహము బహుమూత్రము కఫము పిత్తము జ్వరము పాండు క్రిమిరోగము కుష్ఠము భగందరము వీటియందు ప్రయోగించిన వీని నివర్తించును.

చిన్నఎలుకచెవియాకు గుణము.

శ్లో॥ లఘ్వాఖుకర్ణీకటుకాతిక్తోష్ణాశీతలాసరా ।
రసాయనిహాల్లఘ్వీనహాయాంకఫపిత్తనుత్ ।
శూలజ్వరకృమిగ్రంథిమూత్రకృచ్ఛ్రప్రమేహహా ।
ఆనాహోదరహృద్రోగవిషపాండుభగందరాన్ ॥

తా॥ చిన్నఎలుకచెవియాకు కారముగను చేదుగను ఉష్ణముగను శీతలముగను శరీరమున శీఘ్రముగ వ్యాపించదగిన స్వభావము కలదిగనునుండు. ఆయురారోగ్యముల వృద్ధిజేయును. చులకనగ వగరుగనుండును. మరియు కఫము పిత్తము శూల జ్వరము కృములు గ్రంథులు మూత్రకృచ్ఛ్రము ప్రమేహము కడుపుబ్బరము ఉదరరోగము హృద్రోగము విషపాండువు భగందరము వీట్లను నశింపంజేయు.

ఎలుకచెవియాకుకూర గుణము.

శ్లో॥ తచ్ఛాకంమధురంబల్యంప్రమేహంబహుమూత్రకం।
కఫపిత్తంహరేద్వాతంమలమూత్రవిబంధకం ॥

తా॥ ఎలుకచెవియాకుకూర మధురముగనుండును. బలమునిచ్చును. మరియు ప్రమేహము బహుమూత్రము కఫపిత్తము వాతము మలమూత్రనిరోధనము వీటిని హరింపంజేయును.

నీలి.

శ్లో॥ నీలినీనీలికాకాళాగ్రామ్యాతూశేవిశోధనీ । తుచ్ఛాశ్రీఫలికా మేళాభారవాహీంచరంజనీ। వృత్తికానీలపుష్పాచఖ్యాతా జనక కేశికా । నీలప్రారుణికాకృష్ణాక్లీతకంనీలకేశికా । చారటీప్రవ స్రాప్రోక్తాగంధపుష్పఫలామృతా। ఉపభూతా కేశరుహాతథైవ భృశపత్రకః।అవర్తవర్ణానాక్షీచతథైవచజయాపహా ॥

టీక॥ 1 నీలనీ 2 నీలికా 3 కాళా 4 గ్రామ్యా 5 తూశీ 6 విశోధనీ 7 తుచ్ఛా 8 శ్రీఫలికా 9 మేళా 10 భారవాహీ 11 రంజనీ 12 వృత్తికా 13 నీలపుష్పా 14 జనకేశికా 15 నీలప్రారుణికా 16 కృష్ణా 17 క్లీతక 18 నీలకేశికా 19 చారటీ 20 గంధపుష్పఫలా 21 అమృతా 22 ఉపభూతా 23 కేశరుహా 24 భృశపత్రక 25 అవర్తా 26 వర్ణానా 27 అక్షీ 28 జయాపహా యీ 28 న్ని నీలిపేర్లు.

నీలి గుణము.

శ్లో॥ నీలీతిక్తరసోష్ణాచకటుస్వాదుఃకఫాపహా ।
కేశ్యావిషోదరంహంతివాతాసృక్క్రిమినాశినీ।
హృద్రోగశోథకుష్ఠఘ్నీ తాంచగుల్మేషుయోజయేత్ ॥

తా॥ నీలి వగరుగను ఉష్ణముగను చేదుగను రుచ్యముగనుండు. మరియు విది కఫము విషము మహోదరము వాతము రక్తదోషము క్రిమిరోగము హృద్రోగము శోథ కుష్ఠము గుల్మము వీటిని నివర్తింపంజేయుటయేగాక కేశవృద్ధి కరముగనుండు.

జై ము డు.

శ్లో॥ స్నుక్ స్నుహీ ధామమహావృక్షో మూర్ధాసిస్యంకపత్రకః।
సమంతదుగ్ధోదండీరిసాహుండో నిజకంటకః।
వజ్రవృక్షో బహుస్రావో బహుక్షీరవిషాణికా ॥

టీక॥ 1 స్నుక్ 2 స్నుధా 3 మహావృక్ష 4 మూఢ 5 నిస్త్రింశపత్రక 6 సమంతదుగ్ధ 7 దండీరి 8 సాహుండ 9 వజ్రకంటక 10 వజ్రవృక్ష 11 బహుస్రావ 12 బహుక్షీరి 13 విషాణికా యీ 13 న్ని జెముడు పేళ్ళు.

జెముడు గుణము.

శ్లో॥ వజ్రీపయోరసేతిక్తో గురూష్ణః కఫవాతజిత్ ।
ప్లీహోదరార్శో గుల్మాన్నిహంతి వ్రణవిశోధనః ।
దీపనశ్చాష్టశూలఘ్నః పాండుశ్వయథురోగజిత్ ॥

తా॥ జెముడు వగరుగను గురుత్వముగను ఉష్ణముగనునుండు. ఇది కఫము వాతము ప్లీహము మహోదరము అర్శస్సు గుల్మము వ్రణము 8 విధములైన శూలలు పాండురోగము వాపు వీటిని నివర్తింపంజేయుటయేగాక అగ్నిదీపనమును సగా గంగంజేయు.

బొంత జెముడు.

శ్లో॥ వజ్రతుండో మహావృక్షో గండీరస్స్నుక్సుధాస్నుహీ ।
వజ్రవృక్షో బహుస్రావో బహుక్షీరో వృషాణికా ॥

టీక॥ 1 వజ్రతుండ 2 మహావృక్ష 3 గండీర 4 స్నుక్ 5 సుధా 6 స్నుహీ 7 వజ్రవృక్ష 8 బహుస్రావ 9 బహుక్షీర 10 వృషాణికా యీ 10 న్ని బొంత జెముడు పేళ్ళు.

బొంత జెముడు గుణము.

శ్లో॥ వజ్రపయోరసస్తిక్తో గురూష్ణః కఫశోఫజిత్ ।
ప్లీహోదరార్శో గుల్మాన్నిహంతి వాతస్యశోధనః ॥

తా॥ బొంతజెముడుపాలు దానిరసము చేదుగను గురుత్వముగను కారగను నుండు. మరియును నిది కఫము వాపు ప్లీహము ఉదరరోగము అర్శస్సు గుల్మము వీటిని నశింపంజేయు. మరియును నిది వాతమును శోధించును.

జెముడుఆకు గుణము.

శ్లో॥ స్నుహ్యాస్తుపర్ణంరుచిదంకటుకంచాగ్నిదీపనమ్ ।
కుష్ఠాష్ఠీలావాతశూలాన్ హంతిశోథోదరాణిచ ॥

తా॥ జెముడుఆకు రుచిగను కారముగనునుండు. అగ్నిదీపనమును గలుగం జేయును. మరియును నిది కుష్ఠువు అష్ఠీలవాతము శూల వాపు ఉదరరోగము వీనిని బోగొట్టును.

కోలజెముడు.

శ్లో॥ సమంతదుగ్ధాసింహతుండో వజ్రోయామళకంటకః ॥

టీక॥ 1 సమంతదుగ్ధా 2 సింహతుండ 3 వజ్ర 4 యామళకంటక యీ 4 న్ను కోలజెముడు పేర్లు.

కోలజెముడు గుణము.

శ్లో॥ సేహుండః కటుక స్తిక్త శ్శోష్ణ స్తీక్ష్ణః ప్రదీపనః ।
సరో గురుర్వాంతికరః కుష్ఠోదరవినాశకః ।
ప్లీహవాతప్రమేహఘ్న శ్శూలామకఫశోధనుత్ ।
గుల్మాష్ఠీలాధ్మానపాండుకఫోదరవ్రణజ్వరాన్ ।
ఉన్మాద వాతం మేదంచ వృశ్చికస్య విషం హరేత్ ॥

తా॥ కోలజెముడు కారముగను చేదుగను ఉష్ణముగనునుండు తాపము నిచ్చును. అగ్నిదీప్తిని గలుగం జేయును. వేగము కలదిగనుండు. గురుత్వము చేయును. వాంతిని గలుగంజేయును. మరియును నిది కుష్ఠువు ఉదరరోగము ప్లీహము వాతము ప్రమేహము శూల ఆమము కఫము వాపు గుల్మము అష్ఠీలకవాతము కడుపుబ్బరము పాండువు కఫోదరము వ్రణము జ్వరము ఉన్మాదము వాతము మేదోరోగము తేలువిషము వీనిని బోగొట్టును.

ఆకుజెముడు.

శ్లో॥ దళస్నుహీ శ్వానజిహ్వా పత్రస్నుక్ స్నువి రేచనీ ॥

టీక॥ 1 దళస్నుహీ 2 శ్వానజిహ్వా 3 పత్రస్నుక్ 4 సువిరేచనీ యీ 4 న్ను ఆకుజెముడు పేర్లు.

ఆకుజెముడు గుణము.

శ్లో॥ కఫగుల్మోదరహరం స్నుహీక్షీరం విరేచనం ।
శాఖాస్నుహీపయస్తై ్ ఏవం సర్వక్రిమిగుదార్తిజిత్ ।
ఉష్ణస్నిగ్ధగుణసంయుక్తం నటుపత్రస్నుహీపయః ॥

తా॥ జెముడుపాలు కఫము గుల్మము ఉదరరోగము వీటిని బోగొట్టును. కోల జెముడుపాలు సమస్తమైన క్రిమిరోగములను మూలములను బోగొట్టును. ఆకుజెముడు పాలు కారముగనుండుటయేగాక జెముడుపాల గుణములకంటె కొంచము తక్కువ గుణములు గలదైయుండును.

సంబరేణు.

శ్లో॥ సాతళాసప్తళానారివిద్రుళావిమలామతా ।
బహుఫేనాచర్మకానాఫేనాదీప్తామరాళికా ॥

టీక॥ 1 సాతళా 2 సప్తళా 3 సారీ 4 విద్రుళా 5 విమలా 6 బహుఫేనా 7 చర్మకాసా 8 ఫేనా 9 దీప్తా 10 మరాళికా యీ 10 న్ని సంబరేణు పేళ్ళు.

సంబరేణు గుణము.

శ్లో॥ సాతళాచరసతిక్తానికఫపిత్తత్రిదోషహృత్ ।
ప్లీహగుల్మోదరంశోఫంపాండురోగంహరేత్పరం॥

తా॥ సంబరేణు వగరుగనుండు. ఇది కఫము పిత్తము త్రిదోషములు ప్లీహము గుల్మము మహోదరము శోఫ పాండురోగము వీటిని నశింపంజేయు.

కాంచనక్షీరి.

శ్లో॥ క్షీరిణీకాంచనక్షీరీకటుపర్ణీతుకర్షణీ ।
తిక్తదుగ్ధాహైమవతీహిమదుగ్ధాహిమావతీ ॥

టీక॥ 1 క్షీరిణీ 2 కాంచనక్షీరి 3 కటుపర్ణీ 4 కర్షణీ 5 తిక్తదుగ్ధా 6 హైమవతీ 7 హిమదుగ్ధా 8 హిమావతీ యీ 8 న్ని కాంచనక్షీరి పేళ్ళు.

స్వర్ణక్షీరి.

శ్లో॥ స్వర్ణక్షీరీస్వర్ణదుగ్ధాసువర్ణక్షీరికాపిచ ।
హేమాహ్వాకనకక్షీరీహిమక్షీరీచకాంచనీ ।
హిమాద్రిజాపీతదుగ్ధాస్వర్ణబాధాసహామతా॥

టీక॥ 1 స్వర్ణక్షీరి 2 స్వర్ణదుగ్ధా 3 సువర్ణక్షీరికా 4 హేమాహ్వా 5 కనకక్షీరి 6 హిమక్షీరి 7 కాంచనీ 8 హిమాద్రిజా 9 పీతదుగ్ధా 10 స్వర్ణబాధా 11 సహా యీ 11 న్ని స్వర్ణక్షీరి పేళ్ళు.

క్షీరిద్వయ గుణము.

శ్లో॥ తిక్తాచకాంచనక్షీరీపిత్తక్రిమికఫాపహా ।
శోషణీదోషసంఘాతకండూకుష్ఠవిశోధనీ ।
వాతదోషప్రశమనీశ్వాసహృద్రోగనాశినీ ॥

తా॥ క్షీరిద్వయము చేదుగనుండు. మరియు నిది పిత్తము క్రిమిరోగము కఫము త్రిదోషములు దురద కుష్ఠము వాతదోషము శ్వాసము హృద్రోగము వీటిని నివర్తింపజేయు. మరియు నిది నీరును శోషింపజేయుగుణము గలదిగనుండు.

నల్లతెగడ.

శ్లో॥ శ్యామాత్రివృన్మాళవికామసూరావిదళాచసా।కాలాస్థిచంద్రా కాలిందీసుషేణాకాలమేషికా ॥ కాళిందికాలవల్లీచ మయూరాతామ్రపుష్పికా । తిథాకోశఫలాచైవ చరటాచైషికా తథా ॥ కందూకాఖ్యామహాశ్యామా నళికానింబకంటకా ।
బృహచ్ఛదామరుద్వేగామాతాసానాగరాక్వచిత్ ॥

టీక॥ 1 శ్యామా 2 త్రివృత్ 3 మాళవికా 4 మసూ 5 విదళా 6 కాలాస్థి చంద్రా 7 కాళిందీ 8 సుషేణా 9 కాలమేషికా 10 కాళిందీ 11 కాలవల్లీ 12 మయూరా 13 తామ్రపుష్పికా 14 కోశఫలా 15 చరటా 16 ఐషికా 17 కందుకాఖ్యా 18 మహాశ్యామా 19 నళికా 20 నింబకంటకా 21 బృహచ్ఛదా 22 మరుద్వేగా 23 మాతా 24 నాగరా యీ 24 న్ను నల్లతెగడపేళ్ళు.

నల్లతెగడ గుణము.

శ్లో॥ త్రివృతాకటుతిక్తోష్ణాక్రిమిశ్లేష్మోదరజ్వరాన్ ।
శోఫపాండ్వామయప్లీహాగుల్మాంహంతివిరేచనీ ॥

తా॥ నల్లతెగడ కారముగను చేదుగను ఉష్ణముగనునుండు. మరియు నిది క్రిమిరోగము శ్లేష్మము ఉదరరోగము జ్వరము శోఫ పాండురోగము ప్లీహము గుల్మము వీటిని నశింపజేయు. మరియు నిది విరేచనకరముగనుండు.

తెల్లతెగడ.

శ్లో॥ శుక్లకేశీత్రిభండీస్యాత్ కాకాక్షీసరళాత్రివృత్ ।
సర్వానుభూతిస్త్రిపుటాత్ర్యశ్వత్థాకుంభాప్రగంధినీ ॥
వ్యస్తఘోషీనిసూతాతోచబకాక్షీక్షీరనాళికా ॥

టీక॥ 1 శుక్లకేశీ 2 త్రిభండీ 3 కాకాక్షీ 4 సరళా 5 త్రివృత్ 6 సర్వానుభూతి 7 త్రిపుటా 8 త్ర్యష్టా 9 కుంభా 10 ప్రగంధినీ 11 వ్యాఘ్రాదనీ 12 నిమాత్రా 13 బకాక్షీ 14 క్షీరవాళికా యీ 14 న్ను తెల్లతెగడ పేళ్ళు.

తెల్లతెగడ గుణము.

శ్లో॥ కషాయామధురారూక్షావిపాకేకటుకామతా ।
కఫపిత్తప్రశమనీత్రివృచ్చానిలకోపినీ ॥

తా॥ తెల్లతెగడ వగరుగను మధురముగను రూక్షముగను పాకమువలన చేదుగనుండు. మరియు నిది కఫము పిత్తము వీటిని నశింపజేయుటయేగాక అగ్నిదీపనమును సగా గలుగజేయు.

ఎఱ్ఱతెగడ.

శ్లో॥ రక్తాన్యాపిచకాళిందీత్రిపుటాతామ్రపుష్పికా ।
కులవర్ణామసూరీచవ్యాకృతానవకాళికా ॥

టీక॥ 1 కాళిందీ 2 త్రిపుటా 3 తామ్రపుష్పికా 4 కులవర్ణా 5 మసూరీ 6 వ్యాకృతా 7 అనవకాళికా యీ 7 న్ను ఎఱ్ఱతెగడ పేళ్ళు.

ఎఱ్ఱతెగడ గుణము.

శ్లో॥ రక్తత్రివృత్తుమధురంరూక్షంవాతకరంమతం । తువరంచరసే తిక్తంకటుదోష్ణంచరేచకం । హితకృచ్ఛమలస్తంభం గ్రహణీంచకఫోదరం । శోథపాండుక్రిమిర్ఘాప్లీహ జ్వరేపిత్తకఫం తథా।వాతరక్తముదావర్తంహృద్రోగంచవినాశయేత్ ॥

తా॥ ఎఱ్ఱతెగడ మధురముగను రూక్షముగను వగరుగను చేదుగను కారముగనుండు. వాతమునుజేసును ఉష్ణముగనుండును. విరేచనము జేయించును. హితముగనుండును. మరియు నిది మలస్తంభము గ్రహణి కఫోదరము వాపు పాండువు క్రిములు ప్లీహము జ్వరము పిత్తము కఫము వాతరక్తము ఉదావర్తము హృద్రోగము వీటిని నశింపజేయు.

పెన్నపాపర.

శ్లో॥ ఇంద్రేంద్రవారుణీంద్రాహ్వాచేంద్రవారాన్యపాదపి ।
గవాదనీక్షుద్రఫలావృషభాక్షీగవాక్ష్యపి ।
విటంగోటీమతానిగాత్రఘ్నాదుకసుకామతా ॥

టీక॥ 1 ఇంద్ర 2 ఇంద్రవారుణీ 3 ఇంద్రావాహ్వ 4 ఇంద్రవాగా 5 వృషాదనీ 6 గవాదనీ 7 క్షుద్రఫలా 8 వృషభాక్షీ 9 గవాక్షీ 10 విటంకోటి 11 పీరా 12 కసుకా యీ 12 న్ను పిన్నపాపర పేళ్ళు.

పిన్నపాపర గుణము.

శ్లో॥ ఇంద్రవారుణికాతుల్యాష్ణా రేచనీకటుకాతథా। క్రిమికుష్ఠవ్రణాన్
దుష్టాన్ హంతిసర్వోదరాణిచ॥ శ్వాసకాసగ్రంధిమేహామూఢ
గర్భకకామిలాః। ప్లీహానంశుష్క గర్భంచగళగండంవిషంతథా।
ఆనాహావాతమపచీమూమంవిద్రధికంతథా। సర్వగుల్మానిపాం
డుంచనాశయేదితికీర్తితా॥

తా॥ పిన్నపాపర మిక్కిలి ఉష్ణముజేసును. విరేచనము జేయించును కారము గనుండును. మరియు నిది క్రిములు కుష్ఠువు దుష్టవ్రణములు సమస్తమైన ఉదరరోగములు శ్వాసము కాసము గ్రంధులు మేహము మూఢగర్భము కామిల ప్లీహము శుష్కగర్భము గళగండము విషము ఆనాహవాతము అపచి ఆమరోగము బ్దులు సమస్తమైన గుల్మములు పాండువు వీటిని నశింపజేయు.

పెద్దపాపర.

శ్లో॥ అన్యేంద్రవారుణీప్రోక్తావిశాలాతుమహాఫలా। ఆత్మరక్షాచిత్ర
ఫలాత్రపుసీత్రపుసాచసా॥ శ్వేతపుష్పాగవాక్షీచమృగోర్వాచ
మృగాదనీ। హస్తిదస్తీనాగదస్తీవారుణీగజచిద్భటా। కుంభ
కామరుసంభూతాచిత్రా దేవాచకీర్తితా॥

టీక॥ 1 ఇంద్రవారుణీ 2 విశాలా 3 మహాఫలా 4 ఆత్మరక్షా 5 చిత్రఫలా 6 త్రపుసీ 7 త్రపుసా 8 శ్వేతపుష్పా 9 గవాక్షీ 10 మృగోర్వా 11 మృగాదనీ 12 హస్తిదస్తీ 13 నాగదస్తీ 14 వారుణీ 15 గజచిద్భటా 16 కుంభకా 17 మరుసంభూతా 18 చిత్రా 19 దేవా యీ 19 న్ని పెద్దపాపర పేళ్ళు.

పెద్దపాపర గుణము.

శ్లో॥ కంఠరోగాపచిశ్వాసగుల్మప్లీహాగరోదరాన్ ।
మూలగర్భానహారణీకుష్ఠమష్టవ్రణాన్ జయేత్ ॥

తా॥ పెద్దపాపర కంఠరోగము అజీర్ణము శ్వాసము గుల్మము ప్లీహము విషము మహోదరము మూలరోగము గర్భము కుష్ఠము గుష్టవ్రణములు వీటిని నిశ్శింపజేయు.

పాపరకాయకూర గుణము.

శ్లో॥ తచ్ఛాకముష్ణంమధురంస్వాదుజాఠరదీపనం ।
వీర్యోష్ణంబృంహణంబల్యంవిరేచనకరంగురు ।
నాశయేద్వాతపిత్తంచగుల్మరోగంతథాజ్వరమ్ ॥

తా॥ పాపరకాయకూర ఉష్ణముగను మధురముగను రుచికరముగనునుండు. అగ్నిదీపనముజేయును. ఉష్ణవీర్యముకలదిగనుండు దేహమునకు పుష్టినిచ్చును బలకరముగనుండు. విరేచనముజేయించు. గురుత్వముజేసును. మరియు నిది వాతపైత్యము గుల్మము జ్వరము వీటిని నశింపంజేయు.

కలుత్రానుగు.

శ్లో॥ త్రాయమాణాకృతత్రాణాత్రాయంతీత్రాయమాణకా ।
బలభద్రోబలోదేవోవార్షికంగిరిసానుజః ।
మాంగల్యాభద్రనామాచశుకాభాభయనాశనీ ॥

టీక॥ 1 త్రాయమాణా 2 కృతత్రాణా 3 త్రాయంతీ 4 త్రాయమాణకా 5 బలభద్ర 6 బల 7 దేవ 8 వార్షిక 9 గిరిసానుజ 10 మాంగల్యా 11 భద్రనామా 12 శుకాభా 13 భయనాశనీ యీ 13 న్ను కలుత్రానుగుపేళ్ళు.

కలుత్రానుగు గుణము.

శ్లో॥ త్రాయమాణాసరసేతిక్తాకషాయామధురానితా ।
కఫపిత్తహరాజ్ఞేయాకోష్ఠరక్తహరామతా ॥

తా॥ కలుత్రానుగు చేదుగను వగరుగను మధురముగనునుండు. మరియు నిది కఫము పిత్తము పొత్తికడుపునొప్పి రక్తదోషము వీటిని నివర్తింపంజేయు.

పుస్తుకాంతరే.

శ్లో॥ త్రాయమాణాసరాపిత్తజ్వరశ్లేష్మాస్రశూలజిత్ ।
గుల్మంజ్వరంఛర్దికాంచక్షయంగ్లానింతృషాంవిషం।
హృద్రోగంరక్తపిత్తంచదుర్నామానంవినాశయేత్ ॥

తా॥ కలుత్రానుగు వేగముగలదిగనుండు. మరియు నిది పిత్తజ్వరము శ్లేష్మము రక్తదోషము శూల గుల్మము జ్వరము వాంతి క్షయము బడలిక దప్పి విషదోషము హృద్రోగము రక్తపిత్తము మూలశంక వీటిని బోగొట్టును.

ఈ శ్వ రి.

శ్లో॥ ఈశ్వరీనాగదమనీకౌమారీసర్వగంధికా। నాగాహ్వదమనీనాగ
గంధాభుజగపర్ణినీ ॥ యవతిక్తాశంఖినీతుదృఢపాదావిసర్పిణీ।
నకులీచాక్షపీడాచచిత్రమూలామహేశ్వరీ । శాంతిశ్శివకుమారీ
చఈశానీదేవదుందుభిః ॥

టీక॥ 1 ఈశ్వరీ 2 నాగదమనీ 3 కౌమారీ 4 సర్వగంధికా 5 నాగహ్వ 6 దమనీ 7 నాగగంధా 8 భుజగపర్ణినీ 9 యవతిక్తా 10 శంఖినీ 11 దృఢపాదా 12 విసర్పిణీ 13 నకలీ 14 అక్షపీడా 15 చిత్రమూలా 16 మహేశ్వరీ 17 శాంతి 18 శివకుమారీ 19 ఈశానీ 20 దేవదుందుభి యీ 20 న్ని ఈశ్వరి పేళ్ళు.

ఈశ్వరి గుణము.

శ్లో॥ ఈశ్వరీకటుతిక్తోష్ణాగురుస్నిగ్ధావిశోధనీ ।
త్రిదోషశమనీకుష్ఠస్వయథూదరనాశినీ ॥

తా॥ ఈశ్వరీ కారముగను చేదుగను ఉష్ణముగను గురువుగను స్నిగ్ధముగను మలశుద్ధికరముగనునుండు. మరియు నిది త్రిదోషములు కుష్ఠము వాపు మహోదరము వీటిని నశింపజేయు.

పుస్తకాంతరే.

శ్లో॥ ఈశ్వరీకటుతిక్తోష్ణావాతశ్లేష్మక్రిమీన్ జయేత్ ।
గుల్మోదరాశ్మరీకుష్ఠవిబంధాధ్మానకానిచ ।
త్రిదోషశమనీవర్ణ్యాలూతాసర్పవిషాపహా ।
భూతబాధాంరాక్షసీనాంపీడాంచైవవినాశయేత్ ॥

తా॥ ఈశ్వరి కారముగను చేదుగనునుండు. కాకజేసును మరియు నిది వాతము శ్లేష్మము క్రిములు గుల్మము ఉదరము అశ్మరి కుష్ఠువు మలబంధము కడుపుబ్బరము త్రిదోషములు వీనిని బోగొట్టును. శరీరమునకు మంచికాంతిని గలుగంజేయు. లూతవ్రణము సర్పవిషము భూతములవలని భయము రాక్షసబాధ వీటిని బోగొట్టును.

ఊ మ గ.

శ్లో॥ అంకోలోంకోలకోంకోలీనిర్దిష్టోదీర్ఘమూలకః ।
పీతసారస్తామ్రఫలోగంధపుష్పోనికోచకః।
కఠోరమల్లికాగ్రాహీవామనోలంబపర్ణకః ॥

టీక॥ 1 అంకోల 2 అంకోలక 3 అంకోలీ 4 దీర్ఘకీలక 5 పీతసార 6 తామ్రఫల 7 గంధపుష్ప 8 నికోచక 9 కకోరమల్లికా 10 గ్రాహీ 11 వామన 12 లంబపర్ణక యీ 12 న్ను ఊడుగ పేళ్ళు.

ఊడుగ గుణము.

శ్లో॥ అంకోలస్స్నిగ్ధరూక్షోష్ణః కఫరక్తాతిసారజిత్ ।
వానరాఖువిషంహంతిక్రిమిశుష్ఠవ్రణాపహః ।
శ్రేష్ఠంపిత్తవికారేషు యోజ్యమేతద్విరేచనమ్ ॥

తా॥ ఊడుగ స్నిగ్ధముగను రూక్షముగను ఉష్ణముగనునుండు. మరియు నిది కఫము రక్తదోషము అతిసారము వానరవిషము పందికొక్కువిషము క్రిమిరోగము కుష్ఠము వ్రణము వీట్లను నశింపజేయు. మరియు పిత్తవికారములయందు విరేచనము నకు దీనిని సేవించుట మిగుల శ్రేష్ఠము.

ఉత్తరేణి.

శ్లో॥ అపామార్గస్తుశిఖరీ ప్రత్యక్పుష్పీమయూరకః । అధశ్శల్యో ధకిణిహీదుర్గ్రహఃఖరమంజరీ ॥ సఏవోక్తః శేఖరికోమర్కటీ దూరవిగ్రహః । ప్రత్యక్శ్రేణీవక్రశిఖః కూటోమర్కటపిప్పలీ। ధామార్గవోఘోంటాకుఃకుబ్జకస్థూలమంజరీ ॥

టీక॥ 1 అపామార్గ 2 శిఖరీ 3 ప్రత్యక్పుష్పీ 4 మయూరక 5 అధశ్శల్య 6 కిణిహీ 7 దుర్గ్రహ 8 ఖరమంజరీ 9 శేఖరిక 10 మర్కటీ 11 దూరవిగ్రహ 12 ప్రత్యక్శ్రేణీ 13 వక్రశిఖ 14 కూట 15 మర్కటపిప్పలీ 16 ధామార్గవ 17 ఘోంటాకు 18 కుబ్జక 19 స్థూలమంజరీ యీ 19 న్ని ఉత్తరేణిపేళ్ళు.

ఉత్తరేణి గుణము.

శ్లో॥ అపామార్గఃకటుస్తిక్తఃకఫఘ్నఃశీఘ్రరేచనః ।
సిధ్మోదరార్శశ్వయధుఃకండూశూలారుచింజయేత్ ॥

తా॥ ఉత్తరేణి కారముగను చేదుగనునుండు. మరియు నిది కఫము సిధ్మము మహోదరము అర్శస్సు వాపు దురద శూల అరుచి వీటిని నివర్తింపజేయు. మరియు నిది శీఘ్రముగ విరేచనమును గలుగజేయు.

## జ్యోతిష్మతి.

శ్లో॥ జ్యోతిష్మతీతుకటుభీసూక్ష్మపర్ణాలతాపిచా।
ఉపాణికాచాగ్నిభాసాలవణోక్తాచధూమలా ।
లవణీకింశుకావేగాకాకాదనిత్రిపర్ణ్యపి ।
పీతతైలావిషస్వర్ణీకకుందరీకుకూణికా॥

టీక॥ 1 జ్యోతిష్మతి 2 కటుభి 3 సూక్ష్మపర్ణా 4 లతా 5 ఉపాణికా 6 అగ్నిభాసా 7 లవణా 8 ధూమలా 9 లవణి 10 కింశుకా 11 వేగా 12 కాకాదనీ 13 త్రిపర్ణీ 14 పీతతైలా 15 విషస్వర్ణీ 16 కుకుందరీ 17 కుకూణికా యీ 17 న్ను జ్యోతిష్మతి పేళ్ళు.

## జ్యోతిష్మతీ గుణము.

శ్లో॥ కంగునీకటుతిక్తోష్ణాకఫఘ్నీచవిరేచనీ ।
విసర్పింస్వయథుంపాండుంజలోదరభగందరౌ ।
శోషనేత్రశిరోరోగాన్పీనసంపవనంహరేత్॥

తా॥ జ్యోతిష్మతి కారముగను చేదుగను ఉష్ణముగనునుండు. మరియు నిది కఫము విసర్పి వాపు పాండువు జలోదరము భగందరము శోష నేత్రరోగము శిరోరోగము పీనస వాతము వీటిని నివర్తింపంజేయును. మరియు నిది విరేచనమునకు యోగ్యముగనుండు.

## పెద్దజ్యోతిష్మతి.

శ్లో॥ తేజస్వినీతేజవతీతేజాహ్వాతేజనీతిచ ।
అశ్వఘ్నీవల్కలాగ్నీచపారిజాతామహౌజసీ ।
పారావతపదావర్ణ్యాలతాకంగణికాపిచ ॥

టీక॥ 1 తేజస్వినీ 2 తేజవతీ 3 తేజాహ్వా 4 తేజనీ 5 అశ్వఘ్నీ 6 వల్కలాగ్నీ 7 పారిజాతా 8 మహౌజసీ 9 పారావతపదా 10 వర్ణ్యా 11 లతా 12 కంగణికా యీ 12 న్ను పెద్దజ్యోతిష్మతి పేళ్ళు.

## పెద్దజ్యోతిష్మతీ గుణము.

శ్లో॥ తేజస్వినీకఫశ్వాసకాసశూలామవాతజిత్ ।
పాచన్యుష్ణాకటుస్తిక్తారుచివహ్నిప్రదీపనీ ॥

తా॥ పెద్దజ్యోతిష్మతీ కఫము శ్వాసము కాసము శూల ఆమవాతము వీటిని బోగొట్టును. జీర్ణము కాక వీటిని జేసును. కారముగను చేదుగనునుండు. రుచి అగ్నిదీప్తి వీటిని వృద్ధిపరచును.

దుంపరాస్న.

శ్లో॥ రాస్నాయుక్తరసారస్యాశ్రేయసీరసనావసా ।
సుగంధమూలాతిరసారమ్యాచసువహామతా ।
నాకులీసురసాగంధానుగంధాగంధనాకులీ ।
సురభీసర్వగంధాచగంధాఢ్యాగంధచారిణీ ॥

టీక॥ 1 రాస్నా 2 యుక్తరసా 3 రస్యా 4 శ్రేయసీ 5 రసనా 6 రసా 7 సుగంధమూలా 8 అతిరసా 9 రమ్యా 10 సువహా 11 నాకులీ 12 సురసా 13 గంధా 14 సుగంధా 15 గంధనాకులీ 16 సురభీ 17 సర్వగంధా 18 గంధాఢ్యా 19 గంధచారిణీ యీ 19 న్ని దుంపరాస్న పేళ్ళు.

దుంపరాస్న గుణము.

శ్లో॥ రాస్నాతిక్తాకటూష్ణాచ శ్లేష్మశ్వాసానిలాపహా ।
శోఫోదరార్శశ్శమనీగుల్మవిద్రధికాసజిత్ ॥

తా॥ దుంపరాస్నము చేదుగను కారముగను ఉష్ణముగనునుండు. ఇది శ్లేష్మము శ్వాసము వాతము వాపు మహోదరము అర్శమ్ము గుల్మము విద్రధి కాసము వీట్లను నశింపంజేయు.

పుస్తకాంతరే.

శ్లో॥ రాస్నామపాచనీతిక్తాగురూష్ణాశ్లేష్మవాతజిత్ । శోఫశ్వాస సమీరాస్రవాతశూలోదరాపహా। వాతరక్తంవిషంహిక్కాం కాసంచవిషమజ్వరం । జ్వరంకంపంగరోగంరంచ సర్వాన్వా తాంస్తునాశయేత్ ॥ రాస్నాతుత్రివిధాప్రోక్తా మూలంప్రతం తృణంతథా। జ్ఞేయామూనదళాశ్రేష్ఠాతృణరాస్నాతుమధ్యమా॥

తా॥ దుంపరాస్నము ఆమమును జీర్ణమునుజేయును చేదుగనుండును. గురుత్వము కాక వీటిని చేసును. మరియు నిది శ్లేష్మవాతము వాపు శ్వాసము వాతము రక్తదోషము వాతశూల ఉదరరోగము వాతరక్తము విషము ఎక్కిళ్ళు కాసము విషమజ్వరము జ్వరము శరీరమువణకుట ఉదరము సమస్తమైనవాతములు వీటిని నశింపం

జేయును. ఈదుంపరాస్నము వేరురూపము ఆకులరూపము కాడలరూపము గలదియన మూడువిధములుగనుండు. వానిలో వేరురూపము ఆకురూపముగల దుంపరాస్నము శ్రేష్ఠము. కాడలరూపముగల దుంపరాస్నము మధ్యమము.

పెన్నేరు.

శ్లో॥ అశ్వగంధా వాజిగంధా కంబుకాశ్వావరోహకా ।
వరాహకర్ణీ తురగీ బల్యా వాజీకరీస్మృతా ।
వరాగాత్రకరీపుణ్యా కుష్ఠగంధాచ పీవరీ ॥

తా॥ 1 అశ్వగంధా 2 వాజిగంధా 3 కంబుకా 4 అశ్వా 5 అవరోహకా 6 వరాహకర్ణీ 7 తురగీ 8 బల్యా 9 వాజీకరీ 10 వరా 11 గాత్రకరీ 12 పుణ్యా 13 కుష్ఠగంధా 14 పీవరీ యీ 14 న్ను పెన్నేరు పేళ్ళు.

పెన్నేరు గుణము.

శ్లో॥ అశ్వగంధా కషాయోష్ణా తిక్తా వాతకఫాపహా ।
విషవ్రణక్షయాన్ హంతి కాంతివీర్యబలప్రదా ॥

తా॥ పెన్నేరు వగరుగను ఉష్ణముగను చేదుగనునుండు. ఇది వాతము కఫము విషము వ్రణము క్షయము వీటిని పోగొట్టుటయేగాక దేహమునకు కాంతి వీర్యము బలము వీటిని గలుగజేయు.

పెద్దపెన్నేరు.

శ్లో॥ పారిజాతాచ భూవల్లీ మాయా వాజీ బలా బలీ ।
స్థౌల్యదా మాసురీ మాంసీ మేదస్వీ రుక్మ హేమినీ ॥

టీక॥ 1 పారిజాతా 2 భూవల్లీ 3 మాయా వాజీ 4 బలా 5 బలీ 6 స్థౌల్యదా 7 ఆసురీ 8 మాంసీ 9 మేదస్వీ 10 రుక్మిణీ 11 హారీ యీ 11 న్ను పెద్ద పెన్నేరు పేళ్ళు.

పెద్దపెన్నేరు గుణము.

శ్లో॥ హారీ బలకరీ వృష్యా క్షయపాండువిసర్పజిత్ ।
జ్వరమారుతపిత్తఘ్నీ రక్తశూలామయాన్ జయేత్ ॥

తా॥ పెద్దపెన్నేరు క్షయము పాండువు విసర్పిరోగము జ్వరము వాతము పిత్తము రక్తదోషము శూల వీటిని నివర్తింపజేయుటయేగాక దేహమునకు బలకారిగను వీర్యవృద్ధికరముగనునుండు.

## తెల్లగలిజేరు.

శ్లో॥ పునర్నవా శ్వేతమూలాపృథ్వీకోదీర్ఘపత్రకః ।
విషాదీదీర్ఘవర్షాభూఃపునర్భూర్మండలచ్ఛదా ॥

టీక॥ 1 పునర్నవా 2 శ్వేతమూలా 3 పృథ్వీక 4 దీర్ఘపత్రక 5 విషాదీ 6 దీర్ఘవర్షాభూః 7 పునర్భూః 3 మండలచ్ఛదా యీ 8 న్ని తెల్లగలిజేరుపేళ్ళు.

## తెల్లగలిజేరు గుణము.

శ్లో॥ పునర్నవాసరాతిక్తారూక్షోష్ణామధురాకటుః। హృద్యాశోఫం
కఫంవాతంకాసమూత్రవ్రణంహరేత్ । పాండ్వర్తివిషోదరం
శూలంహృద్రోగోరఃక్షతాపహా । ఘృతేనమూలకంచాస్యా
హ్యంజితంహంతిపుష్పకం । మధునాసహమూలంతుహ్యంజి
తంస్రావనాశనం । అంజితంమార్కవరసైర్నేత్రకండూనివా
రణం।జలేనగోశకృత్తాచపిప్పల్యాచాంజితంయదా। రాత్ర్యాం
ధ్యంనశ్యతేతేనసోష్ణఃపర్ణరసస్మృతః । తచ్ఛాకస్తువరస్తిక్తో
రూక్షోవాతంకఫంహరేత్ । శ్వాసకాసోదరవిషపాండుగుల్మ
క్షయార్శకాన్ ।అగ్నిదీప్తికరశ్శోఫహారోరేచనకఃస్మృతః ॥

తా॥ తెల్లగలిజేరు వేగముగలదిగను చేదుగను తాపమునిచ్చునదిగనునుండు. మిక్కిలి కాకజేసును. ఇది మధురముగను కారముగనునుండు. హృదయమునకు మేలు జేసును. మఱియును నిది వాపు కఫము వాతము కాసము మూలశంక వ్రణములు పాండువు విషము ఉదరరోగము శూల హృద్రోగము ఉరఃక్షతము వీటిని బోగొట్టును. దీనివేరును నేతిలోచాది అంజనము వేసిన కంటిపూలు హరించును. తేనెలోచాది అంజనము వేసిన కంటిలో నీరుకారుట మానును. గుంటగలగరాకురసములోచాది అంజనము వేసిన కంటిదురద మానును. ఆవుపంచితము పేడ వీటితోగాని పిప్పలితోగాని నూరి అంజనము వేసిన మనుష్యులకు రేచీకటి మానును. దీనియాకురసము మిక్కిలి ఉష్ణము జేసును. దీనికూర వెగటుగను చేదుగనునుండు. తాపమునిచ్చును. మఱియును నిది వాతము కఫము శ్వాసము కాసము ఉదరరోగము విషపాండువు గుల్మము క్షయము అర్శస్సు వాపు వీటిని నివర్తింపంజేయును. అగ్నిదీపనము జేయును. విరేచనము జేయించును.

## ఎఱ్ఱగలిజేరు.

శ్లో॥ పునర్నవారుణాతిక్తార క్తపుష్పాకటిల్లకా ।
కూరకః క్షుద్రవర్షాభూర్వర్షకేతుశ్శివాటికా ॥

టీక॥ 1 తిక్తా 2 రక్తపుష్పా 3 కటిల్లకా 4 కూరకః 5 క్షుద్రవర్షాభూః 6 వర్షకేతు 7 శివాటికా యీ 7 న్ను ఎఱ్ఱగలిజేరు పేళ్ళు.

## ఎఱ్ఱగలిజేరు గుణము.

శ్లో॥ పునర్నవారుణాతిక్తాకటుపాకాహిమాలఘుః ।
వాతలగ్రాహిణీపాండురక్తపిత్తవినాశినీ।
శోఫానిలవ్రణశ్లేష్మహరారుచ్యారసాయనీ ॥

తా॥ ఎఱ్ఱగలిజేరు చేదుగను పాకమువలన కారముగను శీతలముగను చులకనగనునుండు. మలమును బంధించును. మఱియు నిది పాండువు రక్తపిత్తము వాపు వ్రణములు శ్లేష్మము వీటిని నశింపంజేయుటయేగాక రుచికరముగను ఆయురారోగ్య వృద్ధికారిగనునుండు.

## నల్లగలిజేరు.

శ్లో॥ అన్యాపునర్నవానీలాశ్యామానీలపునర్నవా।
కృష్ణాఖ్యానీలవర్షాభూర్నీలిన్యాఖ్యాభిదారికా ॥

టీక॥ 1 నీలా 2 శ్యామా 3 నీలపునర్నవా 4 కృష్ణాఖ్యా 5 నీలవర్షాభూః 6 నీలిన్యాఖ్యా 7 భిధారికా యీ 7 న్ను నల్లగలిజేరు పేళ్ళు.

## నల్లగలిజేరు గుణము.

శ్లో॥ నీలాపునర్నవాతిక్తాకటూష్ణాచరసాయనీ ।
హృద్రోగపాండుశ్వయథుశ్వాసవాతకఫాపహా ॥

తా॥ నల్లగలిజేరు చేదుగను కారముగను ఉష్ణముగను బలకారిగనునుండు. మఱియు నిది హృద్రోగము పాండువు వాపు శ్వాసము వాతము కఫము వీటిని నశింపంజేయు.

## ములుగోరింట.

శ్లో॥ సైరేయకస్సహాచరస్సైరికశ్చసహాచరః । తిండీచసస్సైర్యక
శ్శైవమ్ముదుపుష్పకఏవచ । స్వర్ణపుష్పఃకింకరాతఃకుమారి

తరణిశ్చ స్మృతా। పీతోగ కురుణ్టకశ్చ నీలశ్చ కురుణ్టకో స్మృతః। సితః కురంటకో జ్ఞేయో రక్తః కురువకః స్మృతః । నీలశ్చార్తగళో దాసీ బాణకోదనపాక్యపి ॥

టీక॥ 1 సైరేయక 2 సహచర 3 సైరిక 4 సహాచర 5 ఝింఝీ 6 పైర్యక 7 మృదుపుష్పక 8 స్వర్ణపుష్ప 9 కింకరాత 10 కుమారీ 11 తరణీ యీ 11 న్ను ములుగోరింట పేళ్ళు. ఇది పచ్చనిపూలతో కూడియుండిన కురంటకమనియు ఎఱ్ఱని పూలతో కూడియుండిన కురువకమనియు నల్లనిపూలతో గూడియుండిన ఆర్తగళ మనియు దాసియనియు బాణక్యమనియు ఓదనపాకియనియు జెప్పంబడు.

ములుగోరింట గుణము.

శ్లో॥ సైరేయకో హిమస్తిక్తశ్శోథతృష్ణాపిదాహనుత్ ।
వాతశోణితకాసఘ్నశ్శ్వాసశూలజ్వరాన్ జయేత్ ।
కేశ్యో వృష్యశ్చ బల్యశ్చ త్రిదోషశమనో మతః ॥

తా॥ ములుగోరింట శీతలముగను చేదుగనునుండు. మఱియు నిది వాపు దప్పి తాపము వాతము రక్తదోషము కాసము శ్వాసము శూల జ్వరము త్రిదోషములు వీటిని నివర్తింపంజేయుటయే గాక కేశ్య వీర్య బల వృద్ధికరముగనుండు.

ముత్తవపులగము.

శ్లో॥ బలాచాతిబలా జ్ఞేయా వాట్యపుష్పీ వికంకతిః । ఋష్యప్రోక్తా ఋష్యగంధా స్వభూతిఫలామతా । వాట్యాయనీచ సాప్రోక్తా భారద్వాజీ సువర్ణకా । భద్రాదనీ సమంగాచకచ్ఛురా కంటకీ తిచా। మహాసహా శీతపూరా సహా స్వప్రకీర్తితా ॥

టీక॥ 1 బలా 2 అతిబలా 3 వాట్యపుష్పీ 4 వికంతక 5 ఋష్యప్రోక్త 6 ఋష్యగంధా 7 భూతిఫలా 8 వాట్యాయనీ 9 భరద్వాజీ 10 సువర్ణకా 11 భద్రాదనీ 12 సమంగా 13 కచ్ఛురా 14 కంటకీ 15 మహాసహా 16 శీతపూరా 17 సహా యీ 17 న్ను ముత్తవపులగము పేళ్ళు.

పెద్దముత్తవపులగము.

శ్లో॥ బలాభద్రాదనీ వాటీ సమంగా ఖరయష్టికా। మహాసమంగా దనికా శీతపాక్యోదనాహ్వయా । శీతవారా చ వాతఘ్నీ విజలా జల

కేళికా। వాట్యాయనీ ప్రభార్యా చనిష్టీ వాట్యాలక స్తథా। మహా
బలా వర్షపుష్పీ స్త్రిగంధా వాంద్యాలకస్మృతిః । సహాదేవా దేవసహా
పీతపుష్పీ బృహద్బలా । గంధవల్లీ మహాగంధా మంగల్యార్థ
ప్రసాదనీ॥

టీ॥ 1 బలా 2 భద్రాదనీ 3 వాటీ 4 సమంగా 5 ఖరయష్టికా 6 మహా సమంగా 7 ఓదనికా 8 శీతపాకీ 9 ఓదనాహ్వయా 10 శీతవారా 11 వాతఘ్నీ 12 నిజలా 13 జలకేళికా 14 వాట్యాయనీ 15 ప్రభార్యా 16 నిష్టి 17 వాట్యాలక 18 మహాబలా 19 వర్షపుష్పీ 20 గంధ్యాలక 21 సహాదేవా 22 దేవసహా 23 పీతపుష్పీ 24 బృహద్బలా 25 గంధవల్లి 26 మహాగంధా 27 మంగల్యా 28 అర్థప్రసాదనీ యీ 28 న్ని ముత్తవపులగము పేళ్ళు.

బలాద్వయము గుణము.

శ్లో॥ మహాబలా బలా చోభే స్నిగ్ధా స్వాదు స్మృతా త్రిదోషజిత్ ।
రక్తపిత్తామయోత్కర్షం హంతి తేజో వర్ధనకృత్యపి ॥

తా॥ ముత్తవపులగము పెద్దముత్తవపులగము యివి జిగటగను రుచికరముగను నుండును. మరియును నివి త్రిదోషములు రక్తపిత్తము వీటిని నివర్తింపంజేయుటయేగాక వీర్యవృద్ధి తేజస్సు వీటిని సదా కలుగంజేయును.

జిబిలిక.

శ్లో॥ గాంగేరుకీ నాగబలా సరగంధినికా తథా ।
విశ్వేదేవా త్వరిష్టాఖ్యా ఘంటాహ్వా స్యాంగవేధుకా।
దేవదండోత్పలా కాలా మంగల్యార్ధప్రసాదనీ ।
వర్షపుష్పీ మహాగంధా గోరక్షతండులా॥

టీక॥ 1 గాంగేరుకీ 2 నాగబలా 3 సరగంధినికా 4 విశ్వేదేవా 5 అరిష్టా 6 ఘంటాహ్వా 7 స్యాంగవేధుకా 8 దేవదండ 9 ఉత్పలా 10 కాలా 11 మంగల్యా 12 అర్ధప్రసాదనీ 13 వర్షపుష్పీ 14 మహాగంధా 15 గోరక్షతండులా యీ 15 న్ని జిబిలిక పేళ్ళు.

## బలాత్రయ గుణము.

శ్లో॥ బలాత్రయంవృష్యబలప్రదంచ రక్తాతిసారవమథుంవిషంచ । వాతాతిరక్తజ్వరశూలమరోచికంచ శోషప్రమేహామధికంవిష మంనిహంతి ॥

**తా॥ 3 విధములగు ము త్తవపులగము రక్తదోషము అతిసారము వాంతి విషము వాతము మిగులరక్తము స్రవించుట జ్వరము శూల అరుచి శోష ప్రమేహము విషమజ్వరము వీటిని నివర్తింపంజేయుటయేగాక వీర్యము బలము వీటిని వృద్ధపరచును.**

## బలుసు.

శ్లో॥ బలాకాతిబలాభారద్వాజీస్యాద్వృక్షగంధినీ ॥

టీక॥ 1 బలాకా 2 అతిబలా 3 భారద్వాజీ 4 వృక్షగంధినీ యీ 4 న్ను బలుసు పేళ్ళు.

## బలాచతుష్టయ గుణము.

శ్లో॥ బలాచతుష్టయంశీతంమధురంబలకాంతికృత్ । స్నిగ్ధంగ్రాహి సమీరాసృపిత్తాసృక్షతనాశనం। ఆసాంబృహద్బలాకృచ్ఛ్రం హంతివాతానులోమనీ । గుర్వీనాగబలావృష్యావిశేషాద్రక్త పిత్తజిత్ ।బల్యారసాయనీవుంస్త్వవర్ధనీబృంహణీతథా। తస్యా ఫలంహిమంస్వాదు స్తంభనంగురులేఖనం । విబంధాధ్మానజ ననంరక్తపిత్తవివర్ధనమ్॥

తా॥ ము త్తవపులగము పెద్దము త్తవపులగము జిబిలిక బలుసు అను నీనాల్గును శీతలముగను మధురముగను శరీరమునకుబలము కాంతి వీటిని గలుగజేయునదిగను జిగట గను మలబద్ధకారిగనునుండు. ఇదివాతరక్తము పిత్తరక్తము గాయము వీటిని నశింపం జేయు. మఱియు యీనాలుగులో పెద్దము త్తవపులగము మూత్రకృచ్ఛ్రరోగమును బోగొట్టును. వాతమునకు అనులోమగమనమును గలుగంజేయు. జిబిలిక గురుత్వమును జేయును. వీర్యమును వృద్ధిజేయును. విశేషముగ రక్తపిత్తమును బోగొట్టును. బలము నిచ్చును మఱియు నిది ఆయురారోగ్యములు పుంసత్వము వీటిని వృద్ధిజేయును. శరీ రమునకు పుష్టినిచ్చును. ము త్తవపులగపుపండ్లు శీతలముగను రుచిగనునుండు. మఱియు నిది శరీరస్తంభనము గురుత్వము లేఖనము మలబద్ధము ఆధ్మానము వీటిని గలుగంజేయు టయేగాక రక్తపిత్తమును వృద్ధపరచును.

## గొంతెమగొమరు.

శ్లో॥ ప్రసారిణీసుప్రసరాసరణీసారణీచసా ।
చారుపర్ణీరాజబలాభద్రపర్ణీప్రతారిణీ ॥

టీక॥ 1 ప్రసారిణీ 2 సుప్రసరా 3 సరణీ 4 సారణీ 5 చారుపర్ణీ 6 రాజబలా 7 భద్రపర్ణీ 8 ప్రతారిణీ యీ 8 న్ని గొంతెమగొమరుపేళ్ళు.

## గొంతెమగొమరు గుణము.

శ్లో॥ ప్రసారిణీగురుస్తిక్తావీర్యేచోష్ణాప్రకీర్తితా ।
ఉపయుక్తాఖిలాన్ హంతిరోగాన్ వాతసముద్భవాన్ ॥

తా॥ గొంతెమగొమరుగురువుగను చేదుగను ఉష్ణవీర్యము గలదిగనునుండు. దీనిని సేవించిన సమస్తవాతజరోగములను నశింపంజేయు.

## పిల్లిపీచర.

శ్లో॥ శతావరీశతపదీపీవరందీవరీవరా।
ఋశ్యప్రోక్తాద్వీపిశత్రుర్ద్వీపికాధరకంటకా ॥

టీక॥ 1 శతావరీ 2 శతపదీ 3 పీవరందీ 4 వరీ 5 వరా 6 ఋశ్యప్రోక్తా 7 ద్వీపిశత్రు 8 ద్వీపిక 9 అధరకంటకా యీ 9 న్ని పిల్లిపీచర పేళ్ళు.

## పిన్నపీచర.

శ్లో॥ సహస్రవీర్యాభీరుశ్చతుంగినీబహుపుత్రికా । మహాపురుషదంతాచశతాయుశ్చోర్ధ్వకంటకః। శతమూలీశతాహ్వాచస్వాదురస్యామహోదరీ । సూక్ష్మపత్రాశ్మశల్యాచతథానారాయణీజటా।గోరక్షతండులామూలావరావృక్షరుహాచసా ॥

టీక॥ 1 సహస్రవీర్యా 2 భీరు 3 తుంగినీ 4 బహుపుత్రికా 5 మహాపురుషదంతా 6 శతాయుః 7 ఊర్ధ్వకంటక 8 శతమూలీ 9 శతాహ్వ 10 స్వాదురస్యా 11 మహోదరీ 12 సూక్ష్మపత్రా 13 అశ్మశల్యా 14 నారాయణీ 15 జటా 16 గోరక్షతండులా 17 మూలా 18 వరా 19 వృక్షరుహా యీ 19 న్ని పిన్నపీచర పేళ్ళు.

## పీచరద్వయ గుణము.

శ్లో॥ శతావరీరసేతిక్తా రక్తపిత్తాతిసారజిత్ ।
ప్రమేహాశ్మదుస్తీవ్రష్మాహ్యానిలానలకోపహా ।
యక్ష్మాణంకృశతాంహన్తి భ్రమమూర్ఛాదితాపనుత్ ॥

తా॥ పిల్లిపీచర పిన్నపీచర యివి చేదుగనుండు. మరియు నివి రక్తపైత్యము అతిసారము ప్రమేహము వాతము ఉష్ణప్రకోపము క్షయము కృశత్వము భ్రమము మూర్ఛాదులు తాపము వీట్లను నశింపజేయుటయేగాక వీర్యవృద్ధికరముగనుండు.

## తెల్లాముదము.

శ్లో॥ ఏరండస్తగుణశ్శుక్లశ్చిత్రో గంధర్వహస్తకః ।
పంచాంగుళో వర్ధమానో హ్యామండో దీర్ఘదండకః ।
రుచికశ్చిత్రకశ్చైవచంచుః పత్రీవిడంబకః।
ఉరుబూకో వృద్ధవహో గంధర్వో ఘనవల్లభః ॥

టీక॥ 1 ఏరండ 2 తరుణ 3 శుక్ల 4 చిత్ర 5 గంధర్వహస్తక 6 పంచాంగుళ 7 వర్ధమాన 8 ఆమండ 9 దీర్ఘదండక 10 రుచక 11 చిత్రక 12 చంచు 13 పత్రీ 14 విడంబక 15 ఉరుబూక 16 వృద్ధివహ 17 గంధర్వ 18 ఘనవల్లభ యీ 18 న్ని తెల్లాముదము పేళ్ళు.

## ఎఱ్ఱాముదము.

శ్లో॥ రక్తైరండో హస్తికర్ణో వ్యాఘ్రో వ్యాఘ్రతరోరుబుః।
ఉరుబూకో హస్తికర్ణీ చుంచురుత్తానపత్రకః ।
వ్యాడంబకో వ్యాఘ్రపుచ్ఛో రుచకో వాతనాశనః ।
నైడంబకో దీర్ఘవృంతో రుబుశ్చైరండ ఉచ్యతే ॥

టీక॥ 1 రక్తైరండ 2 హస్తికర్ణ 3 వ్యాఘ్ర 4 వ్యాఘ్రతర 5 ఉరుబు 6 ఉరుబూక 7 హస్తికర్ణీ 8 చుంచు 9 ఉత్తానపత్రక 10 వ్యాడంబక 11 వ్యాఘ్రపుచ్ఛ 12 రుచక 13 వాతనాశన 14 నైడంబక 15 దీర్ఘవృంత 16 రుబు 17 ఏరండ యీ 17 న్ని ఎఱ్ఱాముదము పేళ్ళు.

## ఏరండద్వయ గుణము.

శ్లో॥ ఏరండో పిరసేతిక్తో గురూష్ణోసిలనాశనః । గుల్మాష్ఠీలగుదావర్త వస్తిశూలాంత్రవృద్ధిజిత్ ॥ తా॥ ఆముదపు చెట్లు రెండును చేదుగను

సాధితం జయేత్ । వాతశోణితమర్శాంసిజ్వరమున్మాదమర్దితం।
కట్యూరుపార్శ్వపృష్ఠార్తిశోషంశోఫంసవేపథుం ॥

తా॥ తెల్లాముదము ఎఱ్ఱాముదము చేదుగను గురువుగను ఉష్ణముగనునుండు. మరియు నివి వాతము గుల్మము అష్ఠీలరోగము గుదరోగము ఉదావర్తరోగము పొత్తికడుపునొప్పి అంత్రవృద్ధి (అనగా పేగులుబ్బుట) వీటిని నివర్తింపంజేయు. మరియు ఆముదమును కషాయముతోగాని కల్కముతోగాని పాలతోగాని సేవించిన వాతము రక్తదోషము అర్శస్సు జ్వరము ఉన్మాదము అర్దితవాతము కటిప్రదేశము తొడప్రక్కలు వీపు వీటియందునొప్పి శోష శోఫ వణుకు వీట్లను నశింపంజేయు.

పుస్తుకాంతరే.

శ్లో॥ ఏరండయుగ్మంమధురముష్ణంగురువినాశయేత్ । శూలశోఫకటీవస్తిశిరఃపీడోదరజ్వరాన్। ప్లీహశ్వాసకఫానాహకాసకుష్ఠామమారుతాన్। తచ్ఛలాటుస్తుపీర్యోష్ణోగుల్మార్శోరోగవాతనుత్॥తత్ఫలంభేదనంస్వాదుక్షారముష్ణంసమీరజిత్॥ తయోః పర్ణంతువిజ్ఞేయంవాతపిత్తవివర్ధకం । మూత్రకృచ్ఛ్రంవాతకఫంక్రిమీంశ్చైవవినాశయేత్ ॥ ఏతయోశ్చాంకురోగుల్మవస్తిశూలకఫక్రిమీన్। వాతంసప్తప్రకారంతువృద్ధిరోగంవినాశయేత్॥ పుష్పంతువాతకఫహృత్పిత్తమూత్రరుజాపహాం । బృంహణంస్నిగ్ధముష్ణంచజఠరాగ్నిప్రదీపనమ్ ॥

తా॥ తెల్లఆముదపుచెట్టు ఎఱ్ఱాముదపుచెట్టు యివి తీపుగను ఉష్ణముగనునుండు గురుత్వముజేసును. మరియు నివి శూల వాపు కటి వస్తి శిరస్సు వీనియందలి శూల ఉదరరోగము జ్వరము ప్లీహము శ్వాసము కఫము కడుపుబ్బరము కాసము కుష్ఠువు ఆమవాతము వీటిని నశింపంజేయు. వీనికాయలకూర ఉష్ణవీర్యముకలదిగనుండు. గుల్మము మూలము వాతము వీనిని బోగొట్టును. వీనిపండ్లుదోషములభేదించును. రుచిగను ఉప్పగను ఉష్ణముగనునుండు. వాతమునుబోగొట్టును. దీనియాకు వాతపిత్తముల వృద్ధిజేయును. మరియు నివి మూత్రకృచ్ఛ్రము వాతము కఫము క్రిములు వీనిని నివర్తింపంజేయు. వీని చిగురు గుల్మము వస్తిశూల కఫము క్రిములు వాతము ఏడువిధములైనబుడ్డలు వీటిని నశింపంజేయు. వీనిపువ్వు వాతము కఫము పిత్తము మూత్రరోగము వీటిని హరింపంజేయు. దేహమునకు పుష్టినిచ్చును. జిగటగనుండును. శాకజేసును. అగ్నిదీపనమును గలుగంజేయు.

గద్య॥ ఇతి ధన్వంతరీయే నిఘంటౌ నానాద్రవ్యపర్యాయ శబ్దగుణ ప్రకాశే ప్రథమో గుడూచ్యాదివర్గః.

---

దీప్యకం ఓమము వృత్తిఘ్న దింత అమ్లవేతసం పుల్లప్రబ్బలి అజామోద అజామోదము ఉగ్రగంధా అజామోదపువిత్తులు కపిత్థం వెలగ శర్కర చంచదార.

—— శతపుష్పాదివర్గప్రారంభః. ——

సదాప.

శ్లో॥ శతపుష్పామిసీఘోషా పోతకీమాధవీశతీ। అహిచ్ఛత్రాతిత్వవా త్పుష్పీశతాహ్వా కారవీశఫా । పత్రికాసంహతచ్ఛత్రావజ్రపుష్పే లతాతథా । గురూపికాతిఛత్రా చ శీతికామాగధీవరా । కర గంధికా పత్రీ బహ్మాత్సాక్ష్వతి వాక్పతీ ॥

టీక॥ 1 శతపుష్పా 2 మిసీ 3 ఘోషా 4 పోతకీ 5 మాధవీ 6 శతీ 7 అహిచ్ఛత్రా 8 అవిచ్ఛుష్పీ 9 శతాహ్వా 10 కారవీ 11 శఫా 12 పత్రికా 13 సంహతచ్ఛత్ర 14 వజ్రపుష్పీ 15 లతా 16 గురూపికా 17 అతిచ్ఛత్రా 18 శీతికా 19 మాగధీ 20 వరా 21 కరభి 22 గజికా 23 పత్రీ 24 బ్రహ్మాత్ప్యక్ష్వతి 25 వాక్పతి యీ 25 న్ను సదాపపేళ్ళు.

సదాప గుణము.

శ్లో॥ శతాహ్వాకటుకాతిక్తా స్నిగ్ధోష్ణా శ్లేష్మవాతనుత్ ।
జ్వరనేత్రవ్రణాన్హంతి వస్తికర్మణిశస్యతే॥

తా॥ సదాప కారముగను చేదుగను స్నిగ్ధముగను ఉష్ణముగనునుండు. ఇది శ్లేష్మము వాతము జ్వరము నేత్రరోగము వ్రణము వీటిని నశింపంజేయుటయే గాక వస్తికర్మయందు ప్రశస్తముగనుండు.

అడవి సదాప.

శ్లో॥ మైత్రేయాతాళపత్రీచశతపర్ణీమిసీతథా ।
శైలేయస్సచశాలీనఃనామ్నా సితసివామతా ॥

టీక॥ 1 మైత్రేయా 2 తాళపత్రీ 3 శతపర్ణీ 4 మిసీ 5 శైలేయ 2 శాలీన 7 సితశివా యీ 7 న్ను అడవిసదాపపేళ్ళు.

అడవిసదాప గుణము.

శ్లో॥ మిసీస్వాద్వీహిమావృష్యాదుర్నామక్షయరోగజిత్ ।
క్షతక్షీణహితాబల్యావాతపిత్తత్రిదోషజిత్ ।
శతపుష్పాద్వయంతిక్తం స్త్రీణాం స్తన్యవివర్ధనం ॥

వచాద్వయ గుణము.

శ్లో॥ వామనీకటుతిక్తోష్ణావాతశ్లేష్మరుజాపహా ।
కంఠ్యామేధ్యాక్రిమికులవిబంధాధ్మానశూలనుత్ ॥

తా॥ వసకారముగను చేదుగను ఉష్ణముగనునుండు. మరియు నిది వాతము శ్లేష్మము క్రిమిరోగము విబంధము కడుపుబ్బరము శూల వీటిని నివర్తింపంజేయుటయే గాక కంఠమునకు సుస్వరమును గలుగంజేయు. మరియు నిది వమనమును గలుగంజేయు.

ప్రబ్బలి.

శ్లో॥ వేతసోవంజులోనమ్రోవానీరోన్వల్పపత్రకః ।
నాదేయోమధ్యపుష్పాఖ్యాస్స్వప్ప్రముక్తాయోనికుంజకః।
జలోకాసంభృతోంభోజేనిచులోజలవేతసః ।
ఇజ్జలోహింజలోగుచ్ఛఫలాస్యాత్కచ్ఛపోలికా ॥

టీక॥ 1 వేతస 2 వంజుల 3 నమ్ర 4 వానీర 5 స్వల్పపత్రక 6 నాదేయ 7 మధ్యపుష్ప యీ 7 న్ను ప్రబ్బలిపేర్లు. 1 తోయకామ 2 నికుంజక 3 జలోకా సంభృత 4 అంభోజ 5 నిచుళ 6 జలవేతస యీ 6 న్ను నీరుప్రబ్బలిపేర్లు. 1 ఇజ్జల 2 హింజల 3 గుచ్ఛఫలా 4 కచ్ఛపోలికా యీ 4 న్ను మరియొకప్రబ్బలిపేర్లు.

ప్రబ్బలి గుణము.

శ్లో॥ వేతసశ్శీతలోదాహశోఫార్శోయోనిరుగ్వ్రణాన్ ।
హన్తివీసర్పకృచ్ఛ్రాస్రపిత్తాశ్మరికఫానిలాన్ ।
జలజోవేతసశ్శీతస్సంగ్రాహీవాతకోపనః ।
ఇజ్జలస్తద్గుణప్రోక్తోవిశేషాద్విషనాశనః ॥

తా॥ ప్రబ్బలి శీతలముగనుండు మరియు నిది తాపము వాపు మూలము యోని రోగము వ్రణములు విసర్పము మూత్రకృచ్ఛ్రము రక్తదోషము పిత్తాశ్మరి కఫము వాతము వీటిని బోగొట్టును. నీరుప్రబ్బలి శీతలముగనుండు మలమును బంధించును. వాతమును ప్రకోపింపంజేయు. మరియొకప్రబ్బలి నీరుప్రబ్బలియొక్క గుణములు గలదైయుండును. విశేషముగ విషదోషమును నివర్తింపంజేయు.

## వాయువిడంగములు.

శ్లో॥ విడంగంజంతుహంతాచక్రిమిఘ్నశ్చిత్రతండులః ॥
తండులాక్రిమిహామేఘోకరాళామృగగామినీ ।
గహ్వరంకైరవంచైవవేల్లసారక్తతండులా ॥

టీక॥ 1 విడంగ 2 జంతుహంతా 3 క్రిమిఘ్న 4 చిత్రతండుల 5 తండులా 6 క్రిమిహా 7 మేఘ 8 కరాళా 9 మృగగామినీ 10 గహ్వర 11 కైరవ 12 వేల్లసా 13 రక్తతండులా యీ 13 న్ను వాయువిడంగముల పేళ్లు.

## వాయువిడంగముల గుణము.

శ్లో॥ విడంగానికటూష్ణానితిక్తానికఫమారుతౌ ।
పాండుంహన్త్యరుచిమేదోగ్నిమాంద్యంఘ్నంతివిషంపునః ।
వాతశ్లేష్మక్రిమీన్కుష్ఠాత్వగ్దోషంగుల్మశూలనుత్ ।
ప్లీహాత్త్కీణజ్వరఃశ్లేష్మాహృద్రోగశమనంపరం ॥

తా॥ వాయువిడంగములు కారముగను ఉష్ణముగను చేదుగనునుండు. మరియు నివి కఫము వాతము పాండువు అరుచి మేదోరోగము అగ్నిమాంద్యము విషము వాత శ్లేష్మము క్రిములు కుష్టువు చర్మరోగము గుల్మము శూల వీటిని నివర్తింపంజేయు.

## కొడిసె.

శ్లో॥ కుటజోగిరిజస్తిక్తోవత్సకోగిరిమల్లికా।
కళింగోమల్లికాపుష్పీఇత్యుక్తోవృక్షకః ।
త్వచకోవరతిక్తశ్చకౌటజఃపాండురద్రుమః ॥

టీక॥ 1 కుటజ 2 గిరిజ 3 తిక్త 4 వత్సక 5 గిరిమల్లికా 6 కళింగ 7 మల్లికా పుష్పీ 8 ఇత్యువృక్ష 9 వృక్షక 10 త్వచక 11 వరతిక్త 12 కౌటజ 13 పాండుర ద్రుమ యీ 13 న్ను కొడిసెపేర్లు.

## కొడిసె గుణము.

శ్లో॥ కుటజఃకటుకఃస్తిక్తఃకషాయోష్ణశ్చశీతళః ।
పిత్తాస్రత్రుష్ణాతిసారగుదకీలవినాశయేత్ ॥

తా॥ కొడిసెకారముగను చేదుగను వగరుగను ఉష్ణముగను శీతలముగనునుండు మరియు నిది పిత్తము రక్తదోషము దప్పి అతిసారము గుదమునందు మొలకలుద్భవిల్లుట వీటిని నశింపజేయు.

పుష్పగుణాః.

శ్లో॥ కుటజఃకటుకోదూక్షో దీపనస్తువరోలఘుః। అర్శోతిసారపిత్తాస్ర కఫతృష్ణామకుష్ఠనుత్ ॥ తత్పుష్పంవాతలంశీతంతిక్తంపిత్తాతిసారజిత్। రక్తదోషంకఫంపిత్తంహరేత్కుష్ఠాతిసారకే ॥ తచ్ఛలాటస్తువిష్టమ్భిలఘుకుష్ణోగ్నిదీపనః । శ్లేష్మశ్రవాతక్రిమిహారో గుల్మార్శోగ్రహణీహరః ॥

తా॥ కొడిసెకారముగను వగరుగను చులకనగను కాకనునుండు. మరియు నిది మూలరోగము అతిసారము పిత్తము రక్తదోషము కఫము దప్పి ఆమరోగము కుష్ఠువు వీటిని నశింపజేయుటయేగాక అగ్నిదీపనమును సగా గలుగంజేయు. కొడిసెపూలు శీతలముగను చేదుగనునుండు. మరియు నిది వాతము పిత్తాతిసారము రక్తదోషము కఫము పిత్తము కుష్ఠువు అతిసారము వీటిని శాంతింపజేయు. కొడిసెకాయలకూరములబద్ధకారిగను చులకనగను ఉష్ణముగనునుండు. మరియు నిది శ్లేష్మము వాతము నులిపురుగులు గుల్మము అర్శస్సు గ్రహణి వీటిని నివర్తింపజేయుటయేగాక అగ్నిదీపనమును సగా గలుగంజేయు.

కొడిసెపాల.

శ్లో॥ ఐంద్రోయవస్తస్యఫలంకాలింగఃకౌటజస్తథా ।
శక్రాహ్వఃపురుహూతశ్చహోక్షోభద్రయవస్తథా ॥

టీక॥ 1 ఇంద్రయవ 2 కాళింగ 3 కౌటజ 4 శక్రాహ్వ 5 పురుహూత 6 భద్రయవ యీ 6 న్ను కొడిసెపాలపేళ్ళు. (పాల అనగా గింజలు.)

కొడిసెపాల గుణము.

శ్లో॥ ఐంద్రోయవస్త్రిదోషఘ్నస్సంగ్రాహీశీతలఃకటుః ।
జ్వరాతిసారరక్తార్శఃక్రిమివీసర్పకుష్ఠనుత్ ॥

తా॥ కొడిసెపాల త్రిదోషములనుబోగొట్టు మలమును బంధించును. చలువ జేసును కారముగనుండును. మరియు నిది జ్వరము అతిసారము రక్తమూలము నులిపురుగులు విసర్పము కుష్ఠువు వీటిని నశింపజేయు.

టీక॥ 1 సౌభాగ్య 2 టంకణక్షార 3 మాలతీ 4 తిలసంభవ 5 లోహరంజీ 6 స్వర్ణరంజీ 7 ద్రావీ 8 గాత్రరంజనీ యీ 8 న్ని టంకణక్షారముపేళ్ళు. దీనినే వెలిగారమని చెప్పుదురు.

టంకణక్షార గుణము.

శ్లో॥ శూలఘ్నష్టంకణక్షారోజ్వరగుల్మాతిసారజిత్ ।
త్రిదోషశమనశ్వాసకాసాపస్మారతాపనుత్ ॥

తా॥ టంకణక్షారము శూల జ్వరము గుల్మము అతిసారము త్రిదోషములు శ్వాస కాస అపస్మారరోగము తాపము వీటిని నివర్తింపంజేయు.

సైంధవలవణము.

శ్లో॥ సైంధవంస్వాదుసింధూత్థంనాదేయంసింధుజంశివం ।
శుభ్రింశితశివంధాన్యమాణిమంథంశివాత్మకం ।
విమలంతండులంజ్ఞేయంవరంశ్రేష్ఠంపటూత్తమం ॥

టీక॥ 1 సైంధవ 2 స్వాదు 3 సింధూత్థ 4 నాదేయ 5 సింధుజ 6 శివ 7 శుభ్రి 8 శిత 9 శివ 10 ధాన్య 11 అణిమంథ 12 శివాత్మక 13 విమల 14 తండుల 15 వర 16 శ్రేష్ఠపటు 17 ఉత్తమ యీ 17 న్ను సైంధవలవణముపేళ్ళు. (ఇదే ఇందుప్పు.)

సైంధవలవణ గుణము.

శ్లో॥ సైంధవంశిశిరంస్నిగ్ధంలఘుస్వాదుత్రిదోషజిత్ ।
దీపనంశ్వాసశమనంశూలగుల్మానిలాపహం।
హృద్రోగనేత్రరోగఘ్నంవ్రణారోచకనాశనం ॥

తా॥ సైంధవలవణము శీతలముగను జిగటగను లఘువుగను రుచికరముగను నుండు. మరియు నిది త్రిదోషములు శ్వాసము శూల గుల్మము వాతము హృద్రోగము నేత్రరోగము వ్రణము అరుచి వీట్లను నివర్తింపంజేయుటయేగాక అగ్నిదీపనమును సగా కలుగంజేయు.

సౌవర్చలవణము.

శ్లో॥ అక్షంసౌవర్చలంప్రోక్తంరుచకంహృద్యగంధకం ।
తిలకంకృష్ణలవణంసుగంధంకాలలోణకం ॥

టీక॥ 1 అక్షు 2 సౌవర్చల 3 రుచక 4 హృద్యగంధక 5 తిలక 6 కృష్ణలవణ 7 సుగంధ 8 కాలలోణక యీ 8 న్ని సౌవర్చలలవణము పేళ్ళు.

సౌవర్చలలవణ గుణము.

శ్లో॥ లఘుసౌవర్చలంపాకేతీక్ష్ణోష్ణంవిశదంరుచ్యం ।
గుల్మశూలవిబంధఘ్నందీపనీయంకఫాపహం ॥

తా॥ సౌవర్చలవణము పాకమువలన లఘువుగను బలకరముగను ఉష్ణముగను స్వచ్ఛముగనునుండును. మరియు నిది గుల్మము శూల విబంధము కఫము వీటిని నివర్తింపం జేయుటయేగాక అగ్నిదీపనమును సగా గలుగంజేయును.

బిడాలవణము.

శ్లో॥ సుపాంశుఖండలవణంకృతకంకృత్రిమంబిడం ।
సుపాక్యంఘూర్ణకంక్షారంత్రోటనంవాసురంకృతం ॥

టీక॥ 1 సుపాంశు 2 ఖండలవణ 3 కృతక 4 కృత్రిమ 5 బిడ 6 సుపాక్య 7 ఘూర్ణక 8 క్షార 9 త్రోటన 10 వాసుర 11 కృత యీ 11 న్ను బిడాలవణము పేళ్ళు.

బిడాలవణ గుణము.

శ్లో॥ సుపాంశుదీపనంతీక్ష్ణంహృద్రోగమనిలంతథా ।
విబంధాధ్మానశూలంచశ్వాసకాసారుచింజయేత్ ॥

తా॥ బిడాలవణము ఉష్ణముగనుండును. ఇది హృద్రోగము వాతము విబంధము కడుపుబ్బరము శూల శ్వాస కాస అరుచి వీటిని నివర్తింపంజేయుటయేగాక అగ్నిదీపనమును సగా గలుగంజేయు.

కాచలవణము.

శ్లో॥ ఊషక్షారంతుసుక్షారంపాంశుజంకాచజంశుభం ।
మహీరుహంసుఫేనంచకాచాగ్రంకాచగంధికం ।
[illegible]శసంభవం[illegible]ద్భిదంగోమాకంసనస ॥

టీక॥ 1 ఊషక్షార 2 సుక్షార 3 పాంశుజ 4 కాచజ 5 శుభ 6 మహీరుహ 7 సుఫేన 8 కాచాగ్ర 9 కాచగంధిక 10 [illegible]శస 11 నాపజాత 12 ఔద్భిద యీ 12 న్ను కాచలవణము పేళ్ళు.

## కాచలవణ గుణము.

శ్లో॥ కాచక్షారః కటు స్తీక్ష్ణస్స్వయధుగుల్మోదరాఞ్జయేత్ ।
విషవ్రణకఫార్శశ్శోఫం దీపనం కురుతే క్షణాత్ ॥

తా॥ కాచలవణము కారముగను తీక్ష్ణముగనునుండు. మరియు నిది వాపు గుల్మము మహోదరము విషము వ్రణము కఫము శోఫ వీటిని నివర్తింపంజేయుటయే గాక అగ్నిదీపనమును తక్షణమే గలుగంజేయు.

## సముద్రలవణము.

శ్లో॥ సాముద్రలవణం ప్రోక్తం వశిరం క్షీబ ంచాసురం తథా ।
సముద్రజం సాగరజం లవణోదధిసంభవం ।
వారిసంభవం త్రికూటం [illegible] ॥

టీక॥ 1 సాముద్ర 2 వశిర 3 అక్షీబ 4 అసుర 5 సముద్రజ 6 సాగరజ 7 లవణోదధిసంభవ 8 వారిసంభవ 9 త్రికూట ము యీ 9 న్ని సముద్రలవణము పేళ్ళు.

## సముద్రలవణ గుణము.

శ్లో॥ సాముద్రం మధురం పాకే నాత్యుష్ణం దీపనం పరం ।
గుల్మశ్లేష్మవిషఘ్నంచ శ్వాసకాసానిలాపహం ।
బలవృద్ధికరం చైవ రుచ్యం [illegible] నాశనం ॥

తా॥ సాముద్రలవణము పాకమువలన మధురముగను అత్యుష్ణముగను రుచికరముగనుండు. మరియు గుల్మము శ్లేష్మము శ్వాస కాస వాతము దుర్నామరోగము క్షయము వీటిని నశింపజేయుటయే గాక అగ్నిదీపనము బలవృద్ధి వీటిని సగా గలుగం జేయు.

## ఇంగువ.

శ్లో॥ హింగు రామఠ [illegible] జంతుఘ్నం భూతనాశనం ।
[illegible] సూపధూపనం ।
రక్షోఘ్నం జంతుకం హృద్యం [illegible] సుగంధికమేవచ ॥

టీక॥ 1 హింగు 2 రామఠ 3 [illegible] 4 జంతుఘ్న 5 భూతనాశన 6 [illegible] 7 [illegible] 8 [illegible] 9 సూపధూపన 10 రక్షోఘ్న 11 జంతుక 12 హృద్య 13 సుగంధిక యీ 13 న్ను ఇంగువపేళ్ళు.

ఇంగువ గుణము.

శ్లో॥ హింగూష్ణందీపనంబల్యంవాతఘ్నంగుల్మశూలజిత్ ।
క్రిమిహృద్రోగశమనంమహానాపరకీర్తితం ॥

తా॥ ఇంగువ ఉష్ణముగనుండును. మరియు నిది వాతము గుల్మము శూల క్రిములు హృద్రోగము మహోదరము కఫము పిత్తము రోగములయొక్క అగ్నిదీపనము బలము వీటిని సదా గలుగంజేయు.

హింగుపత్రి.

శ్లో॥ హింగుపత్రీకరంబీచపృథ్వీకాపృథులాపృథుః।
బాష్పికాదీర్ఘికానస్త్యబిల్వికాదీర్ఘపత్రికా ॥

టీక॥ 1 హింగుపత్రి 2 కరంబి 3 పృథ్వికా 4 పృథులా 5 పృథు 6 బాష్పికా 7 దీర్ఘికా 8 నస్త్య 9 బిల్వికా 10 దీర్ఘపత్రికా యీ 10 న్ని హింగుపత్రి పేర్లు.

పెద్దహింగుపత్రి.

శ్లో॥ నాడీహింగుపలాశాఖ్యాజంతుకారామఠీరసా ।
వంశపత్రీవేణుపత్రీపిండాహింగుశివాటికా ॥

టీక॥ 1 నాడీ 2 హింగుపలాశా 3 జంతుకా 4 రామఠి 5 రసా 6 వంశపత్రీ 7 వేణుపత్రీ 8 పిండా 9 హింగుశివాటికా యీ 9 న్ని పెద్దహింగుపత్రి పేర్లు.

హింగుపత్రి గుణము.

శ్లో॥ బాష్పికాకటుతీక్ష్ణోష్ణాపిత్తవాతకఫక్రిమీన్ ।
ప్లీహాష్ఠీలావిబంధానాస్యశూలహృద్బస్తిరోగహా ॥

తా॥ హింగుపత్రి కారముగను చేదుగను ఉష్ణముగనునుండును. మరియు నిది పిత్తము వాతము కఫము క్రిములు ప్లీహము అష్ఠీలవాతము విబంధము అన్నస్సు గుల్మము హృద్రోగము వొత్తికడుపునొప్పి వీట్లను నశింపజేయు.

తుమికి.

శ్లో॥ తుంబురుఃసారసఃసౌరోవనజఃసానుజోగజః ।
తీక్ష్ణవల్కస్తీక్ష్ణఫలఃతీక్ష్ణప్రణోమహామునిః ।
తిందుకస్స్యందనస్స్ఫూర్జకఃకాలసారశ్చరావణః ॥

టీక॥ 1 తుంబురు 2 సౌరస 3 సౌర 4 వనజ 5 సానుజ 6 గజ 7 తీక్ష్ణవల్క 8 తీక్ష్ణఫల 9 తీక్ష్ణపత్ర 10 మహాముని 11 తిందుక 12 స్పందన 13 సూక్ష్మకృ 14 కాలసార 15 నామము యీ 15 న్ను తుమికి పేర్లు.

పెద్దతుమికి.

శ్లో॥ కాకపీలుఃకుపీలుస్స్యాద్విషతిందుకః ॥

టీక॥ 1 కాకపీలు 2 కుపీలు 3 విషతిందుక యీ 3 న్ను పెద్దతుమికి పేర్లు.

తుమికి గుణము.

శ్లో॥ తుంబురుఃకటుతిక్తోష్ణఃకఫవాతశూలనుత్ ।
అపతంత్రోదరాధ్మానక్రిమిహృద్వహ్నిదీపనః ॥

తా॥ తుమికి కారముగను చేదుగను ఉష్ణముగనునుండు. మరియు నిది కఫము వాతము శూల అపతంత్రము మహోదరము కడుపుబ్బరము క్రిములు వీటిని నివర్తింపం జేయుటయేగాక అగ్నిదీపనమును సగా గలుగంజేయు.

హ్రస్వకాంతరే.

శ్లో॥ తిందుకో వ్రణవాతఘ్న స్తత్సారః పిత్తరోగజిత్ ।
ఆమమస్య ఫలం గ్రాహి వాతలం శీతలం లఘు ।
పక్వంచపిత్తప్రమేహాస్రశ్లేష్మఘ్నం విశదం గురు ।
విషతిందుకమప్యేవం విశేషాద్గ్రాహి శీతలం ॥

తా॥ తుమికి వ్రణము వాతము వీటిని పోగొట్టును. దీనిసారము పిత్తరోగమును పోగొట్టును. తుమికికాయ మలమును బంధించును. వాతము శైత్యము వీటిని గలుగంజేయు. తేలికనిచ్చును. దీనిఫలము పిత్తము ప్రమేహము రక్తదోషము శ్లేష్మము వీటిని హరించును. శోధనముచేయుంచను గురుత్వమునుజేసును. పెద్దతుమికియు తుమికియొక్క గుణమే కలిగియుండును. విశేషముగ మలమును బంధించును. శీతలముగనుండును.

ఏలకులు.

శ్లో॥ సూక్ష్మైలాద్రావిడీతుచ్ఛాగోలాంగీబహులాత్రుటీ ।
ఏలాకపోతవర్ణాచచంద్రబాలాచనిష్కుటీ ।

ఐంద్రభూతాతథాద్రోణాసాయకో బహులాత్వపా ।
కంకోలేలాబృహద్వేలాత్రిపుటాత్రిదివోద్భవా ॥

టీక॥ 1 సూక్ష్మైలా 2 ద్రావిడీ 3 తుచ్ఛా 4 గోలాంగీ 5 బహులా 6 కృశ 7 ఏలా 8 కపోతవర్ణా 9 చంద్రబాలా 10 నిష్కుటీ 11 ఐంద్రభూతా 12 ద్రోణా 13 సాయక 14 బహుళా 15 త్వపా 16 కంకోలేలా 17 బృహద్వేలా 18 త్రిపుటా 19 త్రిదివోద్భవా యీ 19 న్ని పిన్నఏలకుల పేళ్ళు.

పెద్దఏలకులు.

శ్లో॥ స్థూలేలాత్వక్సుగంధాచపృథ్వీకాకన్యకాస్ఫుటా ।
తాడకాఫలికామేఘామాళవీవాహినీతుటీ ।
భద్రేలాబృహదేవాచత్రిపుటాత్రిదివోద్భవా ॥

టీక॥ 1 స్థూలేలా 2 త్వక్సుగంధా 3 పృథ్వీకా 4 కన్యకా 5 స్ఫుటా 6 తాడకా 7 ఫలికా 8 మేఘా 9 మాళవీ 10 వాహినీ 11 తుటీ 12 భద్రేలా 13 బృహదేవా 14 త్రిపుటా 15 త్రిదివోద్భవా యీ 15 న్ను పెద్దఏలకులు పేళ్ళు.

ఏలకద్వయ గుణము.

శ్లో॥ ఏలాతిక్తోష్ణకాసఘ్నీకఫరక్తాతిసారజిత్ ।
ప్రమేహాకృచ్ఛ్రదోషఘ్నీప్రదరస్వారుచింజయేత్ ।
కండూవిషవ్రణాన్హన్తిముఖమస్తకశోధనీ ॥

తా॥ ఏలకులు చేదుగను ఉష్ణముగనునుండు. మరియు నిది కాసము కఫము రక్తదోషము అతిసారము ప్రమేహము మూత్రకృచ్ఛ్రము త్రిదోషములు ప్రదరము అరుచి దురద విషము వ్రణము వీటిని నివర్తింపంజేయుటయే గాక ముఖము శిరస్సు వీటికి శుద్ధిని గలుగంజేయు.

నాగకేసరములు.

శ్లో॥ నాగపుష్పంమతంనాగంకేసరంనాగకేసరం ।
చాంపేయంనాగకింజల్కంకనకంహేమకాంచనం ।
మరూత్థంహాటకంజాంబోనదంచపరికీర్తితం ॥

టీక॥ 1 నాగపుష్ప 2 నాగ 3 కేసర 4 నాగకేసర 5 చాంపేయ 6 నాగకింజల్క 7 కనక 8 హేమకాంచన 9 మరూత్థ 10 హాటక 11 జాంబోనద యీ 11 న్ను నాగకేసరముల పేళ్ళు.

## నాగకేసరముల గుణము.

శ్లో॥ నాగకేసరముత్కృష్ణంచమిపిత్తకఫాపహం॥
వస్తిరుక్ స్వేదవాతాస్రకంఠకృన్నాంశీఘ్రరేచనం।
ప్రదరాజీర్ణగుల్మఘ్నంవంధ్యానామపిగర్భదం॥

తా॥ నాగకేసరములు మిక్కిలి ఉష్ణమునగానుండు. మరియు నిది వాంతి పిత్తము కఫము పొత్తికడుపునొప్పి చెమట వాతము రక్తదోషము దురద ప్రదర రోగము అజీర్ణము గుల్మము వంధ్యాత్వము వీటిని నివర్తింపంజేయుటయేగాక శీఘ్రముగ విరేచనమును గలుగంజేయు.

## లవంగము.

శ్లో॥ త్వచంవరాంగంభృంగంతుమోచంసరళముత్కటం।
స్నేహాంలలాటవర్ణంచముఖశోధంవరంప్రియం।
త్వక్ఛవల్కలమింద్రంచసురభిశ్లక్ష్ణరామకం॥

టీక॥ 1 త్వచ 2 వరాంగ 3 భృంగ 4 మోచ 5 సరళ 6 ఉత్కట 7 స్నేహ 8 లలాటవర్ణ 9 ముఖశోధ 10 వర 11 ప్రియ 12 త్వక్ఛ 13 వల్కల 14 ఇంద్ర 15 సురభి 16 శ్లక్ష్ణ 17 రామక యీ 17 న్ను లవంగము పేళ్ళు.

## లవంగపుష్పము.

శ్లో॥ వరాళందేవకుసుమంలవంగంకుసుమంలవం।
పారిజాతేంద్రపుష్పంతుప్రసూనరసపుష్పకం॥

టీక॥ 1 వరాళ 2 దేవకుసుమ 3 లవంగ 4 కుసుమ 5 లవ 6 పారిజాత 7 ఇంద్రపుష్ప 8 ప్రసూన 9 రసపుష్పక యీ 9 న్ని లవంగపుష్పము పేళ్లు.

## లవంగము లవంగపుష్పము వీటిగుణము.

శ్లో॥ లవంగంసేవనాదవీర్యకంచజితేంద్రియంయావ్వనవర్ధనంచ।
వాతక్షయఘ్నంకఫశ్వాసకాసకండూతిపిత్తంవమథున్నిహస్తి॥

తా॥ లవంగము లవంగపుష్పము వీటిని సేవించిన వాతము క్షయము కఫము శ్వాసము కాసము దురద పిత్తము వాంతి వీటిని నివర్తింపంజేయుటయేగాక వీర్యము జితేంద్రియత్వము యావ్వనవృద్ధి వీటిని సగా గలుగంజేయు.

## లవంగపుచెక్క.

శ్లో॥ త్వచంవరాంగంశకలంత్వక్కోచంతనుకంవరం।
లాటపర్ణంఘనంభృంగంగురుత్వక్స్వర్ణభూమికం।
లవంగచోరానాగత్వక్వల్కలానలవంగికమ్।
మధురత్వక్చమాద్గల్యంశ్రీవల్కంగుడవల్కలం॥

టీక॥ 1 త్వచ 2 వరాంగ 3 శకల 4 త్వక్కోచ 5 తనుక 6 వర 7 లాటపర్ణ 8 ఘన 9 భృంగ 10 గురుత్వక్ 11 స్వర్ణభూమిక 12 లవంగచోరా 13 నాగత్వక్ 14 వల్కలా 15 లవంగక 16 మధురత్వక్ 17 మాద్గల్య 18 శ్రీవల్క 19 గుడవల్కల యీ 19 న్ని లవంగపుచెక్క పేర్లు.

## లవంగపుచెక్క గుణము.

శ్లో॥ త్వచాలఘూష్ణంకటుకంవిశదంస్వాదుపిత్తలం।
హృద్రోగబస్తిరోగవాతార్శఃపీనసక్రిమిశుక్రనుత్॥

తా॥ లవంగపుచెక్క లఘువుగను ఉష్ణముగను కారముగను శోధనకారిగను రుచికరముగనునుండు. పిత్తముజేసును. మరియు నిది విషము హృద్రోగము వస్తిరోగము వాతము అర్శస్సు పీనస క్రిమిరోగము శుక్రము వీటిని నశింపంజేయు.

## తమాలపత్రము.

శ్లో॥ తమాలపత్రకంపత్రంపలాశంచదళంఛదం।
రోమశంతాపసంవాసోగోమేదంవస్త్రమంశుకం।
సుకుమారంసుపత్రంచతద్వారోమశపత్రకం॥

టీక॥ 1 తమాలపత్రక 2 పత్ర 3 పలాశ 4 దళ 5 ఛద 6 రోమశ 7 తాపస 8 వాసః 9 గోమేద 10 వస్త్ర 11 అంశుక 12 సుకుమార 13 సుపత్ర 14 రోమశపత్రక యీ 14 న్ను తమాలపత్రముపేర్లు.

## తాళీసపత్రము.

శ్లో॥ తాళీసకంతుతాళీసంపత్రంతాళీసపత్రకం।
తచ్ఛదామలకీపత్రంపత్రాఢ్యంచశుకోదరం॥

టీక॥ 1 తాళీసక 2 తాళీస 3 పత్ర 4 తాళీసపత్రక 5 ఛదా 6 ఆమలకీపత్ర 7 పత్రాఢ్య 8 శుకోదర యీ 8 న్ని తాళీసపత్రముపేర్లు.

## తమాలపత్రము తాళిసపత్రము వీటిగుణము.

శ్లో॥ పత్రకంశ్వాసకాసఘ్నందీపనంలఘువాతనుత్ ।
కంఠూపస్తిరుజాచ్ఛర్దిశిరోవక్త్రవిశోధనం ॥

తా॥ తమాలపత్రము తాళిసపత్రము ఇవి చులకనగనుండు. మరియు నివి శ్వాసము కాసము వాతము దురద పొత్తికడుపునొప్పి వాంతి వీటిని నివర్తింపంజేయు టయేగాక అగ్నిదీపనము శిరోముఖశుద్ధి వీటిని గలుగంజేయు.

## తవక్షీరి.

శ్లో॥ స్యాద్వంశరోచనావంశీతుగాక్షీరితుగాశుభా ।
త్వక్క్షీరీవంశజాశుభ్రావంశక్షీరీచవైణవీ ।
వంశాఖ్యాలోచనాస్సైవధవళాతృణకేతకీ ॥

టీక॥ 1 వంశరోచనా 2 వంశీ 3 తుగాక్షీరి 4 తుగా 5 శుభా 6 త్వక్క్షీరీ 7 వంశజా 8 శుభ్రా 9 వంశక్షీరీ 10 వైణవీ 11 వంశాఖ్యా 12 లోచనా 13 ధవళా 14 తృణకేతకీ యీ 14 న్ను తవక్షీరిపేర్లు.

## తవక్షీరి గుణము.

శ్లో॥ త్వక్క్షీరీమధురారూక్షాకషాయాహ్యరుచివ్రణాన్ ।
హిక్కాశ్వాసక్షయాన్హంతిదాహకాసనిషూదనీ ॥

తా॥ తవక్షీరి మధురముగను రూక్షముగను వగరుగనునుండు. మరియు నిది అరుచి వ్రణము ఎక్కిళ్ళు శ్వాస క్షయము దాహము కాసము వీటిని నశింపంజేయు.

## తెల్లజీలకఱ్ఱ.

శ్లో॥ గంధపాలాసితాగంధాగంధపాలాశగంధజా । పాలాశగంధజా స్సైవహ్యన్యేశంసేతితద్విదుః। ఉపకుంచోపకుంచీచకాళికా౽పో పకుంచికా । సుషవీకుంచికాకుంచిప్పృథ్వీకాస్థలజీరకం । దీప్యం హ్రాద్యంమనోజ్ఞంచతరుణంమాధవంమతం । జీరకందీర్ఘకం శుక్లమజాజీకణజీరకం ॥

టీక॥ 1 గంధపాలా 2 సితా 3 గంధా 4 గంధపాలాశ 5 గంధజా 6 పాలాశగంధజా 7 శంస 8 ఉపకుంచ 9 ఉపకుంచీ 10 కాళికా 11 ఉపకుంచికా 12 సుషవీ 13 కుంచికా 14 కుంచి 15 పృథ్వీకా 16 స్థలజీరక 17 దీప్య 18 హ్రాద్య

19 మనోజ్ఞ 20 తరుణ 21 మాధవ 22 జీరక 23 దీర్ఘక 24 శుక్ల 25 అజాజీ 26 కణ జీరక యీ 26 న్ను తెల్లజీలకఱ్ఱ పేళ్లు.

తెల్లజీలకఱ్ఱ గుణము.

శ్లో॥ రుచికరబలకారీపిత్తజోన్మాదహారీ ।
జ్వరహరక్రిమిహారీశ్లేష్మశూలాపహారీ ।
వమనరుధిరవారీసర్వగుల్మాపహారీ ।
జనయతిజఠరాగ్నింజీరకంవాతహారీ ॥

తా॥ తెల్లజీలకఱ్ఱ రుచికరముగను బలకరముగనునుండు. మరియూ నిది పిత్తము పిచ్చి జ్వరము క్రిమి శ్లేష్మము శూల వాంతి రక్తదోషము సమస్తగుల్మములు వాతము వీట్లను నశింపంజేయుటయేగాక అగ్నిదీపనమును సగా గలుగంజేయును.

దానిమ్మ.

శ్లో॥ దాడింబోదాడిమస్సారఃకుట్టిమఃఫలషాడవః ।
స్వాద్వమ్లోరక్తబీజశ్చకరకశ్శుకవల్లభః ।
రాజాదనం[illegible] ॥

టీక॥ 1 దాడింబ 2 దాడిమ 3 [illegible] 6 [illegible] 7 రక్తబీజ 8 కరక 9 శుకవల్లభ 10 [illegible] 11 [illegible] 12 [illegible] 13 నరప్రియ యీ 13 న్ను దానిమ్మపేళ్ళు.

దానిమ్మ గుణము.

శ్లో॥ దాడిమోదీపనోవృష్యో[illegible]రోచికవిబంధ[illegible] ।
గుల్మశూలప్రమేహార్శోగ్రహణీవాతనాశనః ।
శోణితార్శఃకఫహరస్సర్వపైత్యవికార[illegible] ॥

తా॥ దానిమ్మ అరుచి విబంధము గుల్మము శూల ప్రమేహము గ్రహణి వాతము రక్తదోషము అర్శస్సు కఫము సర్వపైత్యవికారములు వీటిని నశింపంజేయుటయేగాక ధాతుపుష్టి అగ్నిదీపనము వీటిని సగా గలుగంజేయును.

ధనియాలు.

శ్లో॥ ధాన్యకంధానకంధాన్యంధానిధానేయకంతథా ।
కుస్తుంబురుచ్ఛత్రధాన్యంవితున్నంభద్రమార్ద్రకం ।
గుళికాహ్వాద్యగంధాచమేషకోరసనః స్తథా ॥

టీక॥ 1 ధాన్యక 2 ధానక 3 ధాన్య 4 ధాని 5 ధానేయక 6 కుస్తుంబురు 7 చత్రధాన్య 8 వితున్న 9 ఛద్రి 10 అచ్ఛిక 11 గుళికా 12 హృద్యగంధా 13 వేషక 14 రసన యీ 14 న్ను ధనియాలపేళ్ళు. దీనినే కొతిమెర్ల అని చెప్పుదురు.

ధనియాల గుణము.

శ్లో॥ కుస్తుంబురుస్స్వాదుకుర్యాచ్ఛర్దిముష్ణాత్యాతిదాహజిత్ ।
ఛర్దిహికార్చరుచీమేహాతిరుణజ్వరనాశనం ॥

తా॥ ధనియాలు తియ్యగనుండును. ఇది ఛర్దిమును పిత్తము మిక్కిలి మంట వాంతి ఎక్కిళ్ళు అరుచి మేహము తరుణజ్వరము వీటిని నశింపంజేయును.

నల్లజీలకర్ర.

శ్లో॥ కృష్ణనాజీకణాఖ్యాతాదీపుణకకర్ణజీరకః ।
కృష్ణరాజీతుంజరణాసుగంధాకాలజీరకః।
నహాకాళీచహృద్యాచతథాచోగ్రారశోధనీ ॥

టీక॥ 1 కృష్ణజాజీ 2 కణా 3 దీపనీక 4 కణజీరక 5 కృష్ణరాజీ 6 జరణా 7 సుగంధా 8 కాలజీరక 9 వహా 10 కాళీ 11 హృద్యా 12 ఉగ్గారశోధనీ యీ 12 న్ను నల్లజీలకర్రపేళ్ళు.

నల్లజీలకర్ర గుణము.

శ్లో॥ తిక్తోష్ణంకటుకంవృష్యంకంచ శ్లేష్మదోషఘ్నం ।
లఘుశ్లేష్మానిలఘ్నంచసన్నిపాతాభిఘాతజిత్ ॥

తా॥ నల్లజీలకర్ర చేదుగను ఉష్ణముగను కారముగనునుండు మరియు నిది శ్లేష్మను వాతమును సన్నిపాతము అభిఘాతము జ్వరను వీటిని నివర్తింపంజేయుటయే గాక ధాతుపుష్టి మేదస్సు అగ్నిదీపనము వీటిని గలుగంజేయును. మఱియు నిది శరీరమునకు తేలికనిచ్చును.

పిప్పలి.

శ్లో॥ పిప్పలీమాగధీకృష్ణాచపలాతీక్షతండులా।
ఉపకుల్యాకణాఖ్యాతాకోలాశౌండీతథోషణా ।
కఫరీకృష్ణఫలావృష్యాకటుర్ద్రండఫలామతా।
వైదేహీంచైవకాళీచశౌండికాతిక్తతండులా ॥

టీక॥ 1 పిప్పలీ 2 మాగధీ 3 కృష్ణా 4 చపలా 5 తీక్ష్ణతండులా 6 ఉపకుల్యా 7 కణా 8 కోలా 9 శౌండీ 10 ఊషణా 11 కఫరీ 12 కృష్ణఫలా 13 వ్యాఘ్రా 14 కటు 15 దంతఫలా 16 వైదేహీ 17 కాలీ 18 శౌండికా 19 తీక్ష్ణతండులా యీ 19 న్ని పిప్పలిపేళ్ళు.

పిప్పలి గుణములు

శ్లో॥ కృష్ణాకటుర్నావమహిమాస్నిగ్ధాగుల్మత్రిదోషజిత్ ।
తృట్ దాహోదరజిత్ స్వామనాశనిపరినాయకీ ॥

తా॥ పిప్పలి కారముగను రుచికరముగను శీతలముగను జిగటగనునుండు. మఱియు నిది గుల్మము త్రిదోషములు దప్పి దాహము మహోదరము ఆమవాతము వీటిని నివర్తింపంజేయుటయేగాక బలకరముగనుండు.

ప్రసిద్ధగ్రంథాంతరే.

శ్లో॥ పిప్పలీదీపనీవృష్యాస్వాదుపాకారసాయనీ । అనుష్ణాకటుకా స్నిగ్ధానకఫవాతహరాలఘుః । పిత్తలారేచనీహంతిశ్వాసకాసో దరజ్వరాన్ । కుష్ఠప్రమేహగుల్మార్శః ప్లీహశూలామమారుతాన్ । ఆర్ద్రాశ్లేష్మప్రదాస్నిగ్ధాశీతలామధురాగురుః ॥

తా॥ పిప్పళ్ళు పాకమువలన రుచికరముగను మిక్కిలి ఉష్ణముగాగను కారముగను జిగటగను చులకనగనునుండు. మఱియు నివి కఫము వాతము శ్వాసము కాసము ఉదర రోగము జ్వరము కుష్ఠువు ప్రమేహము గుల్మము అర్శస్సు ప్లీహము శూల ఆమవాతము వీటిని నివర్తింపంజేయుటయేగాక ఆయురారోగ్యవృద్ధి పి... విరేచనము విట్లను నగా గలుగంజేయు. పచ్చిపిప్పలి జిగటగను శీతలముగను మధురముగను గురుత్వము గనునుండు. మరియు నిది కఫమును గలుగంజేయు.

(మోడి) పిప్పలిమూలము.

శ్లో॥ మూలంతుపిప్పలీమూలంగ్రంథికంజటిలాశిరః ।
కోలమూలంకటుగ్రంథిసర్వగ్రంథివిరూపకం ।
మూలకంమూషణంకోలపత్రాగ్రంపాణితంజటః ॥

టీక॥ 1 మూల 2 పిప్పలీమూల 3 గ్రంథిక 4 జటిలా 5 శిర 6 కోలమూల 7 కటు 8 గంథి 9 సర్వగ్రంథి 10 విరూపక 11 మూలక 12 మూషణ 13 కోలపత్రాగ్ర 14 పాణిత 15 జట యీ 15 న్ను పిప్పలీమూలము పేళ్ళు. దీనినే మోడియని జెప్పుదురు.

## పిప్పలీమూల గుణము.

శ్లో॥ గ్రంథికం దీపనం కాసఘ్నం ఉష్ణం గుల్మానిలాపహం ।
క్రిమిహృద్రోగశమనం పాండుశోథాగ్నిమాంద్యజిత్ ॥

తా॥ పిప్పలీమూలము [illegible] మోడి శ్లేష్మము కాసము గుల్మము వాతము క్రిమిరోగము హృద్రోగము పాండువు వాపు అగ్నిమాంద్యము వీటిని నివర్తింపఁజేయును.

## చవ్యము.

శ్లో॥ చవికా కోలవల్లీ చ చవ్యం పావన మేవ చ ।
తురః కోపసిరః తీక్ష్ణః కోలకం కూటము స్రకం ॥

టీక॥ 1 చవికా 2 కోలవల్లీ 3 చవ్య 4 పావన 5 తుర 6 కోపసిర 7 తీక్ష్ణ 8 కోలక 9 కూటము స్రక యీ 9 న్ని చవ్యమునకు పేర్లు.

## చవ్య గుణము.

శ్లో॥ చవ్యం కటూష్ణం దీపనం [illegible] హృద్రోగశూలజిత్ ।
కఫోదర [illegible] ।
అగ్ని [illegible] నాశనం ॥

తా॥ చవ్యము [illegible]. మఱియును నిది కుష్ఠువు హృద్రోగము శూలము కఫము వాతము వీటిని నివర్తింపఁజేయును.

## గజపిప్పలి.

తస్యాః ఫలం సముద్దిష్టం శ్రేయసీ హస్తిపిప్పలీ ।
కణా నాగకణా కుంచా కృత్రిమం చవికాఫలం ॥

టీక॥ 1 శ్రేయసి 2 హస్తిపిప్పలీ 3 కణా 4 నాగకణా 5 కుంచా 6 కృత్రిమ 7 చవికాఫల యీ 7 న్ని గజపిప్పలి పేర్లు. ఇది చవ్యముయొక్క ఫలమని తెలిసికొనవలయును.

## గజపిప్పలి గుణము.

శ్లో॥ గజపిప్పలికా స్వాదుః కటూష్ణా చ ప్రకీర్తితా ।
బలాసం హన్తి వాతం చ సా తు జంతుదయప్రదా ।
తన్ద్రైవ నేత్రరోగఘ్నీ వృష్యాదిః సమాంద్యజిత్ ।
కాసశ్వాసప్రశమనీ ఆమవాతానిలాంతయేత్ ॥

శొంఠి గుణము.

శ్లో॥ శుంఠీస్నిగ్ధోష్ణకటుకావృష్యాచైవాగ్నిమాంద్యజిత్ ।
హంతివాతోదరశ్వాసపాండుశ్లీపదనాశనః ।
పాచనంకఫకాసఘ్నంతథారుచ్యంచశూలనుత్ ।
విబంధాధ్మానశోఫఘ్నంహృద్రోగంగ్రహణీంహరేత్ ॥

తా॥ శొంఠి జిగటగను ఉష్ణముగను కారముగను రుచికరముగనునుండు. మఱియు నిది అగ్నిమాంద్యము వాతము మహోదరము శ్వాస పాండువు శ్లీపదరోగము కఫము కాసము శూల విబంధరోగము కడుపుబ్బరము శోఫ హృద్రోగము గ్రహణి వీనిని బోగొట్టుటయే గాక వీర్యవృద్ధికరముగను జీర్ణకారిగనునుండు.

అల్లము.

శ్లో॥ ఆర్ద్రికంకటుకంభద్రంభేషజంతాగరకంతథా ।
మర్దకంభద్రకంశృంగంఆర్ద్రికాశ్వకటుఘనా ॥

టీక॥ 1 ఆర్ద్రిక 2 కటుక 3 భద్ర 4 భేషజ 5 తాగక 6 మర్దక 7 భద్రక 8 శృంగి 9 ఆర్ద్రికాశ్వ 10 కటు 11 ఘనా యీ 11 న్ను అల్లము పేళ్ళు.

అల్లపు గుణము.

శ్లో॥ ఆర్ద్రికంశూలరోగఘ్నంశ్లేష్మపాండ్వనిలాపహం ।
అరోచకహరంవృష్యంఅగ్నిమాంద్యత్రిదోషజిత్ ॥

తా॥ అల్లము శూల శ్లేష్మము పాండువు వాతము అరుచి అగ్నిమాంద్యము త్రిదోషములు వీనిని బోగొట్టుటయే గాక ధాతుపుష్టిని సదా గలుగంజేయు.

పుస్తుకాంతరే.

శ్లో॥ ఆర్ద్రికంనాగరగుణం భేదనందీపనంగురు । కట్వుష్ణందీపనం
వృష్యంరుచ్యమార్ద్రికనాగరమ్ । శ్వాసకాసవమీహిక్కా
వాతశ్లేష్మవిబంధనుత్ । పాచనంరోచనంవృష్యంకట్వుష్ణం
వహ్నిదీపనం । వాతప్రకోపశమనం రేచనంశోథహృత్పరం ।
భోజనాదౌసదాపథ్యంజిహ్వాకంఠవిశోధనం । అవ్యక్తరసవీర్య
త్వాత్తత్పరంతుకఫాపహం । కాంజికార్ద్రిసలవణందీపనంపా
చనంపరం । వాతప్రకోపశమనంహర్షణంలవణార్ద్రకమ్ ॥

తా॥ అల్లము శొంఠియొక్క గుణములే కలదైయుండును. దోషముల భేదించును అగ్నిదీపనము గురుత్వము వీటినిజేసును. పచ్చిగనుండు శొంఠి అధిక కాక అగ్నిదీపనము వీర్యవృద్ధి వీటినిజేయు. రుచికరముగనుండు. మరియు నిది శ్వాసము కాసము వాంతి ఎక్కిళ్ళు వాతము శ్లేష్మము మలబంధము వీటినిబోగొట్టు. ఈశొంఠిని భోజనాదులయందు చేర్చుకొనిభుజించిన పాచనము రుచి వీర్యవృద్ధి అధికకాక అగ్నిదీపనము వీటిని గలుగంజేయు. మఱియు నిది వాతప్రకోపము వాపు వీటిని బోగొట్టును. విరేచనము జేయించును. నాలుక కంఠము వీటినిశోధించు. దీనియందు కారము గసము ఇవి గూఢముగనుండుటవలన కఫమును హరించు. పచ్చిశొంఠిని పులికడుగు సైంధవలవణము వీటితోసేవించిన అగ్నిదీపనము పాచనము వీట్లను గలుగంజేయు. అల్లమును సైంధవలవణముతో సేవించిన వాతప్రకోపమును శమింపంజేయుటయేగాక పుష్టిని సగా గలుగంజేయు.

మిరియాలు.

శ్లో॥ మరిచంఫలితంశ్యామంవల్లిజంకృష్ణమూషణం ।
యవనేష్టంసువృత్తంచకోలకంచర్మబంధనమ్ ॥

టీక॥ 1 మరిచ 2 ఫలిత 3 శ్యామ 4 వల్లిజ 5 కృష్ణ 6 ఊషణ 7 యవనేష్ట 8 సువృత్త 9 కోలక 10 చర్మబంధన యీ 10 న్ని మిరియాలపేర్లు.

మిరియాల గుణము.

శ్లో॥ మరిచంకటుకంచోష్ణంశ్లేష్మకాసాగ్నిమాంద్యజిత్ ।
నాత్యుష్ణంనాతితీక్ష్ణంచదోషత్రయనివారణం ।
వాయుంనివారయత్యేవజంతుసంతాననాశనం ।
క్రిమిహృద్రోగశమనంశోఫదుర్నామనాశనం ॥

తా॥ మిరియాలు కారముగను ఉష్ణముగనునుండు. మఱియు నిది శ్లేష్మము కాసము అగ్నిమాంద్యము త్రిదోషములు వాతము జంతువాయువు క్రిములు హృద్రోగము శోఫ దుర్నామరోగము వీటిని నివర్తింపజేయు. ఇది అత్యుష్ణముగగాని అతితీక్ష్ణముగగాని నుండదు.

తెల్లమిరియాలు.

శ్లో॥ సితంమరీచంశిగ్రాఖ్యంసితవల్లీయవాలకం ॥

టీక॥ 1 శిగ్రాఖ్య 2 సితవల్లీయ 3 వాలక యీ 3 న్ను తెల్లమిరియాలపేర్లు.

### తెల్లమిరియాల గుణము.

శ్లో॥ శ్వేతంతుమరిచంవృష్యంనేత్రరుజాపహం ।
స్వరభంగప్రతిశ్యాయమూత్రకృచ్ఛ్రవినాశనం ॥

తా॥ తెల్లమిరియాలు వృషము నేత్రరోగము స్వరభంగము పీనస మూత్రకృచ్ఛ్రము వీటిని నివర్తింపంజేయుటయే గాక ధాతుపుష్టిని నిగా గలుగంజేయు.

### ఓమము.

శ్లో॥ యవానీదీపకోదీప్యోయవనాహ్వోయవాసకః ।
యవానికోగ్రగంధాచదీపనీయ్యాదపీపనీ ॥

టీక॥ 1 యవానీ 2 దీపక 3 దీప్య 4 యవనాహ్వ 5 యవాసక 6 యవానిక 7 ఉగ్రగంధా 8 దీపనీయ్యా 9 దీపనీ యీ 9 న్ని ఓమముపేళ్ళు.

### ఓమపు గుణము.

శ్లో॥ యవానీకటుతిక్తోష్ణావాతశ్లేష్మాపహాతథా ।
హంతిగుల్మారుచింశూలందీపయత్యాశుపాచనం ।
వ్రణాధ్మానంగతాన్రోగాన్చాష్టశూలానివారయేత్ ॥

తా॥ ఓమము కారముగను చేదుగను ఉష్ణంగనునుండును. ఇది వాతశ్లేష్మగుణ వీటివలన గలిగెడు రోగములు గుల్మము అరుచి శూల వ్రణ ఆధ్మాన మున్నగు ధాతుపులవంటివి రోగములు అష్టశూలలు అతిసారము వీటిని బోగొట్టుటయే గాక అగ్నిదీపనమునునిగా గలుగంజేయు.

### చోరి ఓమము.

శ్లో॥ జవానీయాజవానీస్యాచ్చోహారజంతునాశనః॥

టీక॥ 1 జవానీయా 2 జవానీ 3 చోహార 4 జంతునాశన యీ 4 న్ను చోరి ఓమముపేళ్ళు.

### చోరిఓమపు గుణము.

శ్లో॥ చోహారస్తద్గుణఃప్రోక్తోవిశేషాత్క్రిమినాశనః ॥

తా॥ చోరిఓమము ఓమమునొక్క గుణముకలదైయుండును. మరియు విశేషముగ క్రిమిరోగములను బోగొట్టు.

## చింత.

శ్లో॥ వృక్షామ్లంతింత్రిణీకంచశాకామ్లంరక్తపూరకం ।
ఆమ్లవృక్షోమ్లశాకంస్యాత్ ఆమ్లపూరోమహీతరుః ।
రక్తమాడోరసామ్లంచవరామ్లశ్చఫలామ్లకః।
మహీరుహాశ్చించవృక్షోమ్లికాచించాఫలద్రుమః ॥

టీక॥ 1 వృక్షామ్ల 2 తింత్రిణీక 3 శాకామ్ల 4 రక్తపూరక 5 ఆమ్లవృక్ష 6 ఆమ్లశాక 7 ఆమ్లపూర 8 మహీతరు 9 రక్తమాడ 10 రసామ్ల 11 వరామ్ల 12 ఫలామ్లక 13 మహీరుహా 14 చించవృక్ష 15 అమ్లికా 16 చించా 17 ఫలద్రుమ యీ 17 న్ను చింత పేళ్లు.

## చింత గుణము.

శ్లో॥ వృక్షామ్లంభేదిపిత్తఘ్నంరుచ్యమష్ణకిరంపరం ।
క్రిమిహృద్రోగశమనంగుల్మశ్లేష్మానిలాపహం ॥

తా॥ చింత రుచికరముగనుండు. ఇది వాంతి పిత్తము క్రిమిరోగము హృద్రోగము గుల్మము శ్లేష్మము వాతము వీటిని నివారణముచేయుటయేగాక అగ్నిదీపనమును వగా కలుగంజేయు.

## పుల్లకాంతిరె.

శ్లో॥ అమ్లికాఽమాగురుర్వాతహారాపిత్తకఫాస్రకృత్ । పక్వాతద్వత్సరారుచ్యావహ్నివస్తివిశుద్ధికృత్ । శుష్కాహృద్యాశ్రమభ్రాంతితృష్ణాక్లమహరాలఘుః॥ తింత్రిణీపల్లవంహృద్యంకషాయామ్లంరుచిప్రదం । నేత్రరోగహరంమేధ్యందీపనంకఫవాతజిత్ ॥ చించాపుష్పంతుతువరంస్వాద్వమ్లంచరుచిప్రదం । విశదంచాగ్నిజనకంప్రమేహఘ్నంకఫాపహం । చించాపత్రంతుశోఫఘ్నంరక్తదోషవ్యథాపహం । తస్యపుష్పత్వచాభస్మశూలమందాగ్నినాశనం । అమ్లసారస్తుతీక్ష్ణోష్ణోవాతఘ్నఃకఫపిత్తకృత్ ।అమ్లేనశర్కరాయుక్తోదాహపిత్తార్తిశాంతినుత్ ॥

తా॥ చింతపిందెలు గురుత్వముగనుండు. మరియు నిది వాతము పిత్తము కఫము రక్తదోషము వీటిని బోగొట్టును. పండిన చింతకాయ వేగము కలదిగను రుచికరముగనుండు. జానగాగ్ని పొట్టకడుపు వీటిని శుద్ధిచేయును. చింతపరుగు చులకనగ

నుండు. మరియు నిది శ్రమ భ్రమము దప్పి బడలిక వీటిని నివర్తింపంజేయుటయే గాక హృదయమునకు మేలును సగా గలుగంజేయు. చింతచిగురు వగరుగను పుల్లగను రుచికరముగనునుండు. మరియు హృదయము బుద్ధి వీటికి మేలుజేసును మరియు నిది నేత్రరోగము కఫము వాతము వీటిని బోగొట్టుటయేగాక అగ్నిదీపనమును సగా గలుగం జేయు. చింతపూలు వగరుగను తియ్యగను పుల్లగను రుచికరముగను శోధనకారిగను నుండు. మరియు నిది ప్రమేహము కఫము వీటిని నశింపంజేయుటయేగాక అగ్నిదీపనమును సగా గలుగంజేయు. చింతాకు వాపు రక్తదోషము వీటిని హరించును. చిరతపూలభస్మము పట్టభస్మము ఇవి శూల అగ్నిమాంద్యము వీటిని బోకడచు. చింతాకు రసము వేగము గలదిగనుండు. మరియు అమ్లవాతమును హరింపంజేయు. మరియు నిది కఫము పిత్తము వీటినిజేయును. చింతాకురసమును శర్కరతో సేవించిన తాపము పిత్తము బడలిక ఇవి నశించు.

### చింతపండు.

శ్లో॥ తింతిడీకంతువృక్షామ్లమమ్లశాకోమ్లపాదపః ॥

టీక॥ 1 తింతిడీక 2 వృక్షామ్ల 3 అమ్లశాక 4 అమ్లపాదప యీ 4 న్ను చింత పండు పేళ్ళు.

### చింతపండు గుణము.

శ్లో॥ తింతిడీకఫలమామం వాతఘ్నమమ్లముష్ణంగురు ।
తత్పక్వంలఘుసంగ్రాహిగ్రహణీకఫవాతజిత్ ॥

తా॥ చింతపండు వాతమును బోగొట్టును. చింతగుల్ల మిక్కిలి ఉష్ణముగను గురుత్వముగనునుండు. పండినచింతగుల్ల లఘువుగను మలబద్ధకారిగనునుండు. మతియు నిది గ్రహణి కఫము వాతము దీనిని నశింపంజేయు.

### పుల్లప్రబ్బలి.

శ్లో॥ అమ్లోమ్లవేతసోభీమోరసామ్లశ్శరభేదకః।
గన్ధసారోవేతసామ్లశ్శతభేదీచభేదకః ॥

టీక॥ 1 అమ్ల 2 అమ్లవేతస 3 భీమ 4 రసామ్ల 5 శరభేదక 6 గంధసారిక 7 వేతసామ్ల 8 శతభేదీ 9 భేదక యీ 9 న్ని పుల్లప్రబ్బలి పేళ్ళు

### పుల్లప్రబ్బలి గుణము.

శ్లో॥ రసామ్లంగుల్మహృద్రోగదుర్నామవాయుశూలజిత్ ।
దీపనంవమథుంహంతిపిత్తభ్రమవినాశనం॥

తా॥ పుల్లప్రబ్బలి గుల్మము హృద్రోగము దుర్నామరోగము వాయువు శూల వాంతి పిత్తభ్రమ వీటిని నశింపంజేయుటయేగాక అగ్నిదీపనమును సగా గలుగంజేయు

### అజామోదము.

శ్లో॥ అజగంధాబస్తగంధాపశుగంధావిగంధికా ।
కారవీబర్బరాగంధాతుంగీపూతిమయూరకః ॥

టీక॥ 1 అజగంధా 2 బస్తగంధా 3 పశుగంధా 4 విగంధికా 5 కారవీ 6 బర్బరా 7 గంధా 8 తుంగీ 9 పూతిమయూరక యీ 9 న్ని అజామోదము పేళ్ళు.

### అజామోదపు గుణము.

శ్లో॥ అజగంధాకటుస్తిక్తాతీక్ష్ణోష్ణాకఫవాతజిత్ ।
హిధ్మాధ్మానారుచింహంతిక్రిమిజిద్వహ్నిదీపనం ॥

తా॥ అజామోదము కారముగను చేదుగనునుండు. ఇది కఫము వాతము హిధ్మ కడుపుబ్బరము అరుచి క్రిములు వీటిని నివర్తింపంజేయుటయేగాక అగ్నిదీపనమును సగా గలుగంజేయు,

### అజామోదపు విత్తులు.

శ్లో॥ అజమోదాబస్తమోదాదీప్యకోలాచమర్కటీ ।
శిఖాహ్వాకారవీగంధామోదాహస్తిమయూరకః।
బ్రహ్మకుశోగ్రగంధాచహృద్యగంధాచకీర్తితా ॥

టీక॥ 1 అజమోదా 2 బస్తమోదా 3 దీప్యకోలా 4 మర్కటీ 5 శిఖాహ్వా 6 కారవీ 7 గంధా 8 మోదా 9 హస్తిమయూరక 10 బ్రహ్మకుశ 11 ఉగ్రగంధా 12 హృద్యగంధా యీ 12 న్ను అజామోదపువిత్తుల పేళ్ళు.

### అజామోదపువిత్తుల గుణము.

శ్లో॥ గుల్మాష్ఠీలకఫానాహశూలజిద్వహ్నికృత్పరం ।
అనిలజ్వరశోషఘ్నమజామోదస్యబీజకం ॥

తా॥ అజామోదపువిత్తులు గుల్మను అష్ఠీలవాతము కఫము కడుపుబ్బరము శూల వాతము జ్వరము శోష వీటినిబోగొట్టుటయేగాక అగ్నిదీపనమును సగాగలుగంజేయును.

వెలగ.

శ్లో॥ కపిత్థోథదధిత్థస్తుగ్రాహీంఫలసుగంధికా ।
అజసస్యోదధిఫలశ్చిరపాకీకపిప్రియః ।
గ్రంధపత్రోహ్యాద్యగంధోదంతశాఠోవిశాలకః ।
సితపుష్పఃపయఃక్షీరఃతథాపుష్పఫలీమతః ॥

టీక॥ 1 కపిత్థ 2 దధిత్థ 3 గ్రాహీంఫల 4 సుగంధికా 5 అజసస్య 6 దధిఫల 7 చిరపాకీ 8 కపిప్రియ 9 గంధపత్ర 10 హ్యాద్యగంధ 11 దంతశాఠ 12 విశాలక 13 సితపుష్ప 14 పయః 15 క్షీరః 16 పుష్పఫలీ యీ 16 న్ను వెలగపేర్లు.

వెలగ గుణము.

శ్లో॥ ఆమంకపిత్థంమస్వర్యంకఫఘ్నంగ్రాహిశీతళం ।
కఫానిలహంరంపక్వంమధురామ్లరసంగురు ।
శ్వాసకాసారుచిహారంతృష్ణాఘ్నంకంఠశోధనం ॥

తా॥ వెలగకాయ మలబద్ధకముగను శీతలముగనునుండు. మరియు నిది స్వరము కఫము వీటిని నశింపంజేయును. దీనిఫలము మధురముగను పుల్లగను గురుత్వముగనునుండు మరియు శ్వాస కాసము అరుచి దప్పి వీటిని నివర్తింపంజేయుటయేగాక కంఠశుద్ధిని గలుగంజేయును.

(శర్కర) పంచదార.

శ్లో॥ శర్కరోక్తాతుమత్స్యండీశ్వేతమత్స్యండికాసితా ।
అహింఛత్రాతుసితకాశుద్ధాశుభ్రాసితోపలా ॥

టీక॥ 1 శర్కర 2 మత్స్యండీ 3 శ్వేతమత్స్యండికా 4 సితా 5 అహింఛత్రా 6 సితకా 7 శుద్ధా 8 శుభ్రా 9 సితోపలా యీ 9 న్ని పంచదారపేర్లు.

పంచదార గుణము.

శ్లో॥ శర్కరాతాపమూర్ఛాఘ్నీరక్తపిత్తాతిదాహజిత్ ।
ఛర్దిహిక్కారుచిహరాభ్రమమేహామకృచ్ఛ్రనుత్ ॥

తా॥ పంచదార తాపము మూర్ఛ రక్తపిత్తము అతిదాహము వాంతి ఎక్కిళ్లు అరుచి భ్రమ మేహము ఆమవాతము మూత్రకృచ్ఛ్రము వీటిని నివర్తింపంజేయు.

## మధుశర్కర.

శ్లో॥ శర్కరాన్యామధుభవామాధవీమధుశర్కరా ।
మాక్షికీశర్కరాప్రోక్తాతిక్తకామధునోద్భవా ॥

టీక॥ 1 మధుభవా 2 మాధవీ 3 మధుశర్కరా 4 మాక్షికీ 5 శర్కరా 6 తిక్తకా 7 మధునోద్భవా యీ 7 న్ను మధుశర్కరపేర్లు

## యవాస శర్కర.

శ్లో॥ యవాసశర్కరాత్వన్యానిర్దిష్టాయాసశర్కరా ॥

టీక॥ యాసశర్కరా యనునది యవాసశర్కరపేరు.

## తవరాజ శర్కర.

శ్లో॥ తవరాజఃశతిపదిగోశఘ్నశ్చవరాజకః ॥

టీక॥ 1 తవరాజ 2 శతపది 3 గోశఘ్న 4 రాజక యీ 4 న్ను తవరాజ శర్కరపేర్లు.

## ఖండశర్కర.

శ్లో॥ విశేషాద్ధాతఖండస్యమత్స్యండీఫణికాస్మృతా ।
గుళికాచాస్యమత్స్యండీఖండశ్చపరికీర్తితా ॥

టీక॥ 1 మత్స్యండీ 2 ఫణికా యీ 2 న్ను మరికతీయబడిన ఖండశర్కర పేర్లు 1 మత్స్యండీ 2 ఖండ యీ 2 న్ను గట్టిగనుండు ఖండశర్కరపేర్లు. దీనినే కలకండ యందురు.

## శర్కరాచతుష్టయ గుణము.

శ్లో॥ శర్కరామధుసంభూతా ఛర్ద్యతీసారనాశనీ । తద్వైవభేదనీ
రూక్షాకషాయస్వాదుపాకినీ । అగ్నిప్రసాదదంచూర్ణంపరమం
రుచివర్ధనం । ప్లీహకాసమదార్శాంసి శ్వాసంశూలంజ్వరం
వమిం।నిహంతిదీప్తయత్యగ్నిబలవర్ణకరంపరం। వాతానులో
మనంహృద్యంకంఠజిహ్వావిశోధనం॥

తా॥ మధుశర్కర రూక్షముగను వగరుగను రుచికరముగనునుండు. మఱియు నిది వాంతి అతిసారము వీటిని నివర్తింపంజేయుటయేగాక అగ్నిదీపనమును సగా గలుగంజేయు. శర్కరాచూర్ణము స్నేహము కాసము అర్శస్సు శ్వాస శూల జ్వరము వాంతి కంఠదోషము జిహ్వాదోషము వీటిని నివర్తింపంజేయుటయేగాక అగ్ని ప్రసాదము రుచి అగ్నిదీప్తి బలము దేహకాంతి వాయువు క్రమముగ సంచరించుట వీటిని గలుగంజేయు.

గద్య॥ ఇతి ధన్వంతరీయే నిఘంటౌ నానాద్రవ్య పర్యాయ

శ్రీ గుణ ప్రకాశే ద్వితీయః శతపుష్పాదివర్గః.



శ్రీరస్తు.

# ధన్వంతరినిఘంటువు.

## చందనాద్యనుక్రమణిక.

శ్లో॥ చందనంకుంకుమోశీరంప్రియంగుఃస్థౌణరోచనా।తురుష్కాగ
రుకర్పూరఃకస్తూరీజాతిపత్రికా । జాతీఫలంతతఃప్రోక్తం జయా
పత్రంతతఃపరం ॥ కంకోలకస్తథాపూగోలవంగకుసుమానిచ।
నలికానఖదంకుష్ఠంహరేణుస్తగరంప్లవం । నఖంవ్యాఘ్రనఖం
స్పృక్కాబోలందమనకంమురా । స్థౌణేయకంచోరకంచశైలే
యంశైలవాలుకం । సరళంసప్తపర్ణంచలాక్షాతామలకీతథా।
లామజ్జకంపద్మకంచధాతకీకుసుమానిచ। ప్రపౌండరీకంకచోరం
సమాంశైఃశాణమాత్రకైః । ఏషాంవిభాగోరాలస్తునలికా
యంత్రితఃపచేత్ ।మహాసుగంధితైలంతత్ ప్రస్థతైలేనసాధితం ।
ప్రస్వేదమలదౌర్గంధ్యం కండూకుష్ఠహరంపరం । అనేనాభ్య
క్తగాత్రస్తు వృద్ధస్సప్తతికోభవేత్ । యువాభవతిశుక్లాఢ్యః
స్త్రీణామత్యంతవల్లభః । సుభగోదర్శనీయశ్చ గచ్ఛేచ్చప్ర
మదాశతం । వంధ్యాపిలభతేగర్భంషండోపిపురుషాయతే ।
అపుత్రఃపుత్రమాప్నోతి జీవేచ్చశరదాంశతం । మనశ్శిలా
చసిందూరంసౌరాష్ట్రీగంధపారదం। సన్నిగ్ధకఃసర్జరసఃకాసీసః
పుగుకుంగురుః । శ్రీవాసస్సల్లింసిల్హంకింకుష్ఠంచాప్యరుష్కరం।
ఏభిర్గోమూత్రసంయుక్తంకటుతైలంవిపాచయేత్ ।పామా
విచర్చికాదద్రుకండూకుష్ఠక్రిమివ్రణాన్ । అభ్యంగాన్నాశయ
త్యేవనాడీదుష్టవ్రణానపి । తుత్థంచతాప్యంజనధాతుఫేనైఃస
శంఖకైః గైరికలోధ్రశంఖైః । నేత్రాంజనంకాచమలాతికం
దూరీరుగ్దాహార్తిమిర్యపరిశ్రమఘ్నం । చందనాదిరయంవర్గ
స్తృతీయస్సముదాహృతః । తుత్థంరసాంజనంచైవగిరిజంవర

మాక్షికం । సౌవీరంగైరికంఫేనంచక్షుష్యంకుసుమాంజనం।
అమ్ప్యుప్రసాదనఫలం హాహోఃదీర్ఘఃస్యనిశ్వసః । నేత్రాంజన
మిదంచైవచక్షూరోగమలాపహాః ॥

టీక॥ చందనం-చందనము లోహితం-రక్తచందనం కాలేయం-పీతచందనము కుంకుమం-కుంకుమపువ్వు ఉశీరం-వట్టివేళ్ళు ప్రియంగు-ప్రేంఖణపుచెట్టు స్థూణిక-నంది వృక్షము రోచనా-గోరోచనము తురష్క-తురుష్కము అగరు-పీతాగరు కృష్ణాగరు కర్పూర-కర్పూరము కస్తూరీ-కస్తూరి జాతిపత్రికా-జాపత్రి జాతీ-జాజికాయ జయ పత్రం-గెంజాయిఆకు కంకోల-తకోల్కలపుట్లు పూగా-పోక లవంగకుసుమ-లవంగ పువ్వు నలికా-పగడపుతీగె నళదం-జటామాంసి గంధమాంసి కుష్ఠం-చంగల్వకోష్టు హరేణు-రేణుకలు తగరం-గ్రంధితగరము ప్లవం-నాగరముస్తెలు నఖ-నఖము వ్యాఘ్ర నఖ-వ్యాఘ్రనఖము స్పృకా-స్పృక్క-యనుగ్రంధిద్రవ్యము బోళం-బోళము దమనక-దవనము మురా-మరువము స్థౌణేయకం-మాచిపత్రి చోరక-గద్దదవనము శైలేయం-తాతిపువ్వు శైలవాలుకం-కూశురుబుడమ సరళం-సరళదేవదారు సప్తపర్ణీ-ఏడాకుల పొన్న లాక్షా-లక్క తామలకి-నేలవుసిరిక లామజ్జకం-తెల్లవట్టివేరు పద్మకం-పద్మకము ధాతకీకుసుమ-ఆరెపువ్వు ప్రపౌండరీకం-పుండరీకపువ్వు కర్పూరం-గంధకర్పూరము మనశ్శిలా-మణిశిల గౌరం-హరిదళము సింధూరం-సింధూరము సౌరాష్ట్రికం-తువరి మన్ను సౌగంధి-గంధకము పారజం-ఇంగిలీకము వన్నిగ్ధకం-మైనము సర్జరసః-సర్జ రసము కాసీసః-కాసీసము పుర-గుగ్గిలం కుందురుః-కుందురుష్కము శ్రీవాసా-శ్రీవేష్ట కము నల్ల-అందుగు కంపిల్ల-కంపిల్లకము కంకుష్ఠం-కంకుష్ఠము అరుష్క-ఫ-జీడి తుత్థం-మైలుతుత్థము పాలతుత్థము తాప్య-హేమమాక్షికము జన-రసాంజనము ధాతు-కర్పూర శిలాజిత్తు-ఫేన-సౌవీరాంజనము నీలాంజనము సముద్రఫేనము కుసుమాంజనము పుష్పాం జనము గైరిక-గైరికద్వయము శ్లేష్మ చిల్లగింజ లోధ్ర-లొద్దుగు శంఖ-శంఖము.

—॥ చందనాదివర్గ ప్రారంభః. ॥—

చందనము.

శ్లో॥ చందనంగంధసారంచమహార్హం శ్వేతచందనం ।
భద్రశ్రియంమలయజంగోశీర్షంతైలపర్ణకం ।
కాలేయకంపీతసారంశ్రీఖండంచాకుభూపతిం

## నల్లఉమ్మెత్త గుణము.

శ్లో॥ త్రిపుష్పీకుష్ఠవాతఘ్నీగర్భలింగాతిఘూతినీ ।
మోహినీమోహహృద్బల్యాకఫశ్వాసవిషాపహా ॥

తా॥ నల్లఉమ్మెత్త కుష్ఠువు వాతము మోహము కఫము శ్వాసము విషము వీటిని నివర్తింపజేయుటయే గాక గర్భవాతము మఱ్ఱు బలము వీటిని సగా గలుగంజేయు.

## చన్నచల్లగడ్డ.

శ్లో॥ కలికారీతుహాలినీవిశల్యాగర్భపాతినీ ।
లాంగల్యగ్నిముఖీశీతిదీప్తాసాచేందుపుష్పికా ।
నఖపుష్పీవహ్నిచూడారంగిపుష్పాగ్నిజిహ్వికా ।
వహ్నిశిఖాగ్నికాత్జ్ఞేయానలరంధ్రీచసాస్మృతా ॥

టీక॥ 1 కలికారి 2 హాలినీ 2 విశల్యా 4 గర్భపాతినీ 5 లాంగలీ 6 అగ్ని ముఖీ 7 శీతి 8 దీప్తా 9 చేందుపుష్పికా 10 నఖపుష్పీ 11 వహ్నిచూడా 12 రంగ పుష్పా 13 అగ్నిజిహ్వికా 14 వహ్నిశిఖా 15 అగ్నికా 16 నలరంధ్రీ యీ 16 న్ను చన్నచల్లగడ్డపేర్లు.

## చన్నచల్లగడ్డ గుణము.

శ్లో॥ లాంగలీకటుతిక్తోష్ణాశోథార్శోవ్రణశూలజిత్ ।
కఫకుష్ఠోదరంహంతిపిత్తలాగర్భపాతినీ ॥

తా॥ చన్నచల్లగడ్డ కారముగను చేదుగను ఉష్ణముగనునుండు. ఇది శోఫ అర్శస్సు వ్రణము శూల కఫము కుష్ఠువు మహోదరము వీటిని నశింపజేయుటయే గాక పిత్తము గర్భపాతము వీటిని సగా గలుగంజేయు.

## గుంటగలగర.

శ్లో॥ భృంగరాజోభేకరాజోమార్కవోభృంగపవచ ।
భృంగారకోరాజమేషోభృంగారఃకేసరంజనః ।
మహానీలోభ్రింసనహాకేశ్యఃకేశప్రభాకరః ॥

టీక॥ 1 భృంగరాజ 2 భేకరాజ 3 మార్కవ 4 భృంగ 5 భృంగారక 6 రాజమేష 7 భృంగార 8 కేశరంజన 9 మహానీల 10 భ్రింసనహా 11 కేశ్య 12 కేశ ప్రభాకర యీ 12 న్ను గుంటగలగరపేర్లు.

## గుంటగలగర గుణము.

శ్లో॥ మార్కవ స్తిక్తరూక్షోష్ణః శోఫామకఫపాండునుత్ ।
చక్షుష్యః కుష్ఠకండూఘ్నః కేశ్యో మేధ్యో రసాయనః ॥

తా॥ గుంటగలగర చేదుగను రూక్షముగను ఉష్ణముగను పరిశుద్ధముగనునుండు మరియు నిది శోఫ ఆమవాతము కఫము పాండువు కుష్టువు దురద వీటిని నివర్తింపం జేయుటయే గాక కేశవృద్ధి బలము కండ్లకుచలువ వీటిని సగా గలుగంజేయు.

పుస్తకాంతరే.

శ్లో॥ భృంగరాజః కటు స్తిక్తో రూక్షోష్ణః కఫవాతహృత్ ।
దంత్యో రసాయన స్త్వచ్యః కుష్ఠనేత్రశిరోర్తినుత్ ।
శోఫకండూంచాంత్రవృద్ధిం శ్వాసకాసక్రిమీన్ హరేత్ ।
ఆమంపాండుంచహృద్రోగం త్వగ్రుజంచతథామదమ్ ॥

తా॥ గుంటగలగర కారముగను చేదుగను రూక్షముగను ఉష్ణముగనునుండు. మరియు నిది కఫము వాతము కుష్టువు నేత్రరోగము శిరోరోగము వాపు దురద ఆంత్రవృద్ధి శ్వాసము కాసము క్రిమిరోగము ఆమరోగము పాండువు హృద్రోగము చర్మమునందలిపీడ మదము వీటిని హరింపజేయుటయే గాక దంతములు చర్మము వీటికి హితకరముగను దేహమునకు బలకరముగనునుండు.

జిల్లేడు.

శ్లో॥ అర్కస్సూర్యాహ్వయః పుష్పీ విక్షీరో ధవికిరణః ।
జంబలః క్షీరవృక్షశ్చ హ్యాస్ఫోటో భాస్కరో రవిః ।
టుంటుకీనాసదాపుష్పీ కిరీశుకఫలా తథా ।
పాపకోచాపికాచైవ సూనస్సూర్యకపుష్పికా ॥

టీక॥ 1 అర్క 2 సూర్యాహ్వయ 3 పుష్పీ 4 విక్షీర 5 కిరణ 6 జంబల 7 క్షీరవృక్ష 8 ఆస్ఫోట 9 భాస్కర 10 రవి 11 టుంటుకీనా 12 సదాపుష్పీ 13 కిరీ 14 శుకఫలా 15 పాపకోచా 16 పికా 17 సూన 18 సూర్యకపుష్పికా యీ 18 న్ని జిల్లేడు పేళ్ళు.

రాచజిల్లేడు.

శ్లో॥ రాజార్కో వసుకోఽప్యర్కో మందారో గణరూపకః ।
ఏకాష్ఠీలీ సదాపుష్పీ శ్చాలర్క ప్రతాపనః ॥

టీక॥ 1 రాజార్క 2 వసుక 3 అర్క 4 మందార 5 గణరూపక 6 ఏకాష్ఠీలి 7 సదాపుష్పీ 8 అలర్క 9 ప్రతాపన యీ 9 న్ని రాచజిల్లేడు పేళ్ళు.

జిల్లేడు రాచజిల్లేడు గుణము.

శ్లో॥ అర్కద్వయంతి క్తముష్ణం వ్రణవాతాభిఘాతజిత్ ।
సన్నిపాతజ్వరశ్వాసజరామృత్యురుజాపహం ॥

తా॥ జిల్లేడు రాచజిల్లేడు ఇవి చేదుగను ఉష్ణముగనునుండు. మరియు నిది వ్రణము వాతము అభిఘాతము సన్నిపాతజ్వరము శ్వాసము ముసలితనము మృత్యువు నొప్పి వీటిని నివర్తింపంజేయు.

పుస్తకాంతరే.

శ్లో॥ అర్కద్వయం శంఖవాతం కుష్ఠకండూవిషవ్రణాన్ । నిహంతి ప్లీహగుల్మార్శోయకృచ్ఛ్లేష్మోదరక్రిమీన్ । తత్క్షీరముష్ణం లవణం శ్లేష్మఘ్నం మస్తానిలం హరేత్ । తత్పుష్పం తువరం గుల్మ కఫార్శశ్శూలనాశనం । కాసం రక్తక్షయం చైవ నాశయేత్పుంస్త్వహానికృత్ ॥

తా॥ జిల్లేడు రాచజిల్లేడు ఇవి శంఖవాతము కుష్ఠము దురద విషము వ్రణములు ప్లీహము గుల్మము మూలశంఖ యకృత్తు శ్లేష్మము ఉదరరోగము నులిపురుగులు వీటిని నశింపంజేయు. జిల్లేడుపాలు ఉష్ణముగను ఉప్పగనునుండు. మరియు నిది కఫము శిరోవాతము వీటిని నివర్తింపంజేయు. జిల్లేడుపూలు వెగటుగనునుండు. మరియు గుల్మము కఫము మూలము శూల కాసము రక్తక్షయము పుంస్త్వము వీటిని నశింపంజేయు.

తెల్లజిల్లేడు.

శ్లో॥ శ్వేతార్కో దీర్ఘపుష్పశ్చ శ్వేతపుష్పస్తథైవచ ।
భూమిః కురవకః ప్రోక్తస్తపనస్సఫలస్తథా ॥

టీక॥ 1 శ్వేతార్క 2 దీర్ఘపుష్పి 3 శ్వేతపుష్ప 4 భూమి 5 కురవక 6 తపన 7 సఫల యీ 7 న్ను తెల్లజిల్లేడు పేళ్ళు.

తెల్లజిల్లేడు గుణము.

శ్లో॥ శ్వేతార్కః కటుతిక్తోష్ణోమలశోధనకారకః ।
మూత్రకృచ్ఛ్రా ప్లిశోషా ద్విణదోషవినాశనః॥

తా॥ తెల్లజిల్లేడు కారముగ చేదుగనుండును కాకజేసును మలమునుశోధించును మూత్రకృచ్ఛ్రము ఒకింతశోష వ్రణము వీటిని బోగొట్టును.

మోదెన.

శ్లో॥ వృకోవసుకఇత్యుక్తశ్శశాంకశ్శివశేఖరః ।
మహాపశుపతిశ్చైవ సువ్రతశ్శివమల్లికా ।
కీలశ్చకీలమూలశ్చకలపువ్యశ్చఘాతకః ॥

టీక॥ 1 వృక 2 వసుక 3 శశాంక 4 శివశేఖర 5 మహాపశుపతి 6 సువ్రత 7 శివమల్లిక 8 కీల 9 కీలమూల 10 కలపువ్య 11 ఘాతక యీ 11 న్ను మోదెనపేళ్ళు.

మోదెన గుణము.

శ్లో॥ వసుకః కటుతిక్తోష్ణః వాతశ్లేష్మవిషాపహః ।
హిధ్మాంచస్వయథుంఘోరాం ప్రతిహన్యాత్ప్రయోజితః ॥

తా॥ మోదెన కారముగను చేదుగను ఉష్ణముగనునుండు. మరియు నిది వాతము శ్లేష్మము విషము హిధ్మ వాపు వీటిని నివర్తింపంజేయు.

కాచి.

శ్లో॥ కాకమాచీధ్వాంక్షమాచీకాకసావ్హాహ్వచవాయసీ ।
కట్వీకట్వీఫలాచైవ రసాయనవరాస్మృతా ।
బహుళాకాకమాతాచతథాగుడఫలామతా ॥

టీక॥ 1 కాకమాచీ 2 ధ్వాంక్షమాచీ 3 కాకసావ్హ 4 వాయసీ 5 కట్వీ 6 కట్వీఫలా 7 రసాయనవరా 8 బహుళా 9 కాకమాతా 10 గుడఫలా యీ 10 న్ను కాచిపేళ్ళు.

కాచి గుణము.

శ్లో॥ కాకమాచీత్రిదోషఘ్నీస్నిగ్ధోష్ణాస్వరశుక్రదా ।
హృద్యారసాయనీశోథకుష్ఠార్శోజ్వరమేహజిత్ ॥

తా॥ కాచి జిగటగను ఉష్ణముగను బలకరముగను మనోహరముగనునుండు మరియు నిది త్రిదోషములు వాపు కుష్ఠువు అర్శస్సు జ్వరము మేహము వీటిని హరింపఁజేయుటయేగాక కంఠనాదము శుక్రము వీటిని వృద్ధిజేయును.

కాకిదొండ.

శ్లో॥ కాకనాసాధ్వాంక్షనాసాకాకతుండఫలాచసా ।
తురంగతస్కరస్నాయుధ్వాంక్షతుండఫలారుణీ ॥

టీక॥ 1 కాకనాసా 2 ధ్వాంక్షనాసా 3 కాకతుండఫలా 4 తురంగ 5 తస్కర 6 స్నాయు 7 ధ్వాంక్షతుండఫలా 8 అరుణీ యీ 8 న్ని కాకిదొండపేళ్ళు.

కాకిదొండ గుణము.

శ్లో॥ కాకనాసాచకటుకాగర్భస్రావాభిఘాతజిత్ ।
జ్వరవాతాగ్నిమాంద్యార్శఃపిత్తాపస్మారనాశినీ ॥

తా॥ కాకిదొండ కారముగనుండు. మరియు నిది గర్భస్రావము అభిఘాతము జ్వరము వాతము అగ్నిమాంద్యము అర్శస్సు పిత్తము మూర్ఛ వీటిని నశింపఁజేయు.

చిపురువెలుగు.

శ్లో॥ కాకజంఘాధ్వాంక్షజంఘాకాకపాదామలీమసా ।
పారావతపదీదాసీనతికాంతాచరీబలా ।
వాయసాంఘ్రీకాకచరణాతృణ్యావత్సాచజీవనీ ॥

టీక॥ 1 కాకజంఘా 2 ధ్వాంక్షజంఘా 3 కాకపాదా 4 మలీమసా 5 పారావతపదీ 6 దాసీ 7 నతికాంతా 8 చరీ 9 బలా 10 వాయసాంఘ్రీ 11 కాకచరణా 12 తృణ్యా 13 వత్సా 14 జీవనీ యీ 14 న్ను చిపురువెలుగు పేళ్ళు.

చిపురువెలుగు గుణము.

శ్లో॥ కాకజంఘాచతిక్తోష్ణారక్తపిత్తజ్వరాపహా ।
క్రిమిదోషవ్రణార్తిహా న్విషదోషహరీమతా ॥

తా॥ చిపురువెలుగు చేదుగను ఉష్ణముగనునుండు. ఇది రక్తపిత్తము జ్వరము క్రిమిరోగము వ్రణము విషము వీటిని నివర్తింపఁజేయు.

కాసర.

శ్లో॥ కాకాదనీకాకపీలుఃకాకతుండీసుతుండికా ।
వక్రశల్యాధ్వాంక్షనఖీసుదృఢ్మాకాకసంధికా ॥

## ఏరుముల్లంగి.

శ్లో॥ యామినోమూలకంచాన్యన్నిదిగ్ధంవాతజాగరం ॥

టీక॥ 1 యామిన 2 మూలక 3 నిదిగ్ధ 4 వాతజాగర యీ 4 న్ను ఏరుముల్లంగిపేళ్ళు.

## ఏరుముల్లంగి గుణము.

శ్లో॥ తద్గుణ స్త్వతిపిత్తఘ్నంకాసగుల్మాక్షిరోగజిత్ ॥
త్రిదోషశమనంకుష్ఠవిషదోషహరంలఘు ॥

తా॥ ఏరుముల్లంగి చులకనగనుండు. ఇది పిత్తాధిక్యము కాస గుల్మము నేత్రరోగము త్రిదోషములు కుష్ఠువు విషము వీటిని నివర్తింపంజేయు.

## మునగ.

శ్లో॥ శిగ్రుర్హారిశలాకశ్చశీఘ్రికోమలపత్రకః ।
అపదంశఃక్షమాదంశఃప్రోక్తోమూలకపత్రకః।
ఘనచ్ఛద స్తీక్ష్ణగంధోబహులచ్ఛదఏవచ ।
అక్షీణఃశాలవఃప్రోక్తోమురుగీకోచక స్తథా ॥

టీక॥ 1 శిగ్రు 2 హారిశలాక 3 శీఘ్రిక 4 మలపత్రక 5 అపదంశ 6 క్షమాదంశ 7 మూలకపత్రక 8 ఘనచ్ఛద 9 తీక్ష్ణగంధ 10 బహులచ్ఛద 11 అక్షీణ 12 శాలవ 13 మురుగీ 14 కోచక యీ 14 న్ను మునగపేళ్ళు.

## మునగ గుణము.

శ్లో॥ సౌభాంజనస్సమీరఘ్నఃకృమిగుల్మోదరాపహః ।
సన్నిపాతంకఫంహ న్తిదీపనశ్చాభిఘాతజిత్ ॥

తా॥ మునగ వాతము కృమిరోగము గుల్మరోగము మహోదరము సన్నిపాతము కఫము, అభిఘాతజ్వరము వీటిని నశింపంజేయుటయేగాక అగ్నిదీపనమును సగా గలుగంజేయు.

## కాఱుమునగ.

శ్లో॥ మురంగీమూలధవళోగృంజనోహరిమంజనం ।
ముఖభంగ స్తీక్ష్ణగంధస్సౌభాగ్యోవనశిగ్రుకః॥

టీక॥ 1 మురంగీ 3 మూలధవళ 6 గృంజన 4 హరిమంజన 5 ముఖభంగ 6 తీక్ష్ణగంధ 7 సౌభాగ్య 8 వనశిగ్రుక యీ 8 న్ని కాలుమునగ పేళ్ళు.

కాలుమునగ గుణము.

శ్లో॥ వనశిగ్రుఃకటు స్తీక్ష్ణఃప్లీహాగుల్మాస్త్రశూలజిత్ ।
శ్వాసకాసప్రతిశ్యాయగర్భస్వయథునాశనః॥

తా॥ కాలుమునగ కారముగను తీక్ష్ణముగనునుండు. మరియు నిది ప్లీహము గుల్మము అస్త్రశూలలు శ్వాసము కాసము పీనస గర్భము వాపు వీటిని నశింపంజేయు.

ఎఱ్ఱమునగ.

శ్లో॥ రక్తోసౌమధుశిగ్రుస్స్యాల్లోహితస్తీక్ష్ణమూలకః ।
రక్తపుష్పోవిష్ణుగుప్తస్తామ్రజశ్చారుణోగ్నకః ॥

టీక॥ 1 మధుశిగ్రు 2 లోహిత 3 తీక్ష్ణమూలక 4 రక్తపుష్ప 5 విష్ణుగుప్త 6 తామ్రజ 7 అరుణా 8 అగ్నక యీ 8 న్ని ఎఱ్ఱమునగ పేళ్ళు.

ఎఱ్ఱమునగ గుణము.

శ్లో॥ రక్తశిగ్రూరసేతీక్ష్ణశ్చక్షుఃపవనరోగజిత్ ।
నాసాకర్ణశిరోరోగాన్నాశయేత్ చాదుత్వంపరం ॥

తా॥ ఎఱ్ఱమునగ తీక్ష్ణముగనుండు. ఇది నేత్రరోగము వాతము నాసికా రోగము కర్ణరోగము శిరోరోగము వీటిని నశింపంజేయు.

మునగవిత్తులు.

శ్లో॥ తద్బీజంశాలికంశారీమరీచంశ్వేతపూర్వకం ॥

టీక॥ 1 శాలిక 2 శారీ 3 శ్వేతమరీచ 4 శ్వేతపూర్వక యీ 4 న్ని మునగ విత్తుల పేళ్ళు.

మునగవిత్తుల గుణము.

శ్లో॥ తీక్ష్ణస్యతంచులసోష్ణోవృష్యస్తంభాతిమేహజిత్ ।
ఘ్రాణాక్షిరోగశమనఃపిత్తరక్తహరఃపరం ॥

తా॥ మునగవిత్తులు ఉష్ణముగనుండు. ఇది మేహము నాసారోగము నేత్ర రోగము పిత్తము రక్తదోషము వీటిని నివర్తింపంజేయుటయేగాక ధాతుపుష్టి వీర్య స్తంభము వీటిని సగా గలుగంజేయు.

తెల్లావాలు.

శ్లో॥ సప్తపర్ణః స్వనఘోగౌరస్సిద్ధార్థో భూతనాశనః ।
కటుస్నేహాగ్రహఘ్నశ్చ కటుకోరాజకాఫలః ।
కుష్ఠనాశో దురాధర్ష స్తీక్ష్ణక శ్చారుసప్తపః ॥

టీక॥ 1 సప్తపర్ణ 2 అనఘ 3 గౌర 4 సిద్ధార్థక 5 భూతనాశన 6 కటుస్నేహ 7 గ్రహఘ్న 8 కటుక 9 రాజకాఫల 10 కుష్ఠనాశ 11 దురాధర్ష 12 తీక్ష్ణక 13 చారుసప్తప యీ 13 న్ను తెల్లావాలపేర్లు.

తెల్లావాల గుణము.

శ్లో॥ సప్తపః కటుతిక్తోష్ణో వాత శ్లేష్మజ్వరాపహః ।
క్రిమ్యాధ్మకండూకుష్ఠఘ్న స్తథాశీతానిలార్తినుత్ ॥

తా॥ తెల్లావాలు కారముగను చేదుగను ఉష్ణముగనునుండు. మరియు వాత వాతజ్వరము శ్లేష్మజ్వరము క్రిమిరోగము అపానవాతము దురద కుష్ఠువు శీతలము వాతము వీటిని నశింపజేయును.

బోదకసువు.

శ్లో॥ భూస్తృణో రోహిషో భూతి ర్భూతిరో ధకుటుంబకః । మాలాతృణశ్శృంగబీజః బధిరధ్వనిబోధనః ॥ గుహ్యబీజశ్చ గోపాలః పుంస్త్వనాశనపవచ। గోప్రియశ్చ సుగంధిశ్చ పూతిగంధః కుసుంభజః । శృంగరోహశ్చ పాలశ్చ ఛత్రో తిచ్ఛత్రక స్తథా । ఛత్రక్షౌరఇతిఖ్యాతో మాలేపత్రేతధాకృతిః ॥

టీక॥ 1 భూస్తృణ 2 రోహిష 3 భూతి 4 భూతిర 5 కుటుంబక 6 మాలాతృణ 7 శృంగబీజ 8 బధిరధ్వనిబోధన 9 గుహ్యబీజ 10 గోపాల 11 పుంస్త్వనాశన 12 గోప్రియ 13 సుగంధి 14 పూతిగంధ 15 కుసుంభజ 16 శృంగరోహ 17 పాల 18 ఛత్ర 19 అతిచ్ఛత్ర 20 ఛత్రక్షౌర యీ 20 న్ను బోదకసువుపేర్లు.

బోదకసువు గుణము.

శ్లో॥ భూస్తృణంకటుకంతిక్తంలఘు శ్లేష్మసమీరనుత్ ।
క్రిమిహృద్రోగశమనంజంతుసంతాపనాశనం ॥

### అడవిగగ్గెర.

శ్లో॥ అజ్జుకోభాతిసుముఖస్సుప్రశస్తోగరఘ్నకః ।
కపిత్థార్జకఇత్యన్యోవటపత్రిఃకటింజరః ॥

టీక॥ 1 అజాక 2 సుముఖ 3 సుప్రశస్త 4 గరఘ్నక 5 కపిత్థార్జక 6 వటపత్ర 7 కటింజర యీ 7 న్ను అడవిగగ్గెర పేళ్ళు.

### నల్లగగ్గెర.

శ్లో॥ కుఠేరకః స్మృతోమోన్యోమాలుకఃకృష్ణమాలుకః ।
కృష్ణార్జకఃకాలమాలాకరాళఃకృష్ణమల్లికా ॥

టీక॥ 1 కుఠేరక 2 మాలుక 3 కృష్ణమాలుక 4 కృష్ణార్జక 5 కాలమాలా 6 కరాళ 7 కృష్ణమల్లికా యీ 7 న్ను నల్లగగ్గెర పేళ్ళు.

### గగ్గెర గుణము.

శ్లో॥ కుఠేరకస్త్రికంతిక్తంశ్వాసదౌర్గంధ్యనాశనం ।
కఫానిలవిషంకంపాశిరఃపార్శ్వవ్యథాశూలజిత్ ॥

తా॥ గగ్గెర చేదుగనుండు. ఇది శ్వాసము దౌర్గంధ్యము కఫము వాతము విషము దురద తలనొప్పి పార్శ్వశూల వీటిని నివర్తింపంజేయు.

### ఎఱ్ఱావాలు.

శ్లో॥ సుముఖఃసుప్రశస్తశ్చగరఘ్నఃకటుపత్రకః ।
దోషభేదీసువక్త్రశ్చస్వాద్వష్టస్సువనోమతః ।
నిద్రాకరఃశోఫహారీదాహకారీచసస్మృతః ॥

టీక॥ 1 సుముఖ 2 సుప్రశస్త 3 గరఘ్న 4 కటుపత్రక 5 దోషభేదీ 6 సువక్త్ర 7 స్వాద్వష్ట 8 సువదన 9 నిద్రాకర 10 శోఫహారీ 11 దాహకారీ యీ 11 న్ను ఎఱ్ఱావాల పేళ్ళు.

### ఎఱ్ఱావాల గుణము.

శ్లో॥ కఫానిలవిషశ్వాసకాసదౌర్గంధ్యనాశనః ।
పిత్తహృత్పార్శ్వశూలఘ్నస్సుముఖస్సముదాహృతః ॥

తా॥ ఎఱ్ఱావాలు కఫము వాతము విషము శ్వాసము కాస దౌర్గంధ్యము పిత్తము పార్శ్వశూల వీటిని నివర్తింపంజేయు.

## నల్లావాలు.

శ్లో॥ ఆసురీమజికారాజకృష్ణకారాజసర్షపః।
తీక్ష్ణగంధాచాతితీక్ష్ణాక్షుపధుఃక్షుపకఃక్షువః ॥
రాజక్షుపకఇత్యన్యారాజికాకృష్ణసర్షపః ।
క్షుధాభిజనకాచైవతాశ్చోక్తారాజసర్షపాః ॥

టీక॥ 1 ఆసురీ 2 మజికా 3 రాజకృష్ణకా 4 రాజసర్షప 5 తీక్ష్ణగంధా 6 అతితీక్ష్ణా 7 క్షుపధు 8 క్షుపక 9 క్షువ 10 రాజక్షుపక 11 రాజికా 12 కృష్ణసర్షప 13 క్షుధాభిజనకా యీ 13 న్ను నల్లావాలపేళ్ళు.

## నల్లావాల గుణము.

శ్లో॥ రాజకాకటుకాతిక్తా స్నిగ్ధోష్ణావస్తిదూషణా । రుచిస్యాత్క ఫహృద్దృష్టిదూషణారక్తదూషణా ॥ ఏభిశ్చతక్రసంసిద్ధందద్రూదావర్తనంజయేత్ ॥ సిధ్మాని పామాపిటికాక్రిమికుష్ఠాన్యరూం షిచ।ఏభిర్గోమూత్రసంసిద్ధంతైలంకుష్ఠహరంపరం ॥

తా॥ నల్లావాలు కారముగను చేదుగను జిగటగను ఉష్ణముగను రుచికరముగను నుండు. మరియు నిది పొత్తికడుపునొప్పి కఫము హృద్రోగము దృష్టి రక్తము వీటిని నశింపంజేయు. మరియు దీనిని మజ్జిగతో పాకముజేసి పుచ్చుకొనిన దద్రురోగము ఉదావర్తము సిధ్మము గజ్జికురుపులు పిటికలు క్రిమిరోగము కుష్టువు పుండ్లు యివి నివర్తించు. మరియు నిదియు గోమూత్రము వీటిని తైలమునందు వైచిపాకముగవండి అభ్యంజనముచేసుకొనిన కుష్ఠురోగము నివర్తించు.

## కాకర.

శ్లో॥ కరీకఃకాండకటుకోనాసాగంధోరజఃకటుః ।
ఉగ్రగంధస్తోయవల్లీకారవల్లీసుకాండకః ।
కరీరోరాజకస్తీక్ష్ణకరస్స్యాద్వహ్నిధూమణః ॥

టీక॥ 1 కరీర 2 కాండకటుక 3 నాసాగంధ 4 రజ 5 కటు 6 ఉగ్రగంధ 7 తోయవల్లీ 8 కారవల్లీ 9 సుకాండక 10 కరీర 11 రాజక 12 తీక్ష్ణకర 13 వహ్ని ధూమణ యీ 13 న్ను కాకరపేళ్ళు.

### కాకర గుణము.

శ్లో॥ నిదిగ్ధః కాండకటుకస్తిక్తోష్ణా వాతదూషణః।
రుచిస్యాత్కఫహృత్కుష్ఠదూషణః పిత్తకోపనుత్ ॥

తా॥ కాకర కారముగను చేదుగను ఉష్ణముగను రుచికరముగనునుండు. మరియు నిది వాతము కఫము కుష్టువు పిత్తప్రకోపము వీటిని నివర్తింపంజేయు.

### నీరుపిప్పలి.

శ్లో॥ జలపిప్పల్యభిమతా శారదా తోయపిప్పలీ।
మత్స్యాదనీ మత్స్యగంధా లాంగలీ శకులాదనీ ॥

టీక॥ 1 జలపిప్పలి 2 భిమతా 3 శారదా 4 తోయపిప్పలీ 5 మత్స్యాదనీ 6 మత్స్యగంధా 7 లాంగలీ 8 శకులాదనీ యీ 8 న్ను నీరుపిప్పలి పేళ్ళు.

### నీరుపిప్పలి గుణము.

శ్లో॥ జలపిప్పలికా తిక్తా త్వ్యాక్షివాతకఫాపహా।
విషవేగాతిశమనీ శ్రుతిశుద్ధికరీ పరం ॥

తా॥ నీరుపిప్పలి చేదుగనుండు. మరియు నిది నేత్రవాయువు కఫము విషము బధిరత్వము వీటిని నివర్తింపంజేయు.

### పుస్తకాంతరే.

శ్లో॥ జలపిప్పల్యహృద్యాచక్షుష్యా శుక్రలా లఘుః।
సంగ్రాహిణీ హిమా రూక్షా రక్తదాహ వ్రణాపహా।
రసదోషం క్రిమీన్ దాహం వ్రణం శ్వాసం కఫం తథా।
వాతం విషం భ్రమం మూర్ఛాం తృష్ణాం పిత్తజ్వరం హరేత్ ॥

తా॥ నీరుపిప్పలి హృదయము నేత్రము వీటికి మేలుజేసును. శుక్రమును వృద్ధి జేయును లఘువుగనుండును. మలమును గట్టిపరచును. చల్లగనుండును. రూక్షజేసును. దుష్టరక్తమును విరుచును. మరియు నిది వ్రణములు రసదోషము నులిపురుగులు తాపము శ్వాసము కఫము వాతము విషము భ్రమ మూర్ఛ దప్పి పిత్తజ్వరము వీటిని హరింపం జేయు.

### నెల్లి.

శ్లో॥ రసోనో లశునోరిష్టో మత్స్యగంధో మహౌషధః ॥

టీక. 1 రసోన 2 లశున 3 అరిష్ట 4 మత్స్యగంధ 5 మహౌషధ యీ 5 న్ను వెల్లుల్లి పేళ్ళు.

## పెద్దవెల్లుల్లి.

శ్లో॥ మహాకందో రసోనో౽న్యో గృంజనో దీర్ఘపత్రకః ॥

టీక॥ 1 మహాకంద 2 గృంజన 3 దీర్ఘపత్రక యీ 3 న్ను పెద్దవెల్లుల్లి పేర్లు.

## వెల్లుల్లి గుణము.

శ్లో॥ లశునం కటుతీక్ష్ణోష్ణం కఫగుల్మార్శకుష్ఠజిత్ ।
సమీరక్షయకృత్క్రిమిజన్మేహాధ్మానాగ్నిమాంద్యజిత్ ।
గ్రహణీశోఫశమనం జ్వరోన్మాదవినాశనం ॥

తా॥ వెల్లుల్లి కారముగను చేదుగను ఉష్ణముగనునుండు. మరియు నిది కఫము గుల్మము అర్శస్సు కుష్ఠము వాతము క్షయరోగము క్రిమిరోగము మేహము కడుపుబ్బరము అగ్నిమాంద్యము గ్రహణి వాపు జ్వరము ఉన్మాదము వీటిని నశింపంజేయును.

## నీరుల్లి.

శ్లో॥ పలాండుర్యవనేష్టశ్చ సుకందో ముఖదూషణః ॥

టీక॥ 1 పలాండు 2 అవనేష్ట 3 సుకంద 4 ముఖదూషణ యీ 4 న్ను నీరుల్లి పేళ్లు.

## పచ్చనీరుల్లి.

శ్లో॥ హరితో౽న్యః పలాండుస్స్యాద్విరోగః ప్యాజముస్స్మృతః ॥

టీక॥ 1 విరోగ 2 ప్యాజము యీ 2 న్ను పచ్చనీరుల్లి పేళ్ళు.

## నీరుల్లి గుణము.

శ్లో॥ పలాండుస్తద్గుణో జ్ఞేయః స్వల్పశ్చ కఫకృన్నాతిపిత్తలః ।
అనుష్ణం కేవలం వాతనాశనం రుచ్యం పాకరసాజ్జయేత్ ॥

తా॥ నీరుల్లి వెల్లుల్లియొక్క గుణము కలదైయుండును. కఫమునుజేయును. కొంచెము పిత్తమునుజేయును. ఉష్ణము చేయదు. కేవల వాతమును పోగొట్టును. పాకము వలన రుచిగనుండును.

## అరటి.

శ్లో॥ కదళీసుకుమారాచరంభాభానుఫలామతా ।
కాశ్మీరఃసచనిస్సారోవిచామా హస్తివిషాణికా ।
ఏకాష్ఠీలావారణాంబువృత్తపుష్పీమహాఫలా ॥

టీక॥ 1 కదళి 2 సుకుమారా 3 రంభా 4 భానుఫలా 5 కాశ్మీర 6 నిస్సార మోచా 8 హస్తివిషాణికా 9 ఏకాష్ఠీలా 10 వారణాంబు 11 వృత్తపుష్పీ 12 మహాఫలా యీ 12 న్ను అరటిపేళ్ళు.

## అరటి గుణము.

శ్లో॥ కదళీయోనిదోషాశ్మరక్తపిత్తహరాహిమా । తత్కందశ్శీతలో
బల్యఃకేశ్యఃపిత్తకఫాస్రజిత్ । తత్ఫలంమధురంశీతంవిష్టంభీక
ఫకృద్గురు । స్నిగ్ధంపిత్తాస్రతృట్దాహక్షతక్షయసమీరజిత్ ॥
కోమలంకదళంశీతం మధురంచకషాయకం । రుచ్యమమ్లం
సముద్దిష్టంపిత్తనాశకరంచతత్ । కషాయతిక్తంసంగ్రాహిదీప
సంగూక్షశీతళం । మేహపిత్తాతిసారార్శః పిత్తాసృక్ప్లీహ్వరా
పహం।కఘఘ్నంవాతలంపథ్యంకదళ్యాస్తరుణంఫలం । పుష్పం
కదళ్యాస్సుస్నిగ్ధంమధురంతువరంగురు । గ్రాహితిక్తంచాగ్ని
దీప్తికరంవాతవినాశనం । కించిదుష్ణంచవీర్యస్యరక్తపిత్తంక్ష
యంహరేత్ ॥ కదళీగర్భకాండంతుసకషాయంహిమంగురు ।
తృష్ణదాహాస్రపిత్తఘ్నంశ్లేష్మలంవహ్నిసాదనం ॥

తా॥ అరటి యోనిదోషము అశ్మరీరోగము రక్తపిత్తము వీటిని నశింపంజేయు. శీతలముగనుండు. అరటిగడ్డ చలువజేసును బలమునిచ్చును. వెంట్రుకలకు హితముగ నుండును. మరియు పిత్తము కఫము కుసుమరోగము వీనిని బోగొట్టును. అరటిపండు మధురముగను శీతలముగను మలబద్ధకారిగను జిగటగనునుండు. కఫము గురుత్వము వీటినికేసును. మరియు నిది పిత్తరక్తము దప్పి తాపము గాయము క్షయము వాతము వీటిని నివర్తింపంజేయు. లేత అరటికాయ శీతలముగను మధురముగను వగరుగను రుచిగను పుల్లగనునుండు. పిత్తమునుబోగొట్టును ముదిరిన అరటికాయ వగరుగను చేదుగను మలబద్ధకారిగను రూక్షముగను శీతలముగను పథ్యకారిగనునుండు. మరియు నిది

మేహము పిత్తాతిసారము అర్శస్సు పిత్తరక్తము దప్పి జ్వరము కఫము వీటిని నివర్తింపంజేయుటయేగాక అగ్నిదీపనము వాతము వీట్లను సగా గల్గంజేయు. అరటి పూలు జిగటగను మధురముగను వగరుగను గురువుగను మలబద్ధకారిగను చేదుగను నుండు. అగ్నిదీపనమునుజేసును. వాతమును బోగొట్టును. వీర్యమునకు నొకింత వేడిమి బుట్టించును. మరియు రక్తపిత్తము క్షయము వీటిని హరించును. అరటిబొండె వగరుగను శీతలముగను గురువుగనునుండు. దప్పి తాపము పిత్తము వీటిని బోగొట్టును. కఫము అగ్నిమాంద్యము వీటినిజేయును.

## అడవి అరటి.

శ్లో॥ కాష్ఠకదలీసుకాష్ఠావనకదళీకాష్ఠిలాధరారంభా ।
దారుకదళీఫలాఢ్యావనమోచాశుక్రవర్ధనీచ॥

తా॥ 1 కాష్ఠకదళీ 2 సుకాష్ఠా 3 వనకదళీ 4 కాష్ఠిలా 5 ధరారంభా 6 దారుకదళీ 7 ఫలాఢ్యా 8 వనమోచా 9 శుక్రవర్ధనీ యీ 9 న్ని అడవిఅరటిపేళ్ళు.

## అడవిఅరటి గుణము.

శ్లో॥ స్యాత్కాష్ఠకదళీరుచ్యారక్తపిత్తహరాహిమా ।
గురుర్మందాగ్నికరణీమధురాదుర్జరాచసా ॥

తా॥ అడవిఅరటి రుచిగను శీతలముగను గురువుగను మధురముగనునుండు. రక్తపిత్తమునుబోగొట్టు. అగ్నిమాంద్యమునుజేయు. జీర్ణము కాకుండును.

## కొండఅరటి.

శ్లో॥ శ్రీకదళీగురురంభాపర్వతమోచాచపుణ్యకదళీచ ।
బహుప్రజావనరంభాగిరిజాగజవల్లభావహితా ॥

టీక॥ 4 శ్రీకదళీ 2 గురురంభా 3 పర్వతమోచా 4 పుణ్యకదళీ 5 బహుప్రజా 6 వనరంభా 7 గిరిజా 8 గజవల్లభా యీ 8 న్ని కొండఅరటిపేళ్ళు.

## కొండఅరటి గుణము.

శ్లో॥ గిరికదళీమధురహిమాబలవీర్యవృద్ధిదాయనిరుచ్యా ।
తృట్పిత్తదాహశోషప్రశమనకర్త్రీచదుర్జరాగురుః ॥

తా॥ కొండఅరటి మధురముగను రుచిగను గురువుగనునుండు. శైత్యమునుజేసును. బలమును శుక్రమును వృద్ధిజేయును. మరియు దప్పి పిత్తము తాపము శోష వీటిని శమింపంజేయు జీర్ణముకాకుండును.

తా॥ అరటినీల్లు శీతలముగను మలబద్ధకారిగను చేదుగనునుండు. మరియు నిది దప్పి తాపము మూత్రకృచ్ఛ్రము అతిసారము మేహరోగములు గ్రాహకములు రక్తపిత్తము అస్థిసారమును సోమరోగమును వీటిని నశింపఁజేయును.

వావిలి.

శ్లో॥ సింధువారః శ్వేతపుష్పః సింధుకః సింధువారకః ।
శుక్లస్స్యాచ్ఛ్వేతసురసా సిద్ధకశ్చాతిసిద్ధకః ।
శ్వేతమంజరికా సింధుః స్యాదేవ శ్వేతసింధుకః ॥

టీక॥ 1 సింధువార 2 శ్వేతపుష్ప 3 సింధుక 4 సింధువారక 5 శుక్ల 6 శ్వేతసురసా 7 సిద్ధక 8 అతిసిద్ధక 9 శ్వేతమంజరికా 10 సింధు 11 శ్వేతసింధుక యీ 11 న్ను వావిలిపేళ్ళు.

నల్లవావిలి.

శ్లో॥ నీలపుష్పీ శీతసహా నిర్గుండీ నీలసింధుకః ।
సుగంధికా విషేంద్రాణీ భూతకేశీ జనచ్ఛదా ।
కృష్ణసంజ్ఞా విషఘ్నీ స్యాత్పవిత్రో గిరిసింధుకః ।
శేఫాలికా శితాభీరుర్వనజా నీలమంజరీ ॥

టీక॥ 1 నీలపుష్పీ 2 శీతసహా 3 నిర్గుండీ 4 నీలసింధుక 5 సుగంధికా 6 విష 7 ఇంద్రాణీ 8 భూతకేశీ 9 కృష్ణసంజ్ఞ 10 విషఘ్ని 11 పవిత్ర 12 గిరిసింధుక 13 శేఫాలికా 14 శితాభీరు 15 వనజా 16 నీలమంజరి యీ 16 న్ను నల్లవావిలిపేళ్ళు.

వావిలి గుణము.

శ్లో॥ నిర్గుండీ కటుకా తిక్తా స్వాద్వుష్ణా కఫవాతహా ।
పిత్తశ్లేష్మక్రిమీకుష్ఠప్లీహగుల్మారుచిం జయేత్ ।
సన్నిపాతజ్వరోన్మాదప్రతిశ్యాయవినాశనః ॥

తా॥ నల్లవావిలి కారముగను చేదుగను ఉష్ణముగనునుండు. మరియు నిది క్రిమిరోగము కుష్ఠువు కఫము పిత్తము శ్లేష్మము ప్లీహము గుల్మరోగము అరుచి సన్నిపాతము జ్వరము పిచ్చి పీనస వీటిని నశింపఁజేయును.

తెల్లదింటెన.

శ్లో॥ అశ్వఖురః శ్వేతపుష్పీ శ్వేతా చ గిరికర్ణికా । కటభా శ్వేతనామా చ శ్వేతస్యందః పరాజితా । విషఘ్నీ జనికా చండా గర్దభా

నిధిపుష్పికా । గవాక్షుచాక్షుపాశూర్పీచంద్రపాదీతథైవచ ।
శివమల్లీపాశుపతాహ్యేకాష్ఠీలాంబుకోవసుః ॥

టీక॥ 1 అశ్వఖుర 2 శ్వేతపుష్పీ 3 శ్వేతా 4 గిరికర్ణికా 5 కటుభా 6 శ్వేతనామా 7 శ్వేతస్యంద 8 పరాజితా 9 విషఘ్నా 10 జనికా 11 చండా 12 గర్దభా 13 నిధిపుష్పికా 14 గవాక్షుచాక్షుపా 15 శూర్పీ 16 చంద్రపాదీ 17 శివమల్లీ 18 పాశుపతా 19 ఏకాష్ఠీలా 20 అంబుకా 21 వసు యీ 21 న్ని తెల్లదింటెన పేళ్లు.

## తెల్లదింటెన గుణము.

శ్లో॥ శ్వేతాతిక్తకషాయాచజ్వరపిత్తకఫాపహా ।
విషకుష్ఠామశోఫఘ్నీశిరశ్శూలాక్షిరోగజిత్ ॥

తా॥ తెల్లదింటెన చేదుగను వగరుగనునుండు. మరియు నిది పిత్తము కఫము విషము కుష్ఠువు ఆమవాతము శోఫ తలనొప్పి నేత్రరోగము వీటిని నివర్తింపంజేయు.

## నల్లదింటెన.

శ్లో॥ నీలపుష్పీమహానీలీగిరికర్ణీగవాదనీ ।
వల్లిజాత్యక్తగంధాచనీలపుష్పీప్రకీర్తితా ।
నీలాచకుసుమాచైనవిషఘ్నీశ్యామపుష్పికా ॥

టీక॥ 1 నీలపుష్పీ 2 మహానీలీ 3 గిరికర్ణీ 4 గవాదనీ 5 వల్లిజా 6 త్యక్తగంధా 7 నీలపుష్పి 8 నీలా 9 కుసుమా 10 విషఘ్నీ 11 శ్యామపుష్పికా యీ 11 న్ను నల్లదింటెనపేళ్ళు.

## నల్లదింటెన గుణము.

శ్లో॥ నీలపుష్పీకషాయాచకపిత్తసమీరజిత్ ।
కుష్ఠగుల్మాష్టశూలఘ్నీనయనారుణతేజనీ ॥

తా॥ నల్లదింటెన వగరుగనుండు. మరియు నిది కఫము పిత్తము వాతము కుష్ఠువు గుల్మరోగము అష్టశూలలు కంటియెరుపు వీటిని నివర్తింపంజేయు.

## లక్క.

శ్లో॥ జననీచైవసంవర్తాజతుకాచక్రవర్తినీ ।
జతుకారాజతుఃకృష్ణాలోహితాన్యారుణోద్భవా ॥

టీక॥ 1 జననీ 2 సంవర్తా 3 జతుకా 4 చక్రవర్తినీ 5 జతుకారా 6 జతు 7 కృష్ణా యీ 7 న్ను నల్లలక్క పేళ్ళు. 1 లోహితా 2 అరుణోద్భవా యీ 2 న్ను ఎఱ్ఱలక్క పేళ్ళు.

లక్క గుణము.

శ్లో॥ జతుకాశిశిరాతిక్తార క్తదోషనిబర్హణి ।
పిత్తప్రశమనీహిక్కా విషవేగంప్రమోగతః ॥

తా॥ లక్క శీతలముగను చేదుగనునుండు. మరియు నిది రక్తదోషము పిత్తము ఎక్కిళ్ళు విషము వీటిని నివర్తింపంజేయు.

మెట్టదామర.

శ్లో॥ పద్మచారిణ్యతిచరాపద్మాపద్మవతీతిచ ।
చారటీగంధమూలాచలక్ష్మీశ్శ్రేష్ఠాసుపుష్కలా ॥

టీక॥ 1 పద్మచారిణీ 2 అతిచరా 3 పద్మా 4 పద్మవతీ 5 చారటీ 6 గంధమూలా 7 లక్ష్మీః 8 శ్రేష్ఠా 9 సుపుష్కలా యీ 9 న్ను మెట్టదామర పేళ్ళు.

మెట్టదామర గుణము.

శ్లో॥ పద్మాశీతాలఘుస్తిక్తాస్వాద్వీమశ్చ ప్రకీర్తితా ।
రక్తకాసారుచింహంతిపిత్తదాహప్రశాంతికృత్ ॥

తా॥ మెట్టదామర శీతలముగను చులకనగను చేదుగను రుచికరముగనునుండు. మరియు నిది రక్తదోషము కాసము అరుచి పిత్తము దాహము వీటిని నివర్తింపంజేయు.

నేలతాడి.

శ్లో॥ గృష్టిశ్చవిష్వక్సేనాచవారాహీసూకరోవరః ।
మాధవఃసౌకరీకాశీకాంతాచవనమాలినీ ।
మునలీఖలినీతాలపత్రీకాంచనపుష్పికా ।
మహావృక్షోవృషకందఃఖర్జూరీతాలమూలికా ॥

టీక॥ 1 గృష్టి 2 విష్వక్సేనా 3 వారాహీ 4 సూకర 5 వర 6 మాధవ 7 సౌకరీ 8 కాశీ 9 కాంతా 10 వనమాలినీ 11 మునలీ 12 ఖలినీ 13 తాలపత్రీ 14 కాంచనపుష్పికా 15 మహావృక్ష 16 వృషకంద 17 ఖర్జూరీ 18 తాలమూలికా యీ 18 న్ను నేలతాడి పేళ్ళు.

## నేలతాడి గుణము.

శ్లో॥ వారాహీకఫహృచ్ఛోష్ణాచకండూమేహాతిరక్తజిత్ ।
క్షయకుష్ఠక్రిమిహరావృష్యాబల్యారసాయనీ ॥

తా॥ నేలతాడి ఉష్ణముగనుండు. ఇది కఫము దురద మేహము రక్తదోషము క్షయరోగము కుష్ఠు క్రిమిరోగము వీటిని నివర్తింపంజేయుటయేగాక ధాతుపుష్టి బలము శరీరపుష్టి వీటిని సగా గలుగంజేయు.

## మాంసరోహిణి.

శ్లో॥ మాంసరోహిణ్యతిరుహావృత్తాచర్మకరీస్మృతా ।
వికసామాంసరోహాచరోహాతిక్తాప్రకీర్తితా ॥

టీక॥ 1 మాంసరోహిణీ 2 అతిరుహా 3 వృత్తా 4 చర్మకరీ 5 వికసా 6 మాంసరోహా 7 రోహా 8 తిక్తా యీ 8 న్ను మాంసరోహిణి పేళ్ళు.

## మాంసరోహిణి గుణము.

శ్లో॥ మాంసీకషాయకటుకారక్తపిత్తకఫాపహా ।
అసృగ్దరాతిశూలఘ్నీశమనీశోణితార్శసాః ॥

తా॥ మాంసరోహిణి వగరుగను కారముగనునుండు. మరియు నిది రక్తపైత్యము కఫము అసృగ్దరము శూల రక్తదోషము వీటిని నివర్తింపంజేయు.

## బదనికె.

శ్లో॥ వందాకస్యాద్వృక్షరుహాశేఖరీకామరూపిణీ ।
వృక్షాదనీతరురుహాకామజ్యాపదరోహిణీ ।
పాదపావృక్షభక్షాచనీలపర్ణీచరోహిణీ ॥

టీక॥ 1 వందాక 2 వృక్షరుహా 3 శేఖరీ 4 కామరూపిణీ 5 వృక్షాదనీ 6 తరురుహా 7 కామజ్యా 8 పదరోహిణీ 9 పాదపా 10 వృక్షభక్షా 11 నీలపర్ణీ 12 రోహిణీ యీ 12 న్ను బదనికె పేళ్ళు.

## బదనికె గుణము.

శ్లో॥ వందాకఃకఫవాతాస్రరూక్షువ్రణవిషాపహః ।
వృష్యోమంగళ్యోవశ్యాకరః హృద్రికాయుసిద్ధకరఃపరః ॥

తా॥ బదనికె కఫము వాతము రక్తదోషము తీక్ష్ణవ్రణము విషము ఘాతవ్రణము వీటిని నివర్తింపఁజేయుటయేగాక కాయసిద్ధిని గలుగఁజేయు.

ప్రొద్దుదిరుగుడుచెట్టు.

శ్లో॥ సువర్చ్చలాదిత్యకాంతాసూర్యభక్తాసుఖోద్భవా ॥

టీక॥ 1 సువర్చ్చలా 2 ఆదిత్యకాంతా 3 సూర్యభక్తా 4 సుఖోద్భవా యీ 4 న్ను ప్రొద్దుదిరుగుచెట్టుపేళ్ళు.

ప్రొద్దుదిరుగుడుచెట్టు గుణము.

శ్లో॥ ఆదిత్యభక్తాకటుకాతితీక్ష్ణోష్ణావిస్ఫోటకాపహా ।
శ్వాసకాసహరాక్షేయారసాయనవరాచసా ॥

తా॥ ప్రొద్దుదిరుగుచెట్టు కారముగను ఉష్ణముగను బలకరముగనునుండు. మరియు నిది బొబ్బలు శ్వాస కాస వీటిని బోగొట్టును.

మండూకబ్రహ్మి.

శ్లో॥ మండూకపర్ణీమండూకీవరదాదిత్యవల్ల్యపి।సుహామాతస్యనా
మాచవిక్రాంతిస్సైవకీర్తితా। బ్రహ్మసోమావినిర్దిష్టాదివ్యతేజా
మహౌషధిః । కపోతవంకాత్వష్టాచసైవబ్రహ్మసువర్చ్చలా।
మేదస్సంపాదనీమేధ్యాస్మారిణీధారిణీతథా । సరస్వతీరోహిణీ
కాహారిణీభారతీహరీ ॥

టీక॥ 1 మండూకపర్ణీ 2 మండూకి 3 వరదా 4 ఆదిత్యవల్లీ 5 సుహామా 6 సత్యనామా 7 విక్రాంతా 8 బ్రహ్మసోమా 9 దివ్యతేజా 10 మహౌషధిః 11 కపోతవంకా 12 త్వష్టా 13 బ్రహ్మసువర్చ్చలా 14 మేదస్సంపాదని 15 మేధ్యా 10 స్మారిణీ 17 ధారిణీ 18 సరస్వతీ 19 రోహిణికా 20 హారిణీ 21 భారతీ 22 హరీ యీ 22 న్ను మండూకబ్రహ్మిపేళ్ళు.

మండూకబ్రహ్మి గుణము.

శ్లో॥ బ్రహ్మసోమాచతిక్తోష్ణాశోఫపాండుజ్వరాపహా ।
దీపనీకుష్ఠకండూఘ్నీప్లీహావాతబలాసనుత్ ॥

తా॥ మండూకబ్రహ్మి కారముగను ఉష్ణముగనునుండు. మరియు నిది వాపు పాండువు జ్వరము కుష్టువు దురద ప్లీహరోగము వాతము బలాసరోగము వీటిని నివర్తింపంజేయుటయేగాక అగ్నిదీపనమును సగా గలుగంజేయు.

సర్పాక్షి.

శ్లో॥ నాకులీసర్పగంధాచసుగంధాభోగిగంధికా ।
సైవసర్పసుగంధేతిసువహాగంధనాకులీ ।
నాగాక్షీచైవఛత్రాకీసురసాచసుపత్రికః ॥

టీక॥ 1 నాకులి 2 సర్పగంధా 3 సుగంధా 4 భోగిగంధికా 5 సర్పసుగంధ 6 సువహా 7 గంధనాకులీ 8 నాగాక్షి 9 ఛత్రాకి 10 సురసా 11 సుపత్రక యీ 11 న్ను సర్పాక్షి పేళ్ళు.

సర్పాక్షి గుణము.

శ్లో॥ నాకులీకటుమూత్రోష్ణా తిక్తాచాపిప్రకీర్తితా।
మూషకస్యవిషంహంతిక్రిమిదోషవినాశినీ ॥

తా॥ సర్పాక్షి కారముగను రూక్షముగను వేడిగనునుండు. మరియు నిది పందికొక్కువిషము క్రిమిదోషము వీటిని నివర్తింపంజేయు.

పెద్దసర్పాక్షి.

శ్లో॥ అన్యామహాసుగంధాచసువహాగంధనాకులీ ।
సర్పాక్షీనకులేష్టాచసారకీవిషమర్దనీ ॥

టీక॥ 1 మహాసుగంధా 2 సువహా 4 గంధనాకులి 4 సర్పాక్షి 5 నకులేష్టా 6 సారకీ 7 విషమర్దనీ యీ 7 న్ను పెద్దసర్పాక్షి పేళ్ళు.

పెద్దసర్పాక్షి గుణము.

శ్లో॥ సర్పాక్షీకటుతిక్తోష్ణాక్రిమిహృద్రోగకుష్ఠజిత్ ।
వృశ్చికోందురుసర్పాదివిషఘ్నీవ్రణనాశినీ ॥

తా॥ పెద్దసర్పాక్షి కారముగను చేదుగను ఉష్ణముగనునుండు. మరియు నిది క్రిమిరోగము హృద్రోగము కుష్టువు తేలువిషము ఎలుకవిషము సర్పాదులవిషము వ్రణము వీటిని నశింపంజేయు.

## వృద్ధదారు.

శ్లో॥ వృద్ధదారుః కాలవేగీ జృంభకో జీర్ణవాలుకః ।
అంభః కోటరపుష్పీ స్యాదజాండీ చాగ్నిఖాండ్యపి॥

టీక॥ 1 వృద్ధదారు 2 కాలవేగీ 3 జృంభక 4 అజీర్ణవాలుక 5 అంభ 6 కోటరపుష్పీ 7 అజాండీ 8 అగ్నిఖాండి యీ 8 న్ని వృద్ధదారు పేళ్ళు.

## వృద్ధదారు గుణము.

శ్లో॥ వృద్ధదారుః కటుస్తిక్తః స్తథోష్ణః కఫవాతజిత్ ।
స్వయథుం క్రిమిమేహాంశ్చహంతి శోఫోదరం తథా ॥

తా॥ వృద్ధదారు కారముగను చేదుగను ఉష్ణముగనునుండు. మరియు నిది కఫము వాతము వాపు క్రిమిరోగము ప్రమేహము శోఫ మహోదరము వీటిని నివర్తింపంజేయు.

## ముణుగుదామర.

శ్లో॥ రక్తపాదీ శమీపత్ర సమంగాంజలికారికా।
నమస్కారీ గంధకారీ శరాళీ ఖదిరేత్యపి ।
నక్తమాలా శిలపత్రా కాళికా సూక్ష్మమాలికా ॥

టీక॥ 1 రక్తపాదీ 2 శమీపత్ర 3 సమంగా 4 అంజలికారికా 5 నమస్కారీ 6 గంధకారీ 7 శరాళీ 8 ఖదిర 9 నక్తమాలా 10 శిలపత్రా 11 కాళికా 12 సూక్ష్మ మాలికా యీ 12 న్ని ముణుగుదామర పేళ్ళు.

## ముణుగుదామర గుణము.

శ్లో॥ రక్తపాదీ కటుస్తిక్తా రక్తపిత్తాతిసారజిత్ ।
అపస్మారహరాక్షేపా భూతసంతాపనాశినీ ॥

తా॥ ముణుగుదామర కారముగను చేదుగనునుండు. మరియు నిది రక్తపైత్యము అతిసారము మూర్ఛ ఆక్షేపరోగము (అనగా వున్నట్టుండు ములికిపడుట) భూతబాధ వీటిని నివర్తింపంజేయు.

## హంసపాది.

శ్లో॥ రక్తపాదీ విశ్వగంధీ విష్వగ్గంధీ త్రిపాద్యపి ।
హంసపాదీ హంసపదా ఘృతమండలకస్తునః ।

సంచారిణీవిపాదీచపాదాంగీశ్వేతపాదికా ।
ప్రహ్లాదినీమధుస్రావీకటుమారీచకీర్తితా ॥

టీక॥ రక్తపాదీ 2 విశ్వగంధీ 3 విష్వగ్రంథీ 4 త్రిపాదీ 5 హంసపాదీ 6 హంసపదా 7 ఘృతమండలక 8 సంచారిణీ 9 విపాదీ 10 పాదాంగీ 11 శ్వేతపాదికా 12 ప్రహ్లాదినీ 13 మధుస్రావీ 14 కటుమారీ యీ 14 న్ను హంసపాదిపేర్లు.

హంసపాది గుణము.

శ్లో॥ హంసపాదీగురుశ్శీతాభూతాపస్మారనాశినీ ।
విషజిత్ వ్రణహారీచశూలశ్వాసవినాశినీ ॥

తా॥ హంసపాదీ గురుత్వముగను శీతలముగనునుండు. మరియును నిది పిశాచబాధ మూర్ఛరోగము విషము వ్రణము శూల శ్వాసము వీటిని నివర్తింపంజేయును.

శంఖపుష్పి.

శ్లో॥ శంఖపుష్పీకంబుపుష్పీశంఖాహ్వాశంఖమాలినీ ।
చిరంటీశంఖకుసుమామేధ్యావనవిలాసినీ ॥

టీక॥ 1 శంఖపుష్పీ 2 కంబుపుష్పీ 3 శంఖాహ్వా 4 శంఖమాలినీ 5 చిరంటీ 6 శంఖకుసుమా 7 మేధ్యా 8 వనవిలాసినీ యీ 8 న్ని శంఖపుష్పిపేర్లు.

శంఖపుష్పి గుణము.

శ్లో॥ శంఖనీకటుతిక్తోష్ణాకఫపిత్తబలాసనుత్ ।
విషాపస్మారభూతఘ్నీజరామృత్యూరసాయనీ ॥

తా॥ శంఖపుష్పీ కారముగను చేదుగను ఉష్ణముగనునుండు. మరియును నిది కఫము పిత్తము బలాసరోగము విషము మూర్ఛ భూతబాధ ముదిమి వీటిని నివర్తింపం జేయుటయేగాక పుష్టికరముగనుండు.

చిర్రికూర.

శ్లో॥ తండులీయస్త్వకముద్దిష్టంతండులస్తండులేయకః ।
భండీరస్తండులీవిక్షో మేఘనాదోఘనస్వనః ॥

టీక॥ 1 తండులీయక 2 తండుల 3 తండులేయక 4 భండీర 5 తండులీ 6 విక్షు 7 మేఘనాధ 8 ఘనస్వన యీ 8 న్ని చిర్రికూరపేర్లు.

చిర్రికూర గుణము.

శ్లో॥ తండులియ్యంహిమంరూక్షంర క్తపిత్తాతిసారనుత్ ।
హంతికాసంత్రిదోషంచవిషంస్థావరజంగమం।
దీపనంసన్నిపాతఘ్నంజ్వరాతీసారనాశనం ॥

తా॥ చిర్రికూర శీతలముగను రూక్షముగనునుండు. మరియు నిది రక్తపిత్తము అతిసారము కాస త్రిదోషములు స్థావరవిషము అనగా పామువిషము మొదలైనవి జంగమవిషము అనగా పాషాణాదివిషము సన్నిపాతము జ్వరము అతిసారము వీటిని నివర్తింపంజేయుటయేగాక అగ్నిదీప్తిని సగా కలుగంజేయు.

కసివెంద.

శ్లో॥ కాసమర్దోరిమర్దశ్చకాసారిఃకర్కశః స్తథా ।
కాలాంతరకయిత్యుక్తఃకాసవర్ణస్సువర్ణకః ॥

టీక॥ 1 కాసమర్ద 2 అరిమర్ద 3 కాసారి 4 కర్కశ 5 కాలాంతక 6 కాస వర్ణ 7 సువర్ణక యీ 7 న్ను కసివింద పేళ్లు.

కసివెంద గుణము.

శ్లో॥ కాసమర్దస్సమాఖ్యాతో రూక్షశ్శిశిరపచ ।
కాసంనిర్వాశయత్యేషనాశయత్యఖిలంవిషం ।
పిష్ట్వాతుబస్తమూత్రేణయోజయేద్దగ్గకేజ్వరే ॥
నస్యధూపప్రదానేనసర్వభూతగ్రహాపహః ॥

తా॥ కసివింద రూక్షముగను శీతలముగనునుండు. మరియు నిది కాసము సమస్తవిషములు వీటిని నివర్తింపంజేయు. మరియు దీనిని మేకపోతుమూత్రముతో నూరి తీవ్రజ్వరమునందుపయోగించిన నది నివర్తించు. దీనిని నస్యముచేసి ధూపము వేసిన సమస్తభూతపిశాచ గ్రహములు నివర్తించు.

చెఱుకు.

శ్లో॥ ఇక్షుర్మహారసోవేణున్నిస్స్పృహో గుడపత్రికః ।
తృణరాజో మధుస్సృహోగండికో ఽస్పృతపుష్పకః ॥

టీక॥ 1 ఇక్షు 2 మహారస 3 వేణు 4 నిస్స్పృత 5 గుడపత్రిక 6 తృణరాజ 7 మధుస్పృహ 8 గండీక 9 అస్పృతపుష్పక యీ 9 న్ను చెఱుకు పేళ్లు.

చెఱుకు గుణము.

శ్లో॥ ఇక్షుస్స్యాన్మధురశ్శీతో వృష్యస్స్నిగ్ధో బలప్రదః ।
జీవనో వాతపిత్తఘ్నః కుర్యాన్మూత్రకఫక్రిమీన్ ।
సమూలే మధురోత్యర్థం మధ్యే మధురేవ చ ।
అగ్రగ్రంథిషు విజ్ఞేయో లవణో మూత్రలస్తథా॥

తా॥ చెఱుకు మధురముగను గురువుగను శీతలముగను వీర్యవృద్ధికరముగను జిగటగను బలకరముగను ప్రాణాధారముగనునుండు. మరియు నిది వాతము పిత్తము వీటిని పోగొట్టుటయేగాక మూత్రము కఫము క్రిమిరోగము వీటిని గలుగంజేయు. యడుగుభాగము అతితియ్యగను మధ్యభాగము కొంచెము తియ్యగను అగ్రభాగము అనగా ద్రవ్యగణుపులు ఇది ఉప్పగనునుండు. మరియు నిది మూత్రమును వృద్ధిజేయును.

అడవిచెఱుకు.

శ్లో॥ ఇక్షుః కర్కటకో వంశః కాంతారో వేణునిస్వనః ।
ఆరణ్యకో రసాళశ్చ సురంటస్సుకుమారకః ॥

టీక॥ 1 ఇక్షు 2 కర్కట 3 వంశ 4 కాంతార 5 వేణునిస్వన 6 అరణ్యక 7 రసాళ 8 సురంట 9 సుకుమారక యీ 9 న్ని అడవిచెఱుకు పేళ్లు.

అడవిచెఱుకు గుణము.

శ్లో॥ కాంతారో మధురో వృష్యో మేహఘ్నశ్శీతలస్తథా ।
శ్లేష్మఘ్న ఆమకారీ తిబలవాన్ క్షయనాశనః ॥

తా॥ అడవిచెఱుకు మధురముగను వీర్యవృద్ధికరముగను శీతలముగను ఆమమును వృద్ధిజేయునదిగను బలకరముగనునుండు. మరియు నిది మేహము శ్లేష్మము క్షయము వీటిని నశింపంజేయు.

తెల్లచెఱుకు.

శ్లో॥ పౌండ్రకస్స్యాద్రసాలస్తు పుండ్రేక్షుః కాండకాశితః ।
కాశస్స్యాత్కుశకాండస్తు ధవళస్సితఖండకః ॥

టీక॥ 1 పౌండ్రక 2 రసాల 3 పుండ్రేక్షు 4 కాండకాశిత 5 కాశ 6 కుశకాండ 7 ధవళ 8 సితఖండక యీ 8 న్ని తెల్లచెఱుకు పేళ్లు.

తెల్లచెఱుకు గుణము.

శ్లో॥ పౌండ్రకస్సురసశ్శీతఃపాణిపాదాక్షిదాహజిత్ ।
ప్రదరాసృగ్దరంహంతిభ్రిమపైత్యహారంపరం ॥

తా॥ తెల్లచెఱుకు మధురముగను శీతలముగనునుండు. మరియు నిది అరిచేతులు అరికాళ్ళు కండ్లు వీటియందలి మంట ప్రదరరోగము అసృగ్దరము భ్రిమము పైత్యము వీటిని నశింపంజేయు.

కాకిచెఱుకు.

శ్లో॥ శోకఃకాండేక్షురపరఃకాకేక్షుర్వాయసేక్షుకః ।
ఇక్ష్వారుర్ధ్వాంక్షకాకోళిఃక్షురకాండశ్చసూదనః॥

టీక॥ 1 శోక 2 కాండేక్షు 3 కాకేక్షు 4 వాయసేక్షుక 5 ఇక్ష్వారు 6 ధ్వాంక్షకాకోళి 7 క్షురకాండ 8 సూదన యీ 8 న్ని కాకిచెఱుకు పేళ్ళు.

కాకిచెఱుకు గుణము.

శ్లో॥ శోకస్స్వాదుహిమోరుచ్యస్త్రిదోషఘ్నస్తథానిలాపహః ।
కంఠ్యాతికారసక్షార్గ్నానాశోసీరసతాపజిత్ ॥

తా॥ కాకిచెఱుకు రుచికరముగను శీతలముగను చేదుగనునుండు. మరియు నిది శీతపైత్యము వాతము దగను కాసము రక్తదోషము అర్శస్సు బలహీనత తాపము వీటిని నివర్తింపంజేయు.

కుశదర్భ.

శ్లో॥ దర్భోబర్హిఃకుశస్తీక్ష్ణసూచ్యగ్రోయజ్ఞభూషణః ॥

టీక॥ 1 దర్భ 2 బర్హి 3 కుశ 4 తీక్ష్ణ 5 సూచ్యగ్ర 6 యజ్ఞభూషణ యీ 6 న్ను కుశదర్భ పేళ్ళు.

కుశదర్భ గుణము.

శ్లో॥ దర్భఃకృచ్ఛ్రశ్మకృట్తృష్ణాబస్తిరుక్ప్రదరాస్రజిత్ ॥

తా॥ కుశదర్భ మూత్రకృచ్ఛ్రము అశ్మరి దప్పి బస్తిరుజ ప్రదరరోగము కఫము రక్తరోగము వీటిని పోగొట్టును.

ముంజదర్భ.

శ్లో॥ ముంజఃస్యాద్బాణస్థూలదర్భోబాణాహ్వోబ్రహ్మమేఖలః ॥

టీక॥ 1 ముంజ 2 తుఁరా 3 స్థూలదర్భ 4 బాణాహ్వ 5 బ్రహ్మమేఖల యీ 5 న్ను ముంజదర్భపేళ్ళు.

ముంజదర్భ గుణము.

శ్లో॥ ముంజోనుష్ణోవిసర్పాస్రమూత్రవస్త్యక్షిరోగజిత్ ॥

తా॥ ముంజగడ్డి ఉష్ణమునుజేయకుండును. మరియు విసర్పము రక్తదోషము మూత్రవస్థి నేత్రరోగము వీనిని బోగొట్టును.

రెల్లు.

శ్లో॥ కాశస్సుకాండఃకామేక్షురిక్షుశ్వేతవాసరః ।
శరఇక్ష్వారికేతుశ్చసహైవేక్షురసస్మృతః ॥

టీక॥ 1 కాశ 2 సుకాండ 3 కామేక్షు 4 ఋషీక 5 శ్వేతవాసర 6 శర 7 ఇక్ష్వారి 8 కేతు 9 ఇక్షురస యీ 9 న్ని రెల్లుపేళ్ళు.

తిప్పరెల్లు.

శ్లో॥ అధేక్షుకుసుమోబాణస్స్యాత్కాండశరఇక్షుకః ॥

టీక॥ 1 ఇక్షుకుసుమ 2 బాణ 3 కాండశర 4 ఇక్షుక యీ 4 న్ను తిప్పరెల్లుపేళ్ళు.

రెల్లు గుణము.

శ్లో॥ కాశఃకృచ్ఛ్రాశ్మదాహాస్రపిత్తక్షయహరోహిమః ॥

తా॥ రెల్లు శీతలముగనుండు. మరియు నిది మూత్రకృచ్ఛ్రము అశ్మరీరోగము తాపము రక్తదోషము పిత్తము క్షయము వీటిని బోగొట్టును.

అవురుకసువు.

శ్లో॥ శ్యాద్వీరణాఖ్యంతృణ్యాంసదీవీరణవీరసు ।
లామజ్జకోరణతృణోస్సళదోదీర్ఘలాభవః ॥

టీక॥ 1 వీరణాఖ్య 2 తృణ్యా 3 నదీవీరణ 4 వీరసు 5 లామజ్జక 6 రణతృణ్యా 7 నళద 8 దీర్ఘలాభవ యీ 8 న్ని అవురుకసువుపేళ్ళు.

అవురుకసువు గుణము.

శ్లో॥ వీరణస్తుకఫంహంతితథావాతాతిదాహజిత్ ।
రక్తకాసారుచింహాన్తిత్యుక్తో వైద్యవిశారదైః ॥

తా॥ అవురుకసువు కఫము వాతము అతిదాహము రక్తదోషము కాసము అరుచి వీటిని నివర్తింపంజేయు.

వెదురు.

శ్లో॥ వంశోవేణుర్యవఫలఃకార్ముకఃతృణకేతుకః।
త్వక్సారఃశతపర్వాచమస్కరఃకీచకస్తథా॥

టీక॥ 1 వంశ 2 వేణు 3 యవఫల 4 కార్ముక 5 తృణకేతుక 6 త్వక్సార 7 శతపర్వా 8 మస్కర 9 కీచక యీ 9 న్ని వెదురుపేళ్ళు.

వెదురు గుణము.

శ్లో॥ వైణవఃకటుతిక్తోష్ణః శ్లేష్మజ్వరసమీరజిత్ ।
గర్భస్రవతిరక్తఘ్నో హృద్రోగవిషనాశనః ॥

తా॥ వెదురు కారముగను చేదుగను ఉష్ణముగనునుండు. మరియు నిది శ్లేష్మజ్వరము వాతము రక్తదోషము హృద్రోగము విషము వీటిని నశింపంజేయు. మరియు నిది గర్భస్రావమును గలుగంజేయు.

కిక్కసగడ్డి.

శ్లో॥ నళోనటోనడశ్శైవనసచపోటగళస్స్మృతః ।
వనజోవర్ణకోరంధ్రిశ్శూన్యోమేధ్యోవిభీషణః ।
సమూలజశ్చనీలోష్ఠో మృగుపుష్పకఏవచ ।
నారదశ్చజలాధారస్సుభిరశ్చవిటస్మృతః ॥

టీక॥ 1 నళ 2 నట 3 నడ 4 పోటగళ 5 వనజ 6 వర్ణక 7 రంధ్రి 8 శూన్య 9 మేధ్య 10 విభీషణ 11 సమూలజ 12 నీలోష్ఠ 13 మృగుపుష్పక 14 నారద 15 జలాధార 16 సుభిర 17 విట యీ 17 న్ను కిక్కసగడ్డిపేళ్ళు.

కిక్కసగడ్డి గుణము.

శ్లో॥ నళస్స్వాదుఃకటుఃపాకేవీర్యేచోష్ణఃప్రకీర్తితః ।
విషఘ్నాతఃకఫహరఃపిత్తరక్తానిలాపహః ॥

తా॥ కిక్కసగడ్డి రుచికరముగను కారముగను జీర్ణకారిగను ఉష్ణవీర్యము గలదిగనునుండు. మరియు నిది విషము కఫము పిత్తము రక్తదోషము వాతము వీటిని బోగొట్టును.

## నల్లగరికె.

శ్లో॥ నీలదూర్వాభార్గవీవికారుహాచశతపర్వికా ।
హరితాశాద్వలస్సస్యాచ్ఛతపర్వాంగవేధకః ॥

టీక॥ 1 నీలదూర్వా 2 భార్గవీవికా 3 రుహా 4 శతపర్వికా 5 హరితా 6 శాద్వల 7 శతపర్వా 8 అంగవేధక యీ 8 న్ని నల్లగరికె పేళ్ళు.

## తెల్లగరికె.

శ్లో॥ సహస్రవీర్యాగోలోమీశ్వేతదండాసితాలతా ।
విజ్వరామంగలీప్రోక్తా శ్వేతాచకటుతాంబ్రకః ॥

టీక॥ 1 సహస్రవీర్యా 2 గోలోమీ 3 శ్వేతదండా 4 సితాలతా 5 విజ్వరా 6 మంగలి 7 శ్వేతా యీ 7 న్ని తెల్లగరికె పేళ్ళు.

## తీగగరికె.

శ్లో॥ గంధదూర్వోరుగంధాచమత్స్యాక్షీశకులాదనీ ॥
వహ్నినాళీచసాప్రోక్తావారుణీశకులాక్షకః ॥

టీక॥ 1 గంధదూర్వా 2 ఉరుగంధా 3 మత్స్యాక్షీ 4 శకులాదనీ 5 వహ్నినాళీ 6 వారుణీ 7 శకులాక్షక యీ 7 న్ని తీగగరికె పేళ్ళు.

## గరికెల గుణము.

శ్లో॥ దూర్వాత్రయంభవేత్తిక్తంమధురంత్వక్కషంహిమం ।
దాహతృష్ణావిసర్పాస్రగ్దికండూకుష్ఠవినాశనః ॥

తా॥ నల్లగరికె తెల్లగరికె తీగగరికె ఇవి చేదుగనుండు. మరియు నివి రక్తపైత్యము కఫము తాపము దప్పి విసర్పి మొదలైనరోగములు దురద కుష్ఠువు వీటిని నశింపజేయు.

## తెల్లగలువ.

శ్లో॥ సౌగంధికంశ్వేతజలజంముఖ్యాశాంభోజముంబుజం ।
పంకజంచారవిందంచకల్హారంచకుశేశయం ।
శతపత్రీయుగాదశభాసంజ్ఞాకైరవంశీతవాంతకం ॥

టీక॥ 1 కుముద 2 శ్వేతజలజ 3 మంజుశాంభోజ 4 అంబుజ 5 పంకజ 6 అరవింద 7 కల్హార 8 కుశేశయ 9 శశిప్రియ 10 గార్ధభక 11 కైరవ 12 శితవృంతిక యీ 12 న్ను తెల్లగలువ పేళ్లు.

### తెల్లగలువ గుణము.

శ్లో॥ కుముదంశీతలంతిక్తంరక్తపిత్తప్రమేహజిత్ ।
కృచ్ఛ్రమూత్రాభిఘాతఘ్నంఉష్ణంనేత్రాతిశీతలం ॥

తా॥ తెల్లగలువ శీతలముగను చేదుగను ఉష్ణముగనునుండు. మరియు నిది రక్తపైత్యము ప్రమేహము మూత్రకృచ్ఛ్రము అభిఘాతజ్వరము నీటిని నివర్తింపఁజేయు. మరియు నిది నేత్రములకు మిక్కిలి చలువను గలుగఁజేయు.

### చెంగలువ.

శ్లో॥ సౌగంధికంనీలపద్మంభద్రంకువలయంకుశం ।
ఇందీవరంతామరసంకువలంకుట్మలంమతం ॥

టీక॥ 1 సౌగంధిక 2 నీలపద్మ 3 భద్ర 4 కువలయ 5 కుశ 6 ఇందీవర 7 తామరస 8 కువల 9 కుట్మల యీ 9 న్ని చెంగలువ పేళ్లు.

### చెంగలువ గుణము.

శ్లో॥ సౌగంధికంస్వాదుశీతంమేహహృత్సోమరోగజిత్ ।
గర్భవేగసహస్రోచ్ఛిష్టంపాణిపాదాంగదాహజిత్ ॥

తా॥ చెంగలువ రుచికరముగను శీతలముగను ఉష్ణముగనునుండు. మరియు నిది మేహము సోమరోగము గర్భవేసిన అరికాళ్లు అరిచేతులు వీటియందలి మంట వీటిని నివర్తింపఁజేయు.

### నల్లగలువ.

శ్లో॥ నీలమిందీవరంభద్రంహల్లకంరక్తసంధ్యకం ।
నీలోత్పలంచకల్హారంకృష్ణాక్షంనలినంవిదుః ॥

టీక॥ 1 నీల 2 ఇందీవర 3 భద్ర 4 హల్లక 5 రక్తసంధ్యక 6 నీలోత్పల 7 కల్హార 8 కృష్ణాక్ష 9 నలిన యీ 9 న్ని నల్లగలువ పేళ్లు.

### నల్లగలువ గుణము.

శ్లో॥ నీలోత్పలంచచక్షుష్యంరక్తలోచనకోపజిత్ ।
నేత్రరోగహరంస్నిగ్ధంఘ్రాణస్రావవినాశనం ॥

తా॥ నల్లగలువ నేత్రహితకారిగనుండు. ఇది కంటియెరుపు కాసము నేత్ర దోషము కుసుమరోగము (అనగా రజస్సు అధికముగా స్రవించుట) వీటిని నివర్తింపం జేయు. మరియు నిది ధాతుపుష్టిని గలుగంజేయు.

ఎఱ్ఱగలువ.

శ్లో॥ రాజీవంస్యాత్కోకనదంశతపత్రంసరోరుహం ।
హల్లీకంరక్తపుష్పంచశోణముత్పలరాజితం ॥

టీక॥ 1 రాజీవ 2 కోకనద 3 శతపత్ర 4 సరోరుహ 5 హల్లీక 6 రక్తపుష్ప 7 శోణ 8 ఉత్పలరాజిత యీ 8 న్ని ఎఱ్ఱగలువపేళ్ళు.

ఎఱ్ఱగలువ గుణము.

శ్లో॥ రాజీవంశీతళంతిక్తంరక్తమేహాతిసారజిత్ ।
శిరోభ్రమివికారఘ్నంరక్తపిత్తవినాశనం ॥

తా॥ ఎఱ్ఱగలువ శీతలముగను చేదుగనునుండు. మరియు నిది రక్తదోషము ప్రమేహము అతిసారము తలదిరుగుట రక్తపిత్తము వీటిని నశింపంజేయు.

తామర.

శ్లో॥ పద్మినీస్యాదుదకినీనళినీచకుముద్వతీ।
కమలంశతపత్రంచసారసంసరసీరుహం ।
పలాశినీపద్మవతీవనషండంమహాఫలం ॥

టీక॥ 1 పద్మినీ 2 ఉదకినీ 3 నళినీ 4 కుముద్వతీ 5 కమల 6 శతపత్ర 7 సారస 8 సరసీరుహ 9 పలాశినీ 10 పద్మవతీ 11 వనషండ 12 మహాఫల యీ 12 న్ను తామరపేళ్లు.

ఎఱ్ఱదామర.

శ్లో॥ రక్తపద్మంతథారాజీరాజీవంపద్మసీరుహం ।
అరవిందంకిసలయఃపుణ్డరీకంఘనోద్భవం ॥

టీక॥ 1 రక్తపద్మ 2 రాజీ 3 రాజీవ 4 పద్మసీరుహ 5 అరవింద 6 కిసలయ 7 పుండరీక 8 ఘనోద్భవ యీ 8 న్ని ఎఱ్ఱదామరపేళ్లు.

తామరపువ్వు.

శ్లో॥ కమలంశ్వేతమంభోజంసారసంసరసీరుహం । సహస్రపత్రంశ్రీగేహంశతపత్రంకుశేశయం । పంకేరుహంతామరసం రాజీవం

పుష్కరాహ్వయం । అబ్జమంభోరుహంపద్మం పుండరీకంచ
పంకజం। నలంసరోజంనళినంమరవిందంమహోత్పలం॥

టీక॥ 1 కమల 2 అంభోజ 3 సారస 4 సరసీరుహ 5 సహస్రపత్ర 6 శ్రీగేహ 7 శతపత్ర 8 కుశేశయ 9 పంకేరుహ 10 తామరస 11 రాజీవ 12 పుష్కరాహ్వయ యీ 12 న్ను తామరపువ్వుపేర్లు. 1 అబ్జ 2 అంభోరుహ 3 పద్మ 4 పుండరీక 5 పంకజ 6 నల 7 సరోజ 8 నళిన 9 అరవింద 10 మహోత్పల యీ 10 న్ను తెల్ల దామరపువ్వుపేర్లు.

## తామరపువ్వు గుణము.

శ్లో॥ కమలంశీతలంవర్ణ్యంమధురంరక్తపిత్తజిత్ ।
తృష్ణాదాహాస్రవిస్ఫోటవిషవీసర్పనాశనం ॥

తా॥ తామరపువ్వు శీతలముగను మధురముగనునుండు. మరియు నిది రక్తపిత్తము దప్పి తాపము రక్తదోషము విస్ఫోటము విషము విసర్పము వీటిని నివర్తింపం జేయుటయేగాక దేహమునకు కాంతిని గలుగంజేయు.

## తామరవిత్తులు.

శ్లో॥ పద్మబీజంతుపద్మాక్షంశాలూకంపద్మకర్కటః ।
అరవిందఫలంకౌంచంతాపసజ్ఞేచకలిందుకం ॥

టీక॥ 1 పద్మబీజ 2 పద్మాక్ష 3 శాలూక 4 పద్మకర్కట 5 అరవింధఫల 6 కౌంచ 7 తాపస 8 వికలిందుక యీ 8 న్ను తామరవిత్తులపేర్లు.

## తామరవిత్తుల గుణము.

శ్లో॥ పద్మబీజంహిమంస్వాదుగర్భసంస్థాపనంగురు।
కఫవాతహరంబల్యంగ్రాహిపిత్తాస్రదాహజిత్ ॥

తా॥ తామరవిత్తులు శీతలముగను రుచిగను గురువుగను బలకారిగను మలమును గట్టిపరచునదిగనునుండు. మరియు నిది కఫము వాతము పిత్తరక్తము తాపము వీటిని నశింపంజేయు. మరియు గర్భమును స్థిరపరచును.

## తామరతూండ్లు.

శ్లో॥ బిసంమృణాళంబిసినీనాళంచనళినీరుహం।
మృణాళినీపద్మనాళంవజ్రకందానళీరుహం ॥

టీక॥ 1 బిస 2 మృణాళ 3 బిసినీ 4 నాళ 5 నళినీరుహ 6 మృణాళినీ 7 పద్మనాళ 8 వజ్రకందా 9 నళీరుహ యీ 9 న్ను తామరతూండ్లపేర్లు.

తామరతూండ్ల గుణము.

శ్లో॥ మృణాళంశీతలంవృష్యంపిత్తదాహాస్రజిద్గురు ।
సంగ్రాహిమధురంరూక్షంనారీణాంపుష్పసంభవం ॥

తా॥ తామరతూండ్లు శీతలముగను వీర్యవృద్ధికరముగను గురువుగను మలబద్ధకారిగను మధురముగను రూక్షముగనునుండు. మరియు నిది పిత్తము తాపము రక్తదోషము వీటిని నశింపంజేయు. మరియు నీనిని రజస్వలకాని స్త్రీలకు ప్రయోగించిన రజస్వలగుదురు.

తామరదుంప.

శ్లో॥ పద్మమూలంతుశాలూకంతథా నకరహాటకం ।
శాలీనంపద్మకందశ్చజలాళూకంసరాళకం ॥

టీక॥ 1 పద్మమూల 2 శాలూక 3 కరహాటక 4 శాలీన 5 పద్మకంద 6 జలాళూక 7 సరాళక యీ 7 న్ను తామరదుంపపేర్లు.

తామరదుంప గుణము.

శ్లో॥ పద్మకందఃకటుశ్శీతఃప్రదరాస్రవిదాహహా ।
కృచ్ఛ్రవిబంధమూత్రరుధిరంసిహన్యాద్గర్భశీతళం ॥

తా॥ తామరదుంప కారముగను శీతలముగనునుండు. మరియు నిది ప్రదరరోగము అసృగ్దరరోగము మూత్రకృచ్ఛ్రము మలబంధము బహుమూత్రము రక్తదోషము గర్భశీతలము వీటిని నశింపంజేయు.

పద్మకేసరములు.

శ్లో॥ పద్మకేసరమాఖ్యాతం కింజల్కః కేసరః స్మృతః ।
మకరందస్తథాకందో గారవంకాంచనంతథా ॥

టీక॥ 1 పద్మకేసర 2 మాలూక 3 కింజల్క 4 కేసర 5 మకరంద 6 కందగారవ 7 కాంచన యీ 7 న్ను పద్మకేసరములపేర్లు.

పద్మకేసరముల గుణము.

శ్లో॥ కింజల్కశ్శీతలోగ్రాహీరక్తార్శఃకఫపిత్తజిత్ ।

తా॥ పద్మకేసరములు శీతలముగనుండు. మలమును గట్టిపరచును. మరియు నిది రక్తమూలము కఫము పిత్తము వీటిని నశింపంజేయు.

గద్య॥ ఇతి ధన్వంతరీయే నిఘంటౌ నానాద్రవ్య పర్యాయ గుణ ప్రకాశే చతుర్థః కరవీరాదివర్గః.

శ్రీరస్తు.

# ధన్వంతరినిఘంటువు.



## ఆమ్రాద్యనుక్రమణిక.

శ్లో॥ ఆమ్రామ్రాతకజంబీర నారంగంబీజపూరకం । అమ్లికాకారుకభవ్యానితిందుకశ్చవికంకతః । మధూకంపీలుఖర్జూరకోదాడిమాక్షోటపరూషకం । మహాపారేవతస్త్వాళః ప్రియాళుర్నారికేళకం। వటాశ్వత్థః ప్లక్షజంబూదుంబరః ఫల్గుక్షీరికా । శ్లేష్మాతకశమీకోలః కరీరః కరమర్దకః । ఏషాంఫలానిహృద్యానియథాకాలం దినేష్వపి । సమాహృత్యాప్రయోజ్యానిబలవర్ణప్రవృద్ధయే । కదంబశ్చకరంజద్వౌ శిరీషార్జునవేతసాః । వరుణఃశింశుపాసర్జశ్శాల్మలీముష్కపాలకౌ । ఏషాంపయఃప్రసిష్టానివల్కలానిప్రయోజయేత్ । విసర్పివ్రణరుగ్దాహశోభానాంప్రశాంతయే। మల్లికావార్షికాజాతివాసన్తిగ్రీష్మచంపకాః। తగరోయూథికాకుందో హ్యతిలోమోతిముక్తకః । వకుళఃకింకిరాతశ్చతిలకాశోకకింశుకాః । పుష్పాన్యేతానిధార్యాణి రూపసౌగంధమిచ్ఛతా। ఆమ్రాదిరయముక్తోనోత్వవర్గేష్విహపంచమః॥



టీక॥ ఆమ్రి - మామిడి ఆమ్రాతకా - అంబాళము జంబీర - నిమ్మ నారంగం - నారంజికాయ బీజపూరకం - మాదీఫలము అమ్లు - చింత అరుక - గజనిమ్మ భవ్యా - తియ్యనిమ్మ తిందుక - తుమికి వికంకతా - కానరేగు మధూకం - ఇప్ప పీలు - గోగు ఖర్జూరం - ఖర్జూరము ద్రాక్షా - ద్రాక్ష అక్షోడ - ఈతచెట్టు పరూషకం - చిట్టీత పారేవతం - ఈడ తాళ - తాటిచెట్టు ప్రియాళు - మొరళిచెట్టు నారికేళక - టెంకాయచెట్టు వట-మఱ్ఱి అశ్వత్థ - రావి కళ్ళరావి ప్లక్ష - జువ్వి జంబు - నేరేడు కాకినేరేడు ఉదుంబర - మేడి ఫల్గు - బ్రహ్మమేడి క్షీరికా - పాలచెట్టు శ్లేష్మాతక - విరిగిచెట్టు శమీ - జమ్మి కోల - రేగు కరీర - వెణుతురుచెట్టు కరమర్దక - ఓక కదంబ - కడిమి కరంజద్వా - పిన్నకానుగు పెద్దకానుగు శిరీష - దిరిసెనము అర్జున - మద్ది వేతసా - ప్రబ్బలి వరుణ - ఉలిమిరి శింశుపా - ఇరుగుడు సర్జః - వేగిస శాల్మలి - బూరుగు ముష్క - మొక్కపుచెట్టు సాలక - ఏపి మల్లికా - మల్లె వాషికా - యేరు మల్లె జాతి - జాజి నాసంతి - వసంతకాలపుమల్లె గ్రీష్మ - విరజాజి చంపక - సంపెంగి తరుణీ - చేమంతి యూథికా - అడవిమొల్ల కుంద - మొల్ల అతిలోమ - పచ్చనిమొల్ల అతిముక్త - ఎఱ్ఱగురువింద వకుళ - పొగడ కింకిరాత - నందివర్ధనము తిలక - తిలకపుచెట్టు అశోక - అశోకవృక్షము కింశుక - మోదుగు.



## ఆమ్రాదివర్గప్రారంభః.

### మామిడి.

శ్లో॥ ఆమ్రశ్చూతో రసాలశ్చమాకందస్సహకారకః ।
కామాంగః పికబంధుస్స్యాద్వరపుష్పో మహోత్సవః ॥

టీక॥ 1 ఆమ్ర 2 చూత 3 రసాల 4 మాకంద 5 సహకారక 6 కామాంగ 7 పికబంధు 8 వరపుష్ప 9 మహోత్సవ యీ 9 న్ని మామిడి పేర్లు.

### మామిడి గుణము.

శ్లో॥ ఆమ్రోగ్రాహీప్రమేహాస్రకఫపిత్తవ్రణాన్జయేత్ । తత్ఫలం బాలమత్యమ్లంరూక్షందోషత్రయాస్రజిత్ । పక్వంతుమధురం వృష్యం స్నిగ్ధంహృద్యంబలప్రదం । గురువాతహరంరుచ్యం వర్ణ్యంశీతమపిత్తలం । రసస్తస్యసరస్స్నిగ్ధోరోచనోబలవర్ణకృత్ ।సహకారంచవాతఘ్నంపిత్తశ్లేష్మవినాశనం । కషాయం మధురంవృష్యం గురుస్నిగ్ధంవిశేషతః । పక్వామ్రంజనయే దాయుర్మాంసశుక్రబలప్రదం । శుష్కామ్రంతుకషాయామ్లం భేదనంకఫవాతజిత్ । ఆమ్రపుష్పంకఫఘ్నంస్యాద్రుచికృత్పిత్తవర్ధనం।ఆమ్రత్వక్చకషాయాచమూలంసాగ్రిహితాదృశం। రుచ్యంసంగ్రాహిశిశిరమతిసారవినాశనం ॥

తా॥ మామిడి మలబంధమునుజేసును. మరియు నిది ప్రమేహము రక్తదోషము కఫము పిత్తము వ్రణము వీటిని హరింపజేయు. లేతమామిడికాయలు మిక్కిలి పుల్లగ నుండు. తాపమునిచ్చును. మరియు త్రిదోషప్రకోపము రక్తదోషము వీటిని హరింపజేయు. పండినమామిడిపండ్లు మధురముగను వీర్యవృద్ధికరముగను జిగటగను బలకరముగను గురువుగను రుచిగను శీతలముగనునుండు. హృదయమునకు మేలు శరీరకాంతి వీటిని గలుగజేయు. వాతమునుబోగొట్టును. పిత్తమునుజేయకుండును. మామిడిపండ్లరసము వేగముగలదిగను జిగటగను రుచిగను బలకరముగనునుండు. మరియు నిది దేహకాంతిని గలుగజేయు. తియ్యమామిడి వెగటుగను తియ్యగను వీర్యవృద్ధికరముగను గురువుగను జిగటగనునుండు. మరియు నిది వాతపిత్తశ్లేష్మప్రకోపమునుబోగొట్టును. పక్వమైన తియ్యమామిడిపండ్లు ఆయువు మాంసము శుక్రము బలము వీటిని వృద్ధిజేయును. మామిడివరుగు వగరుగను పుల్లగను దోషములభేదించునదిగనునుండు. కఫవాతములను

బోగొట్టును. మామిడిపువ్వు కఫమును బోగొట్టును. రుచినిబుట్టించును. పిత్తమునువృద్ధి జేయును. మామిడిపట్ట వగరుగనుండును. మామిడివేరుపట్ట నవా వగరుగను రుచిగను లబ్ధకారిగనుండును. మరియు నిది అతిసారమును బోగొట్టును.

## పుల్లమామిడి.

శ్లో॥ క్షుద్రామ్రస్తిక్తకోశామ్రో లాక్షావృక్షస్సరక్తకః ।
జంతువృక్షో ఘనస్కంధః క్రిమివృక్షస్సుకాననః ॥

టీ॥ 1 క్షుద్రామ్ర 2 తిక్తకోశామ్ర 3 లాక్షావృక్ష 4 సరక్తక 5 జంతువృక్ష 6 ఘనస్కంధ 7 క్రిమివృక్ష 8 సుకానన యీ 8 న్ని పుల్లమామిడిపేర్లు.

## పుల్లమామిడి గుణము.

శ్లో॥ కోశామ్రస్సకటుకః పాకేపి ర్వ్యో ష్ణో నిలాపహః ।
కఫపిత్తహరో రుచ్యః కుష్ఠఘ్నో రక్తశోషణః ॥

టీ॥ పుల్లమామిడి పాకమువలన కారముగను ఉష్ణవీర్యముగలదిగను రుచికరముగనుండును. మరియు నిది వాతము కఫము పిత్తము కుష్ఠువు వీటిని నశింపంజేయును. మరియు రక్తమును శోషింపంజేయును.

## రాచమామిడి.

శ్లో॥ రాజామ్రమకస్తథామ్రాతో మన్మథోద్భవకః స్తథా ।
కపివృక్షః పురుస్కంధః కథితో బిడవాలకః ।
అంకోనిలకపిత్థో న్యో రాజపుత్రో నృపాత్మజః ॥

టీక॥ 1 రాజామ్రమక 2 ఆమ్రాత 3 మన్మథోద్భవక 4 కపివృక్ష 5 పురుస్కంధ 6 బిడవాలక 7 అంక 8 అనిలకపిత్థ 9 రాజపుత్ర 10 నృపాత్మజ యీ 10 న్ని రాచమామిడిపేర్లు.

## రాచమామిడి గుణము.

శ్లో॥ రాజామ్రశ్శైత్యదాహఘ్నో రక్తపిత్తాతిసారజిత్ ।
అసృగ్దరాతికృచ్ఛ్రాతిసారఘ్నో రక్తగుల్మానిలాపహః ॥

టీ॥ రాచమామిడి శైత్యము దాహము రక్తపిత్తము అతిసారము అసృగ్దరము కృచ్ఛ్రము అతిసారము రక్తదోషము గుల్మము వాతము వీటిని నశింపంజేయును.

## అంబాళము.

శ్లో॥ ఆమ్రాతకఃపీతనకఃకపిచూతో౽మ్రవాటకః।
శృంగికపివరాఖ్యశ్చతనుక్షీరఃకపిప్రియః।
ఆమ్రవాటఃకపిప్రీతోటంకస్స్యాద్గుణాజీవకః॥

టీక॥ 1 ఆమ్రాతక 2 పీతనక 3 కపిచూత 4 ఆమ్రవాటక 5 శృంగి 6 కపివరాఖ్య 7 తనుక్షీర 8 కపిప్రియ 9 ఆమ్రవాట 10 కపిప్రీత 11 టంక 12 గుణజీవక యీ 12 న్ను. అంబాళము పేళ్ళు.

### అంబాళపు గుణము.

శ్లో॥ ఆమ్రాతకఫలంవృష్యంపిత్తాస్రకఫశూలనుత్।
దీపనంశీతమధురంరుచిన్యాత్ముతికృద్గురు॥

తా॥ అంబాళము శీతలముగను మధురముగనునుండు. మరియు నిది పిత్తము రక్తదోషము కఫము శూల వీటిని నివర్తింపజేయునదియేగాక వీర్యవృద్ధి అగ్నిదీపనము కలిగించెముగ వాతము వీట్లను సదా గలుగజేయు.

### నిమ్మ.

శ్లో॥ జంబీరోజంభలోజంభఃప్రోక్తోదంతశఠః స్తథా।
గంభీరోవక్త్రశోధీచరోచనోదంతహర్షణః॥

టీక॥ 1 జంభీర 2 జంభల 3 జంభ 4 దంతశఠ 5 గంభీర 6 వక్త్రశోధి 7 రోచన 8 దంతహర్షణ యీ 8 న్ను నిమ్మ పేళ్ళు.

### నిమ్మ గుణము.

శ్లో॥ తృష్ణాశూలకఫోద్రేకఛర్దిశ్వాసాక్షిరోగజిత్।
వాంతిశ్లేష్మవిబంధఘ్నోజంబీరఃపిత్తజిద్గురుః॥

తా॥ నిమ్మ గురుత్వమునుజేయును. మరియు నిది దప్పి శూల కఫము వాంతి శ్వాస నేత్రరోగము వాతము శ్లేష్మము మలబంధము పిత్తము వీటిని నివర్తింపజేయు.

### నారంజకాయ.

శ్లో॥ నారంగంత్వక్సుగంధశ్చగోరక్షోథముఖప్రియః।
స్యైరావతకఃప్రోక్తోయోగీవక్త్రాధివాసనః॥

టీక॥ 1 నారంగ 2 త్వక్సుగంధ 3 గోరక్ష 4 ముఖప్రియ 5 ఐరావతక 6 యోగి 7 వక్త్రాధివాసన యీ 7 న్ను నారంజికాయ పేళ్ళు.

నారంజికాయ గుణము.

శ్లో॥ నారంగోమ్లరసశ్శీతః కఫఛర్దిసమీరజిత్ ।
గుల్మారోచికరోగఘ్నః క్రిమిజిత్కాయశోధనః ॥

తా॥ నారంజికాయ పుల్లగను శీతలముగనునుండు. మరియు నిది కఫము ఛర్ది వాతము గుల్మము అరుచి క్రిమిరోగము వీటిని నివర్తింపంజేయుటయే గాక శరీరమును శోధించును.

మాదీఫలము.

శ్లో॥ బీజపూరోబీజపూర్ణః కేసరీఫలపూరకః ।
బీజకః కేసరామ్లశ్చమాతులుంగస్సుపూరకః ।
కేసరాగ్రోబృహత్పూరోలుంగాహ్వామునిపుంగవః ॥

టీక. 1 బీజపూర 2 బీజపూర్ణ 3 కేసరీ 4 ఫలపూరక 5 బీజక 6 కేసరామ్ల 7 మాతులుంగ 8 సుపూరక 9 కేసరాగ్ర 10 బృహత్పూర 11 లుంగాహ్వ 12 మునిపుంగవ యీ 12 న్ను మాదీఫలము పేళ్ళు.

పెద్దమాదీఫలము.

శ్లో॥ బీజపూరోపరఃప్రోక్తోమధురోమధుకర్కటః ।
మధుపర్ణీచవిజయోవర్ధమానోమహాఫలః॥

టీక॥ 1 బీజపూర 2 మధుర 3 మధుకర్కట 4 మధుపర్ణీ 5 విజయ 6 వర్ధమాన 7 మహాఫల యీ 7 న్ను పెద్దమాదీఫలము పేళ్లు.

అడవిమాదీఫలము.

శ్లో॥ వనాఢ్యశ్చైవగంధాఢ్యోదేవభూతోనగోద్భవః ।
సుగంధోమాతులుంగశ్చరుచకశ్చకుళింగకః ॥

టీక॥ 1 వనాఢ్య 2 గంధాఢ్య 3 దేవభూత 4 నగోద్భవ 5 సుగంధ 6 మాతులుంగ 7 రుచక 8 కుళింగక యీ 8 న్ని అడవిమాదీఫలము పేళ్ళు.

మాదీఫల గుణము.

శ్లో॥ బీజపూరఫలంరుచ్యం రసామ్లందీపనంలఘు । రక్తపిత్తకరం
కంఠ్యం జిహ్వాహృద్దోషశోధనంపరమ్ । తన్మాంసంబృంహణం

శీతంగురుపిత్తసమీరజిత్ । కేసరంలఘుసంగ్రాహిశూలగుల్మో
దరాపహం । బీజఘ్నంక్రిమిశ్లేష్మ వాతజిద్గర్భకంగురు ।
తత్పుష్పంవాతలంగ్రాహి రక్తపిత్తహరంలఘు । శూలాజీర్ణ
విబంధేషు మందాగ్నౌకఫమారుతే । అరుచౌశ్వాసకాసేషు
రసస్తస్యోపదృశ్యతే ॥

తా॥ మాదీఫలము రుచిగను పుల్లగనునుండు. అగ్నిదీపనమునుగలుగంజేయు. లఘువుగనునుండును. రక్తపిత్తమునుజేయును. కంఠము నాలుక హృదయము వీనిని బాగుగ శోధించును. దీనిగుజ్జు శీతలముగను గురువుగనునుండు. మరియు పిత్తము వాతము వీటిని బోగొట్టుటయేగాక శరీరపుష్టిని గలుగంజేయు. దీనికేసరములు లఘువుగను మలబద్ధకారిగనునుండు. మరియు నిది శూల గుల్మను ఉదరరోగము వీటిని నశింపంజేయు. దీనివిత్తులు ఉష్ణముగను గురువుగనునుండు. మరియు నిది క్రిములు శ్లేష్మము వాతము వీనినిబోగొట్టు. మరియు నిది గర్భమును గలుగంజేయు. దీనిపూలు వాతలమునుజేయును. మలమును బంధించును. రక్తపిత్తమును హరించును. లఘువుగనుండును. దీనిరసము శూల అజీర్ణము మలబంధము అగ్నిమాంద్యము కఫము వాతము అరుచి శ్వాసము కాసము వీనినిబోగొట్టును.

చింత.

శ్లో॥ అమ్లికాచుక్రికాచుక్రాసామ్లశుక్లాచశుక్లికా ।
తింతిడీచించికాచించాతింత్రిణీకాసతింత్రికా ॥

టీక॥ 1 అమ్లికా 2 చుక్రికా 3 చుక్రా 4 సామ్లశుక్లా 5 శుక్లికా 6 తింతిడీ 7 చించికా 8 చించా 9 తింత్రిణీ 10 కాసతింత్రికా యీ 10 న్ని చింతపేళ్ళు.

చింత గుణము.

శ్లో॥ అమ్లికామాగురుర్వాతహారాపిత్తకఫాసృజిత్ । పక్వాతదన్వ
త్సరారుచ్యావహ్నివస్తివిశుద్ధికృత్ । శుష్కాహృద్యాశ్రమ
భ్రాంతి తృష్ణాక్లమహారాలఘుః । తింత్రిణీపల్లవంహృద్యం
కషాయామ్లంరుచిప్రదం । నేత్రరోగహరంమేధ్యం దీపనంకఫ
వాతజిత్ । చించాపుష్పంతుతువరంస్వాద్వమ్లంచరుచిప్రదం।
విశదంచాగ్నిజనకంప్రమేహఘ్నంకఫాపహం । చించాపత్రం
శుశోథఘ్నంరక్తదోషవ్యథాపహం । తస్యపుష్పత్వచాభస్మ

శూలమందాగ్నినాశనం । అమ్లసారస్తుతీక్ష్ణామ్లో వాతఘ్నః
కఫపిత్తకృత్ ।అమ్లేనశర్కరాయుక్తోదాహపిత్తాస్రశాంతినుత్ ॥

తా॥ చింతపిండెలు గురుత్వమునుజేసును. వాతము పిత్తము కఫము రక్తదోషము వీటిని నశింపంజేయు. పండినచింతకాయ వేగముకలదిగను రుచికరముగనునుండు. మరియు జాతరాగ్ని పొత్తికడుపు వీనిని శుద్ధిజేయును. చింతపరుగు హృదయమునకు మేలుజేసును. శ్రమ భ్రమము దప్పి బడలిక వీనిని బోగొట్టును. తేలికనిచ్చును. చింతచిగురు హృదయమునకు మేలుజేసును. వగరుగను పుల్లగను రుచికరముగనునుండు. నేత్రరోగము బోగొట్టును. బుద్ధికి మేలుజేసును. అగ్నిదీపనమును జేసును. కఫవాతములబోగొట్టును. చింతపూలు వగరుగను తియ్యగను పుల్లగను రుచిగను శోధనకారిగనునుండు. ప్రమేహము కఫము వీటిని బోగొట్టుటయేగాక అగ్నిదీపనమును సగా గలుగంజేయు. చింతాకు వాపు రక్తదోషము వీనిని బోగొట్టును. దీనిపూలభస్మము పట్టభస్మము ఇవి శూల అగ్నిమాంద్యము వీటిని బోగొట్టును. చింతాకురసము వేగముకలదిగనుండు. అమ్లవాతమును బోగొట్టును. కఫము పిత్తము వీటిని జేసును. చింతాకురసములో శర్కరను వేసిత్రాగిన తాపము పిత్తము బడలిక ఇవి హరించు.

## చింతపండు.

శ్లో॥ తింతిడీకంతువృక్షామ్లమమ్లశాకోమ్లపాదపః ॥

టీక॥ 1 తింతిడీక 2 వృక్షామ్ల 3 అమ్లశాక 4 అమ్లపాదప యీ 4 న్ను చింతపండు పేళ్లు.

## చింతపండు గుణము.

శ్లో॥ తింతిడీకంసమీరఘ్నమామమత్యంతపరంగురు ।
తత్పక్వంలఘుసంగ్రాహిగ్రహణీకఫవాతజిత్ ॥

తా॥ చింతపండు వాతమునుబోగొట్టును. చింతగుల్ల మిక్కిలికాక గురుత్వము వీటినిజేసును. పండినచింతగుల్ల లఘువుగను మలబద్ధకారిగనునుండు. మరియు గ్రహణి కఫము వాతము వీటిని బోగొట్టును.

## పులిచింత.

శ్లో॥ చుక్రాహ్వామ్లకాతుశా కేశరీలోణికాచామ్లలోణికా ।
సునిష్ణకశ్చతుష్పత్రీ సనదంతెశతామతా ॥

తా॥ తియ్యనిమ్మకాయ మధురముగను శీతలముగను వీర్యవృద్ధికరముగను శరీర పుష్టికరముగను తృప్తినిగలుగజేయునదిగనునుండు. మరియు నిది కఫము పిత్తము వాపు శూల వీటిని నివర్తింపజేయు.

తుమికి.

శ్లో॥ తిందుకో రక్తసారశ్చ కాలస్కంధోతిముక్తకః ।
స్ఫూర్జకస్సూర్యకస్తుప్తస్స్యందితా వారణోరవః ॥

టీక॥ 1 తిందుక 2 రక్తసార 3 కాలస్కంధ 4 అతిముక్తక 5 స్ఫూర్జక 6 సూర్యక 7 తుప్త 8 స్యందితా 9 వారణ 10 రవ యీ 10 న్ను తుమికిపేళ్ళు.

పెద్దతుమికె.

శ్లో॥ తిందుకోన్యోర్కపీతుశ్చ జలజో ఘూర్ణపత్రకః ।
కాకేందుకశ్చ ప్రాణాసః పీలుకః కాకపీలుకః

టీక॥ 1 అర్కపీతు 2 జలజ 3 ఘూర్ణపత్రక 4 కాకేందుక 5 పీలుక 6 కాకపీలుక యీ 6 న్ను పెద్దతుమికిపేళ్ళు.

తుమికి గుణము.

శ్లో॥ అపక్వః కషాయః సంగ్రాహీ తిందుకో వాతకోపనః ।
విపాకే గురుసత్పక్వః మధురః కఫపిత్తజిత్ ॥

తా॥ తుమికికాయ వగరుగను మలబద్ధకారిగనునుండు. మరియు నిది వాత ప్రకోపమును గలుగజేయును. పండినఫలము గురువుగను మధురముగనునుండు. మరియు కఫము పిత్తము వీటిని నివర్తింపజేయు.

కానరేగు.

శ్లో॥ వికంకతో మృదుఫలో గ్రంథిలస్స్వాదుకంటకః । కాకపాదో
వ్యాఘ్రపాదశ్శ్వానపాదోథ కింకిణీ । ప్రజావృక్షోగ్నివృక్షశ్చ
స్రువవృక్షశ్చ సంస్మృతః। పృథుబీజః స్వాదువృక్షః కంటకీపిండ
రోపణః। స్యాద్యజ్ఞవృక్షశ్చ క్వచిదైరావణో మతః ॥

టీక॥ 1 వికంకత 2 మృదుఫల 3 గ్రంథిల 4 స్వాదుకంటక 5 కాకపాద 6 వ్యాఘ్రపాద 7 శ్వానపాద 8 కింకిణీ 9 ప్రజావృక్ష 10 అగ్నివృక్ష 11 స్రువవృక్ష 12 పృథుబీజ 13 స్వాదువృక్ష 14 కంటకీ 15 పిండరోపణ 16 యజ్ఞవృక్ష 17 ఐరావణ యీ 17 న్ను కానరేగుపేళ్ళు

కానరేగు గుణము.

శ్లో॥ వికంకతో౽రసేతి క్తశ్శీతళః కోఫనాశనః ।
హంతిశ్లేష్మాణమత్యుగ్రముగ్రం రక్తమేవచ ।

తా॥ కానరేగు చేదుగను శీతలముగనునుండు. మరియు నిది శోఫ శ్లేష్మము రక్తాధిక్యము వీటిని నివర్తింపజేయు.

ఇప్ప.

శ్లో॥ మధుకో మధువృక్షశ్చ మధుష్ఠీలో మధుస్రవః ।
గుడపుష్పో౽థ లోధ్రపుష్పో వానప్రస్థో ౽థ మాధవః ।
మధుగస్తీక్ష్ణసారశ్చ డోలాఫలమహాఫలః ।
మధుపుష్పో మధుప్రాయో భోగ్యో మధుఫలో మధుః ॥

టీక॥ 1 మధుక 2 మధువృక్ష 3 మధుష్ఠీల 4 మధుస్రవ 5 గుడపుష్ప 6 లోధ్రపుష్ప 7 వానప్రస్థ 8 మాధవ 9 మధుగ 10 తీక్ష్ణసార 11 డోలాఫల 12 మహాఫల 13 మధుపుష్ప 14 మధుప్రాయ 15 భోగ్య 16 మధుఫల 17 మధు యీ 17 న్ను యిప్పచెట్టుపేళ్ళు.

పిన్న యిప్ప.

శ్లో॥ మధుకో౽న్యో మధూలశ్చ జలజో దీర్ఘపత్రకః ।
హ్రస్వపుష్పస్స్వాదుఫలో గాలికా౽న్యో మధూళికః ।
క్షీరవృక్షః స్తథా ప్రోక్త ఉపకుంచీ శతంగమః ॥

టీక॥ 1 మధూల 2 జలజ 3 దీర్ఘపత్రక 4 హ్రస్వపుష్ప 5 స్వాదుఫల 6 గాలిక 7 మధూళిక 8 క్షీరవృక్ష 9 ఉపకుంచీ 10 శతంగమ యీ 10 న్ను పిన్న యిప్పపేళ్ళు.

ఇప్ప గుణము.

శ్లో॥ మధుకః కఫవాతఘ్నః కషాయో వ్రణరోపణః ।
తత్పుష్పం మధురం బల్యం శీతలం గురుబృంహణం ॥
ఫలం శీతం గురు స్వాదు శుక్రలం వాతపిత్తజిత్ ।
అహృద్యం హంతి తృష్ణాస్రదాహశ్వాసక్షతక్షయాన్ ॥

తా॥ ఇప్ప వగరుగనుండును. ఇది కఫము వాతము వీటిని బోగొట్టును. మరియు నిది వ్రణములనార్చును. ఇప్పపూలు మధురముగను బలకరముగను శీతలముగను గురువుగనునుండు. మరియు నిది శరీరమునకు పుష్టిని గలుగంజేయు. ఇప్పపండ్లు శీతలముగను గురువుగను రుచికరముగను వీర్యవృద్ధికరముగనునుండు. మరియు నిది వాతము పిత్తము దప్పి రక్తదోషము తాపము శ్వాసము గాయము క్షయము వీటిని నివర్తింపంజేయు. మరియు నిది హృదయమునకు చెరుపుజేసును.

గోగు.

శ్లో॥ పీలుశ్శ్వేతసహస్రాంశీధాత్రీగుచ్ఛఫలోమతః ।
విరేచనఫలశ్శాఖీస్యామఃకారభవల్లభః ।
భేదీచోష్ణప్రియశ్చైవదీపనోభూమిజస్తథా ॥

టీక॥ 1 పీలు 2 శ్వేతసహస్రాంశీ 3 ధాత్రీ 4 గుచ్ఛఫల 5 విరేచనఫల 6 శాఖీ 7 స్యామ 8 కారభవల్లభ 9 భేదీ 10 ఉష్ణప్రియ 11 దీపన 12 భూమిజ యీ 12 న్ను గోగుపేళ్ళు.

పెద్దగోగు.

శ్లో॥ మహాపీలుస్థూలఫలోమహావృక్షస్సువృక్షకః ।
రాజకోరాజగంధశ్చతథాచాగ్నివినాశనః ॥

టీక॥ 1 మహాపీలు 2 స్థూలఫల 3 మహావృక్ష 4 సువృక్షక 5 రాజక 6 రాజకంధ 7 అగ్నివినాశన యీ 7 న్ను పెద్దగోగుపేళ్ళు.

గోగు గుణము.

శ్లో॥ పీలూష్ణందీపనంభేదిరక్తపిత్తంశరంలఘు ।
గుల్మార్శఃప్లీహవాతాశ్మకఫహారిరసాయనమ్ ॥

తా॥ గోగు ఉష్ణముగను లఘువుగను బలకరముగనునుండు. దోషముల భేదించును. రక్తపిత్తమును గలుగంజేయు. మరియు నిది గుల్మము అర్శస్సు ప్లీహము వాతము అశ్మరి కఫము వీటిని నివర్తింపంజేయుటయేగాక అగ్నిదీపనమును సగా గలుగంజేయు.

ఖర్జూరము.

శ్లో॥ ఖర్జూరీతుఖరస్కంధాకషాయమధురాగ్రజా ।
దుఃప్రధర్షాదురారోహానిశ్రేణీస్వాదుమస్తకా ॥

టీక॥ 1 ఖర్జూరీ 2 ఖరస్కంధా 3 కషాయమధురా 4 అగ్రజా 5 దుఃప్రధర్షా 6 దురారోహా 7 నిశ్రేణీ 8 స్వాదుమస్తకా యీ 8 న్ని ఖర్జూరము పేళ్ళు.

భూమిఖర్జూరము.

శ్లో॥ అన్యాతుభూమిఖర్జూరీకోకస్యాత్కాకకర్కటీ ॥

టీక॥ 1 భూమిఖర్జూరి 2 కోక 3 కాకకర్కటి యీ 3 న్ను భూమిఖర్జూరము పేళ్ళు.

ఖర్జూరపు గుణము.

శ్లో॥ క్షతక్షయాపహంహృద్యంశీతలంతర్పణంగురు ।
రసేపాకేచమధురంఖర్జూరంరక్తపిత్తజిత్ ॥

తా॥ ఖర్జూరము మనోజ్ఞముగను శీతలముగను తృప్తికరముగను గురువుగను పక్వమైనయెడల మధురముగనుండు. మరియు నిది రక్తపిత్తమును బోగొట్టును.

ద్రాక్ష.

శ్లో॥ ద్రాక్షాచారుఫలాకృష్ణా ప్రియాలుస్తాపసప్రియా । కాశ్మీరికా వినిర్దిష్టారసాలాకాలమాక్షికా । ఉత్తరాపథికాప్రోక్తాకపిలా చఫలోత్తమా । స్వాదుపూరామధురసా మృద్వీకాగోస్తనీ మతా।తథాకృష్ణఫలాప్రైనహారహూరాచకథ్యతే ॥

టీక॥ 1 ద్రాక్షా 2 చారుఫలా 3 కృష్ణా 4 ప్రియాలు 5 తాపసప్రియా 6 కాశ్మీరికా 7 రసాలా 8 కాలమాక్షికా 9 ఉత్తరా 10 పథికా 11 కపిలా 12 ఫలోత్తమా 13 స్వాదుపూరా 14 మధురసా 15 మృద్వీకా 16 గోస్తనీ 17 కృష్ణఫలా 18 హారహూరా యీ 18 న్ని ద్రాక్ష పేళ్ళు.

ద్రాక్ష గుణము.

శ్లో॥ ద్రాక్షాహృద్యారసాస్వర్యామధురాస్నిగ్ధశీతళా ।
రక్తపిత్తజ్వరశ్వాసతృష్ణాదాహక్షయాపహా ॥

తా॥ ద్రాక్ష మనోహరముగను రసముగలదిగను మధురముగను జిగటగను శీతలముగనునుండు. మరియు నిది రక్తదోషము పిత్తజ్వరము శ్వాస దప్పి తాపము క్షయరోగము వీటిని బోగొట్టటయే గాక కంఠమునకు సుస్వరము ను గలుగించేయు.

## పుస్తకాంతరే.

శ్లో॥ ద్రాక్షాపక్వాసరాశీతా చక్షుష్యాబృంహణీగురుః । హన్తి
తృష్ణాజ్వరశ్వాసహన్తివాతాస్రకామిలాః । కృచ్ఛ్రాస్రపిత్తస
మ్మోహదాహశోషమదాత్యయాన్। ఆమాసాల్పగుణాగుర్వీ
సైవామ్లారక్తపిత్తకృత్। నిర్వీర్యాన్యాలఘుదాక్షాగోస్తనీస
దృశాగుణైః॥ద్రాక్షాపర్వతజాలఘ్వీసామ్లాశ్లేష్మాల్పపిత్తనుత్॥

తా॥ పండినద్రాక్ష వేగముకలదిగను శీతలముగను నేత్రహితకారిగను శరీరము నకు పుష్టినిగలుగజేయునదిగను గురువుగనునుండు. మరియు నిది దప్పి జ్వరము శ్వాస వాంతి వాతరక్తము కామిల మూత్రకృచ్ఛ్రము రక్తపిత్తము మూర్ఛ తాపము శోష మదాత్యయరోగము వీటిని నశింపజేయు. పచ్చిద్రాక్ష స్వల్పగుణము కలదై యుండును. గురుత్వమునుజేసును. పండనిపుల్లనిద్రాక్ష రక్తపిత్తమును గలుగజేసును. లఘుద్రాక్ష గోస్తనీద్రాక్ష గుణములు గలదిగనుండుటయే గాక సారములేనిదై యుండును. పర్వతప్రదేశములయందు ఫలించినద్రాక్ష లఘువుగను పుల్లగనునుండు. మరియు శ్లేష్మము అల్పపిత్తము వీటిని నశింపజేయు.

## ఆతచెట్టు.

శ్లో॥ అక్షోడఃపార్వతీయశ్చఫలస్నేహోగుడాశ్రయః ।
కరీటఃసర్పరాశిశ్చస్వాదుమజ్జామృదుచ్ఛదః ॥

టీక॥ 1 అక్షోడ 2 పార్వతీయ 3 ఫలస్నేహ 4 గుడాశ్రయ 5 కరీట 6 సర్ప రాశి 7 స్వాదుమజ్జ 8 మృదుచ్ఛద యీ 8 న్ని ఆతచెట్టుపేళ్ళు.

## ఆత గుణము.

శ్లో॥ అక్షోడోదాహపిత్తఘ్నోరూక్షోష్ణఃకఫవాతజిత్ ॥

తా॥ ఆతరూక్షముగను ఉష్ణముగనునుండు. మరియు నిది తాపము పిత్తము కఫము వాతము వీటిని నివర్తింపజేయు.

## చిట్టేత.

శ్లో॥ పరూషకంపరంప్రోక్తంనీలవర్ణంపరాపరం ।
పరిమండలమల్పాస్థిపరూషంరూక్ష్మసూచికం ॥

టీక॥ 1 పరూషక 2 పర 3 నీలవర్ణ 4 పరాపర 5 పరిమండల 6 అల్పాస్థి 7 పరూష 8 సూక్ష్మకుంచిక యీ 8 న్ని చిట్రీత పేర్లు.

చిట్రీత గుణము.

శ్లో॥ పరూషకఫలంమేహశమనీరక్తపిత్తజిత్ ।
వాతార్శఃకఫజంతుఘ్నంమండలీకుష్ఠనాశనం ॥

తా॥ చిట్రీతపండు మేహము రక్తపైత్యము వాతము అర్శస్సు కఫము జంతు వాయువు మండలీరోగము కుష్టువు వీటిని నశింపజేయు.

ఈడ.

శ్లో॥ పారేవతంవైవతికంతిందుకంచఫలంస్మృతం।
మహాపారేవతంప్రోక్తంరక్తపారేవతంమతం ॥

టీక॥ 1 పారేవత 2 వైవతిక 3 తిందుక 4 ఫల యీ 4 న్ను ఈడ పేళ్ళు. మహాపారేవత అనునది పెద్దఈడ పేరు. రక్తపారేవత అనునది ఎఱ్ఱఈడ పేరు.

ఈడ గుణము.

శ్లో॥ పారేవతంవాతశమనంగుల్మవిద్రధిజిత్పరం ।
మందాగ్నిదాహశమనంత్రపుశుద్ధికరంశుభం ॥

తా॥ ఈడ వాతము గుల్మము విద్రధి అగ్నిమాంద్యము తాపము వీటిని నశింపజేయు. మరియు నిది సీసమును శుద్ధిజేయుటయే గాక శుభకరముగనుండు.

తాటిచెట్టు.

శ్లో॥ తాళోధ్వజద్రుమఃప్రోక్తఃదీర్ఘస్కంధోదురారుహః ।
తృణరాజోదీర్ఘతరుర్లేఖ్యపత్రోఘనాఘనః ॥

టీక॥ 1 తాళ 2 ధ్వజద్రుమ 3 దీర్ఘస్కంధ 4 దురారుహ 5 తృణరాజ 6 దీర్ఘతరు 7 లేఖ్యపత్ర 8 ఘనాఘన యీ 8 న్ని తాటిచెట్టు పేర్లు.

తాటి గుణము.

శ్లో॥ ఫలంస్వాదురసంతచ్చతాళజంగురుపిత్తనుత్ ।
తద్బీజంనోష్ణశమనంమూత్రరక్తహరంపరమ్ ॥

తా॥ తాటిపండు రుచికరముగను గురువుగనునుండు. మరియు నిది పిత్తమును బోగొట్టును. దీనివిత్తులు ఉష్ణము బహుమూత్రము రక్తదోషము వీటిని నివర్తింపం జేయు.

## పున్నాగాంతరే.

శ్లో॥ తాలశ్శీతో౽సరుత్పిత్త వ్రణఘ్నోమదశుక్రకృత్ । తత్ఫలంశీతలం బల్యంస్నిగ్ధంస్వాదురసంగురు। విష్టంభివాతపిత్తాస్రక్షతదాహాక్షతాసహం।అగ్నిదగ్ధంతుయత్తాళఫలంతత్స్వాదుపిత్తజిత్ । బృంహణంశీతలంస్నిగ్ధంబల్యంశ్లేష్మకరంగురు। శుక్రలోబద్ధవిణ్మూత్రస్తాళకందస్త్రిదోషజిత్ । తన్మజ్జావాతపిత్తఘ్నీవృష్యాగురుసరామధుః । తాళమజ్జాతుతరుణంకించిన్మధుకరోలఘుః। శ్లేష్మలోవాతపిత్తఘ్నస్సస్నేహమధురస్సరః। తాళజంతరుణంతోయంపిత్తానిలహరంగురు । బీజంమూత్రకరంవృష్యంవాతపిత్తహరంహిమం ॥

తా॥ తాటి శీతలముగనుండు. వాతము పిత్తము వ్రణములు వీనినిబోగొట్టును. మరియు నిది మదము శుక్రము వీటిని గలుగంజేయు. తాటిపండు శీతలముగను బలకరముగను జిగటగను రుచికరమైన రసముగలదిగను గురువుగను మలబద్ధకారిగనునుండు. మరియు నిది వాతము పిత్తము రక్తదోషము గాయమువల్లకలిగిన తాపము గాయము వీనినిబోగొట్టును. కాల్చిన తాటిపండు మధురముగను పుష్టికరముగను శీతలముగను జిగటగను బలకరముగను గురువుగనునుండు. కఫమునుజేసును. పిత్తమునుబోగొట్టును. తాటితేగలు శుక్రమును వృద్ధిజేసును. మలమూత్రముల బంధించును. త్రిదోషముల బోగొట్టును. తాటిమెదడు గురువుగను మధురముగను వేగముకలదిగనునుండు. శుక్రమును వృద్ధిజేయును వాతపిత్తమునుబోగొట్టును. తాటిముంజలు కొంచెము తియ్యగను చులకనగను వేగముకలదిగనునుండు. కఫమునుజేసును. వాతపిత్తమును బోగొట్టును. స్నేహముతో గూడియుండును. తాటినీళ్ళు గురువుగనుండు. పిత్తము వాతము వీనిని హరించును. తాటివిత్తులు శీతలముగనుండు. మూత్రము శుక్రము వీటిని వృద్ధిజేయును. మరియు వాతము పిత్తము వీటిని బోగొట్టును.

## మొరళి.

శ్లో॥ ప్రియాళుశ్చఖరస్కంధస్సారో౽బహుళవల్కలః ।
పటోలసన్నకద్రుశ్చతాపసస్సురవల్లభః॥

టీక॥ 1 ప్రియాళు 2 ఖరస్కంధ 3 సార 4 బహుళవల్క 5 వట 6 లసన్న 7 కద్రు 8 తాపస 9 సురవల్లభ యీ 9 న్ని మొరళి పేళ్ళు.

మొరళి గుణము.

శ్లో॥ ప్రియాళుర్వృష్యఆయుష్యఃకషాయోమధురశీతళః ।
రక్తపిత్తహరోబల్యఃకుష్ఠంజయతికాంతికృత్ ॥

తా॥ మొరళి వీర్యవృద్ధికరముగను ఆయుష్కరముగను వగరుగను మధురముగను శీతలముగను బలకరముగనునుండు. మరియు నిది రక్తపైత్యము కుష్టువు వీటిని నివర్తింపంజేయుటయేగాక దేహకాంతిని గలుగంజేయు.

టెంకాయ.

శ్లో॥ నారికేళోరసఫలస్సుతుంగఃకూర్చకేసరః । లతావృక్షోదృఢఫలోలాంగలీదాక్షిణాత్యకః । తృణరాజోమహాప్రాంశుర్దృఢనీలోమహాఫలః । వరాహోజీవతరుఃదీర్ఘదండఃసునీలకః । పుటోదకస్కంధఫలస్తృణాహ్వశ్చప్రకీర్తితః ॥

టీక॥ 1 నారికేళ 2 రసఫల 3 సుతుంగ 4 కూర్చకేసర 5 లతావృక్ష 6 దృఢఫల 7 లాంగలి 8 దాక్షిణాత్యక 9 తృణరాజ 10 మహాప్రాంశు 11 దృఢనీల 12 మహాఫల 13 వరాహ 14 జీవతరు 15 దీర్ఘదండ 16 సునీలక 17 పుటోదక 18 స్కంధఫల 19 తృణాహ్వ యీ 19 టెంకాయ పేళ్ళు.

టెంకాయ గుణము.

శ్లో॥ నారికేళంగురుస్నిగ్ధంపిత్తఘ్నంస్వాదుశీతలం ।
బలమాంసప్రదంహృద్యంబృంహణంవస్తిశోధనం ॥

తా॥ నారికేళము గురువుగను రుచికరముగను శీతలముగను మనోజ్ఞముగనుండు. మరియు నిది పైత్యకరమునందుండు దోషమును బోగొట్టుటయేగాక బలవృద్ధి మాంసవృద్ధి శరీరపుష్టి వీటిని సదా గలుగజేయు.

పుష్టికాంతరే.

శ్లో॥ నారికేళఫలంశీతం దుర్జరంవస్తిశోధనం । విష్టంభిబృంహణం వృష్యంవాతపిత్తాస్రదాహనుత్ । అర్ధపక్వంతృషాశోష శమనందుర్జరంపరం ॥ పక్వంతుమధురంరుచ్యం పిత్తకృద్వహ్ని

దీపనం॥ తదేవపక్వంనిర్ముక్తకపాలమనిలాపహం । దంతరోగే విశేషేణహితంతద్వాతశోణితే। నారికేళోద్భవంక్షీరంవృష్యం వాతకఫాపహం । ఈషత్పిత్తకరంస్నిగ్ధ ముష్ణంగురువిదాహకృత్ । గుల్మశూలారుచిశ్వాస కాసహృద్రోగశోఫజిత్ ॥ తస్యామ్భశ్శీతలంహృద్యం దీపనంశుక్రలంలఘు । తత్పాదపశిరోమజ్జాశుక్రలోవాతపిత్తజిత్ ॥

తా॥ టెంకాయ శీతలముగను అజీర్ణకారిగను మలబద్ధకారిగనునుండు. దేహపుష్టి శుక్రము వీటిని వృద్ధిజేసును. మరియు నిది పొత్తికడుపునొప్పి వాతము పిత్తము రక్తదోషము తాపము వీటినిబోగొట్టును. సగముపండిన టెంకాయ అజీర్ణకరముగ నుండు. మరియు దప్పి శోష వీటిని నివర్తింపంజేయు. బాగుగ పండిన టెంకాయ తీపుగను రుచిగనునుండు. పిత్తము అగ్నిదీపనము వీటినిజేసును. కొబ్బెర వాతమును హరించును. దంతరోగము వాతరక్తము వీటియందు మిక్కిలి హితమైనది. టెంకాయపాలు శుక్రమును వృద్ధిజేసును. వాతము పిత్తము వీటిని హరించును. కొంచెముగ పిత్తమును జేసును. జిగటగనుండును. కాక గురుత్వముజేసును. తాపమునిచ్చును. మరియు గుల్మము శూల అరుచి శ్వాస కాస హృద్రోగము వాపు వీటిని హరించును. టెంకాయనీరు శీతముగను వీర్యవృద్ధికరముగను లఘువుగనునుండు. హృదయమునకు మేలుజేసును. అగ్నిదీపనమునుజేసును. టెంకాయకల్లు శుక్రమును వృద్ధిజేయును. మరియు వాతము పిత్తము వీటిని బోగొట్టును.

మఱ్ఱి.

శ్లో॥ వటోరక్తఫలశ్శృంగీన్యగ్రోధస్స్కంధజోధ్రువః ।
క్షీరీస్యాద్యక్షవాసశ్చబహుపాదోవనస్పతిః ।
నందివృక్షఃప్ర(రో)హీచసిద్ధార్థోవటకీవటిః ।
అగ్రశృంగామరీచిచశమపత్రీచనస్మృతః॥

టీక॥ 1 వట 2 రక్తఫల 3 శృంగీ 4 న్యగ్రోధ 5 స్కంధజ 6 ధ్రువ 7 క్షీరీ 8 యక్షవాస 9 బహుపాద 10 వనస్పతి 11 నందివృక్ష 12 ప్రరోహీ 13 సిద్ధార్థ 14 వటకీ 15 వటి 16 అగ్రశృంగ 17 మరీచి 18 శమపత్ర యీ 18 న్ను మఱ్ఱిపేళ్ళు.

మఱ్ఱి గుణము.

శ్లో॥ న్యగ్రోధస్తువరశ్శీతః హా(ర్హి)కషాయమస్సౌనుశీతలః।
పిత్తదాహప్రశమనోగ్రహణీయోనిశూలజిత్ ॥

తా॥ మఱ్ఱి వగరుగను రుచికరముగను శీతలముగనునుండు. మఱియు నిది వ్రణము పిత్తము తాపము భేదులు ఆమశూల వీటిని బోగొట్టును.

రావి.

శ్లో॥ పిప్పలః కేశవావాసశ్చలపత్రః పవిత్రకః ।
మాంగల్యశ్యామలోశ్వత్థో బోధివృక్షో గజాశనః ।
బోధిశ్రీమాన్ కుచాశృంగీ చైత్యశ్చైత్యతరుస్తథా ।
చలాత్మకో వాదరంగోధన్యవృక్షశ్చసన్మృతః ॥

టీక॥ 1 పిప్పల 2 కేశవావాస 3 చలపత్ర 4 పవిత్రక 5 మాంగల్య 6 శ్యామల 7 అశ్వత్థ 8 బోధివృక్ష 9 గజాశన 10 బోధి 11 శ్రీమాన్ 12 కుచాశృంగి 13 చైత్య 14 చైత్య యీ 14 న్ను రావిచెట్టుపేళ్ళు.

రావి గుణము.

శ్లో॥ పిప్పలోదుర్జరశ్శీతః పిత్తశ్లేష్మవ్రణాస్రజిత్ ।
యోనిదోషంరక్తదోషందాహపిత్తకఫాన్ జయేత్ ॥
అశ్వత్థవృక్షస్యఫలానిపక్వాన్యతీవహృద్యానిచశీతలాని ।
కుర్వంతిపిత్తాస్రవిషార్తిదాహవిచ్ఛర్దిరోషారుచినాశనాని ॥

తా॥ రావి జీర్ణము కాకుండును. చలువజేయును మరియు పిత్తము శ్లేష్మము వ్రణము రక్తదోషము యోనిదోషము రజోదోషము తాపము పిత్తము కఫము వీటిని బోగొట్టును. బాగుగపండిన రావిపండ్లు హృదయమునకు మిక్కుటముగ మేలుజేసును. చలువజేసును. మరియు నిది పిత్తరక్తము విషపీడ తాపము వాంతి అరుచి వీనిని నశింపంజేయు.

కల్లరావి.

శ్లో॥ పరిశోన్యః ఫలీశస్స్యాత్కపినూతఃకపీతనః ॥

టీక॥ 1 పరిశ 2 ఫలీశ 3 కపినూత 4 కపీతన యీ 4 న్ను కళ్ళరావిపేర్లు.

కల్లరావి గుణము.

శ్లో॥ పారిశాశ్వత్థకోవృష్యస్స్నిగ్ధః శ్లేష్మకృమిప్రదః ।
శీతఃకషాయోమధురః పిత్తాసృగ్వహ్నిదీపనః ॥

తా॥ కళ్ళరాని వీర్యవృద్ధికరముగను జిగటుగను శీతలముగను వెగటుగను మాధుర్యముగనునుండు. శ్లేష్మము సలిపురుగులు వీటిని గలుగజేయు. మరియు నిది పిత్తరక్తమును బోగొట్టును. జాతరాగ్నిని వృద్ధిజేయును.

జువ్వి.

శ్లో॥ ప్లక్షఃకపీతనఃశృంగీసుపార్శ్వశ్చారుదర్శనః ।
ప్లవంగోగర్దభాండశ్చకమండలువటీప్లవాః ।
పూగస్సుంగోప్రరోహశ్చససీతశ్శీతవీర్యకః ॥

టీక॥ 1 ప్లక్ష 2 కపీతన 3 శృంగీ 4 సుపార్శ్వ 5 చారుదర్శన 6 ప్లవంగ 7 గర్దభాండ 8 కమండులు 9 వటీ 10 ప్లవా 11 పూగ 12 సుంగప్రరోహ 13 ససీత 14 శీతవీర్యక యీ 14 న్ను జువ్విపేర్లు.

జువ్వి గుణము.

శ్లో॥ ప్లక్షశ్చశీతలస్నిగ్ధశ్శోఫఘ్నోస్త్రవ్రణనాశనః ॥

తా॥ జువ్వి శీతలముగను జిగటగనునుండు. ఇది శోఫ వ్రణము వాతము వీట్లను హరించును.

నేరేడు.

శ్లో॥ జంబూస్సురభిపత్రాచ రాజజంబూర్మహాఫలా ।
సౌరభీచమహాస్కంధామహాజంబూర్నగస్యపే ॥

టీక॥ 1 జంబూ 2 సురభిపత్రా 3 రాజజంబూ 4 మహాఫలా 5 సౌరభీ 6 మహాస్కంధా 7 మహాజంబు యీ 7 న్ను నేరేడుపేర్లు.

నేరేడు గుణము.

శ్లో॥ రాజజంబూతుమధురాకోష్ణాచతువరామతా ।
స్వర్యామలస్తంభకరీశ్వాసశోషశ్రమాపహా ।
ముఖజాడ్యాతిసారఘ్నీకఫకాసవినాశినీ ।
రాజజంబూఫలంస్వాదువిష్టంభిగురురోచనం ॥

తా॥ నేరేడు మధురముగను కించిదుష్ణముగను వగరుగను మలబద్ధకారిగనుండు. కంఠమునకు మేలుజేయును. మరియు నిది శ్వాస శోష బడలిక ముఖరోగము అతిసారము కఫము కాసము వీటిని నశింపజేయు. వీనిపండ్లు మధురముగను మలబద్ధకారిగను గురువుగను రుచిగనునుండు.

టీక॥ 1 కాకోదుంబరికా 2 ఫల్గు 3 రాజఫల్గు 4 శివాటికా 5 ఫల్గుణీ 6 ఫలహారీ 7 మలాయూ 8 శ్విత్రభేషజ 9 రాజావర్త 10 వృధస్కంధ 11 చపలా 12 ఛద్రకీ యీ 12 న్ను బ్రహ్మమేడి పేళ్ళు.

బ్రహ్మమేడి గుణము.

శ్లో॥ కఫపిత్తహరా గ్రాహీ కుష్ఠకండూ వ్రణాపహః ।
రక్తపిత్తహరా పాండుశోఫహరా పరం ॥

తా॥ బ్రహ్మమేడి మలబద్ధకారిగనుండు. మరియు నిది కఫము పిత్తము కుష్ఠువు దురద వ్రణము రక్తపిత్తము పాండువు శోఫ వీటిని నివర్తింపంజేయు.

పంచక్షీర వృక్షములు.

శ్లో॥ వటః ప్లక్షస్త్వథాశ్వత్థః పరిశస్త్వాదుమ్బరః ।
పంచైతే క్షీరవృక్షాశ్చ తేషాం త్వక్పంచవల్కలాః ॥

టీక॥ 1 ఱ్ఱి 2 జువ్వి 3 రావి 4 కళ్ళరావి 5 మేడి అనునీ యీ 5 న్ను క్షీరవృక్షములు. పట్టలు పంచవల్కలములనంబడు.

క్షీరవృక్షముల గుణము.

శ్లో॥ క్షీరవృక్షా హిమావృష్యా యోనిదోషవ్రణాపహాః । శోఫపిత్తకఫాస్రఘ్నా స్తన్యాభగ్నాస్థియోగదాః । తేషాంపత్రం హిమంగ్రాహికఫవాతాస్రనుల్లఘుః । ఫలంవిష్టంభిసంగ్రాహి రక్తపిత్తకఫాపహం॥ త్వక్పంచకంహిమంగ్రాహివ్రణశోఫవిసర్పజిత్ । కేచిత్తుపారిశస్థానేశిరీషంవేతసంపరే ॥

తా॥ పైజెప్పిన పంచక్షీరవృక్షములు శీతలముగను వీర్యవృద్ధికరముగను చనుబాలను వృద్ధిజేయునదిగను విరిగినయెముకలను నొకటిగ జేర్చునదిగనునుండు. మఱియు నిది యోనిదోషము వ్రణములు వాపు పిత్తము కఫము రక్తదోషము వీటిని నివర్తింపంజేయు. పైక్షీరవృక్షముల ఆకులు శీతలముగను మలబద్ధకారిగను చులకనగనునుండు, కఫము వాతము రక్తదోషము వీనిని బోగొట్టును. వీటిపండ్లు మలబద్ధమునుజేసును. మలమును గట్టిపరచును. రక్తపిత్తము కఫము వీటిని హరించును. పైజెప్పిన పంచవల్కలములు శీతలముగనుండు. మలమును గట్టిపరచును వ్రణములు వాపు విసర్పము వీనిని బోగొట్టును. కళ్ళరావికిబదులు దిరిసెనమును గ్రహించవలయుననుట కొందరిమతము. ప్రబ్బలినిగ్రహించవలయుననుట మరికొందరిమతము.

పాలచెట్టు.

శ్లో॥ క్షీరీ వోక్తాతు రాజన్యా క్షీరవృక్షో౽శుకో నృపః ।
రాజాదనో ద్రుమస్కంధః కపిష్ఠః ప్రియదర్శనః ।
దుగ్ధికా క్షత్రియా వశ్యా క్రూరకందా కపిప్రియా ।
జలకామా స్వాదుఫలా ప్రోక్తా మృదుఫలా చసా ॥

టీక॥ 1 క్షీరి 2 రాజన్యా 3 క్షీరవృక్ష 4 అంశుక 5 నృప 6 రాజాదన 7 ద్రుమస్కంధ 8 కపిష్ఠ 9 ప్రియదర్శన 10 దుగ్ధికా 11 క్షత్రియా 12 వశ్యా 13 క్రూరకందా 14 కపిప్రియా 15 జలకామా 16 స్వాదుఫలా 17 మృదుఫలా యీ 17 న్ను పాలచెట్టు పేళ్లు.

పాలచెట్టు గుణము.

శ్లో॥ స్నిగ్ధం స్వాదు కషాయంచ్చ రాజాదనఫలం గురు ।
గర్భకారిభవేద్వాయునాశకం ప్రకీర్తితం ॥

తా॥ పాలపండు జిగటగను రుచికరముగను వగరుగను గురువుగను గర్భకారిగనుండు. మరియు నిది వాతమును బోగొట్టును.

విరిగిచెట్టు.

శ్లో॥ శ్లేష్మాతకః కర్బుదారుః పిచ్ఛిలో భూతపాదపః ।
దేవకస్సురభిర్దారు శ్లేష్మసంభూతవారకః ॥

టీక॥ 1 శ్లేష్మాతక 2 కర్బుదారు 3 పిచ్ఛిల 4 భూతపాదప 5 దేవక 6 సురభి 7 దారు 8 శ్లేష్మసంభూతవారక యీ 8 న్ని విరిగిచెట్టు పేళ్ళు.

విరిగి గుణము.

శ్లో॥ శ్లేష్మాతకః కటుస్స్వాదు స్తృష్ణాసర్వవిషాపహాః ।
కేశవృద్ధికరశ్చైవనిజాగంతువ్రణాపహాః ॥

తా॥ విరిగి కారముగను రుచికరముగను కేశవృద్ధికరముగనునుండు. మరియు నిది దప్పి సర్వవిషములు తనంతట నే పుట్టువ్రణములు యితరసంబంధమువలన గలిగెడు వ్రణములు వీటిని నశింపజేయు.

### జమ్మి.

శ్లో॥ శమీశుక్లఫలాతుంగా కేశహంత్రీఫలాశివా ।
ఈశానశ్శంకరోలక్ష్మీ ర్మంగల్యా పాపనాశనీ ।
పవిత్రాస్నిగ్ధపత్రాచబలాకర్కటికాబలాః ॥

టీక॥ 1 శమీ 3 శుక్లఫలా 3 తుంగా 4 కేశహంత్రీ 5 ఫలా 6 శివా 7 ఈశాన 8 శంకర 9 లక్ష్మీ 10 మంగల్యా 11 పాపనాశనీ 12 పవిత్రా 13 స్నిగ్ధపత్రా 14 బలా 15 కర్కటికా 16 అబలా యీ 16 న్ను జమ్మిపేళ్ళు.

### జమ్మిగుణము.

శ్లో॥ శమీశీతాగురుస్స్వాద్వీరూక్షోష్ణా కేశనాశినీ ।
విసర్పవ్రణకాసఘ్నీప్రదరంహంతిశీలనం ॥

తా॥ జమ్మి శీతలముగను గురుత్వముగను రుచికరముగను రూక్షముగను ఉష్ణముగనునుండు. మరియు నిది విసర్పరోగము వ్రణము దగ్గురోగము ప్రదరరోగము వీటిని నివర్తింపఁజేయు. మరియు నిది కేశములను నశింపఁజేయు.

### రేగు.

శ్లో॥ బదరీకోలకంకోలంసౌవీరంఫేనిలంకుజం ।
కువలంబదరకర్కంధూర్గుడసంచలికాగుహా ।
శంఖినీసూక్ష్మపత్రాచబహుకంటకినీతథా ॥

టీక॥ 1 బదరీ 2 కోల 3 కంకోల 4 సౌవీర 5 ఫేనిల 6 కుజ 7 కువబదర 8 కర్కంధూ 9 గుడసంచలికా 10 గుహా 11 శంఖినీ 12 సూక్ష్మపత్రా 13 బహుకంటకినీ యీ 13 న్ను రేగుపేళ్ళు.

### రేగుగుణము.

శ్లో॥ బదరఃకటుకఃస్వాదురమ్లోష్ణఃకఫవాతహా ।
పక్వంపిత్తానిలహరంస్నిగ్ధంచమధురంపరం ।
పురాణంవాతశమనంముఖ్యంగ్నిదీపనంలఘు ॥

తా॥ రేగు కారముగను రుచికరముగనునుండు. ఇది ఆమ్లపిత్తము కఫము వీటిని బోగొట్టు. దీనిఫలము జిగటగను మధురముగనునుండు. మరియు పిత్తము వాతము వీటిని హరించు. దీనిచూర్ణము చులకనగనుండు. మరియు నిది వాతము ఆమశంక వీటిని నివర్తింపఁజేయుటయేగాక అగ్నిదీపనమును సదా కలుగఁజేయు.

వెణుతురు.

శ్లో॥ కరీరంగూఢపత్రంతుశాకపుష్పంమృదూఫలం ।
గ్రంధిలంతీక్ష్ణసారంచకరకంతీక్ష్ణకంటకః ।
వేల్లంతరోదీర్ఘపత్రోవీరద్రుర్బహువారకః ।
దృఢమూలోదీర్ఘమూలోబహుధావనఇత్యపి ॥

టీక॥ 1 కరీర 2 గూఢపత్ర 3 శాకపుష్ప 4 మృదూఫల 5 గ్రంధిల 6 తీక్ష్ణసార 7 కరక 8 తీక్ష్ణకంటక 9 వేల్లంతర 10 దీర్ఘపత్ర 11 వీరద్రు 12 బహువారక 13 దృఢమూల 14 దీర్ఘమూల 15 బహుధావన యీ 15 న్ను వెణుతురు పేళ్ళు.

వెణుతురు గుణము.

శ్లో॥ వేల్లంతరోశ్మనుద్గ్రాహీ కఫకృచ్ఛ్రానిలార్తిజిత్ ।
మూత్రదోషంవిషంహన్తిరక్తాతీసారముల్బణం ॥

తా॥ వెణుతురు అశ్మరీరోగము మలబంధము కఫము మూత్రకృచ్ఛ్రము వాతరోగము మూత్రదోషము విషము మిక్కుటమైన నెత్తురుభేదులు వీటిని నివర్తింపంజేయును.

ఓక.

శ్లో॥ కరమర్దకమావిఘ్నంసుషేణంపాణిమర్దకం ।
కరామ్లంకరమర్దంచకృష్ణాపాకఫలంమతం ॥

టీక॥ 1 కరమర్దక 2 అవిఘ్న 3 సుషేణ 4 పాణిమర్దక 5 కరామ్ల 6 కరమర్ద 7 కృష్ణా 8 పాకఫల యీ 8 న్ని ఓక పేళ్ళు.

ఓక గుణము.

శ్లో॥ కరమర్దీగురూష్ణామ్లంరక్తపిత్తకఫప్రదం ।
తత్పక్వంమధురంరుచ్యంలఘుపిత్తసమీరజిత్ ॥

తా॥ ఓకకాయ గురువుగను ఉష్ణముగను పుల్లగనునుండు. మరియు రక్తపిత్తము కఫము వీనినిజేసును. ఓకపండు తియ్యగను రుచిగను చులకనగనునుండు. పిత్తము వాతము వీనిని బోగొట్టును.

కడిమి.

శ్లో॥ ధారాకదంబః ప్రావృష్యః గంధపుష్పోహరిప్రియః ।
సుపూరోవృత్తపుష్పశ్చసురాఖ్యః హరిప్రాటికః ।
నీపోదూళికపంచాస్యోస్సుగంధఃకర్ణపూరకః ॥

టీక॥ 1 ధారాకదంబ 2 ప్రావృష్య 3 గంధపుష్ప 4 హరిప్రియ 5 సుపూర 6 వృత్తపుష్ప 7 సురాహ్వ 8 సర్వరాటిక 9 నీప 10 ధూళిక 11 పంచాస్య 12 సుగంధ 13 కర్ణపూరక యీ 13 న్ను కడిమిపేళ్ళు.

కడిమి గుణము.

శ్లో॥ కదంబస్తుకషాయస్స్యాత్ పిత్తశ్లేష్మవ్రణాపహః ।
విషదోషహరశ్చైవరక్తస్రావనిబర్హణః ॥

తా॥ కడిమి వగరుగనుండు. మరియు నిది పిత్తము శ్లేష్మము వ్రణము విషము రక్తము స్రవించుట వీటిని నివర్తింపంజేయు.

పిన్నకానుగు.

శ్లో॥ శాకోటకో భూతవాసో గోజాకర్కశపత్రకః ।
అజాక్షీరవినాశీ చ సుస్పర్శః ఫలపీఠకః ।
కరంజో నక్తమాలశ్చ పూతికశ్చిరబిల్వకః ।
పూతికర్ణః ప్రకీర్ణశ్చ మంజరీ పుష్పమంజరీ ॥

టీక॥ 1 శాకోటక 2 భూతవాస 3 గోజా 4 కర్కశపత్రక 5 అజాక్షీరవినాశి 6 సుస్పర్శ 7 ఫలపీఠక 8 కరంజ 9 నక్తమాల 10 పూతిక 11 చిరబిల్వక 12 పూతికర్ణ 13 ప్రకీర్ణ 14 మంజరీ 15 పుష్పమంజరీ యీ 15 న్ను పిన్నకానుగుపేళ్ళు.

పెద్దకానుగు.

శ్లో॥ ఘృతపూరః కరంజో న్యః ప్రకీర్యో గౌర ఏవ చ ।
వక్త్రాహ్వో గుడపుష్పశ్చ గుచ్ఛకో గజకచ్ఛపః ।
స్నిగ్ధః కరంజకశ్చైవ సోమవల్కశ్చ సంస్కృతః ।
గజకంటః షడ్గ్రంథిర్భా హస్తివారుణీ ।
వ్రణహారీ మహావృక్షో హస్తిరోహిణీప్రియా ॥

టీక॥ 1 ఘృతపూర 2 కరంజ 3 ప్రకీర్య 4 గౌర 5 వక్త్రాహ్వ 6 గుడపుష్ప 7 గుచ్ఛక 8 గజకచ్ఛప 9 స్నిగ్ధ 10 కరంజక 11 సోమవల్క 12 గజకంటక 13 షడ్గ్రంథిభా 14 హస్తివారుణీ 15 వ్రణహారీ 16 మహావృక్ష 17 హస్తిసీ 18 రోహిణీప్రియా యీ 18 న్ను పెద్దకానుగుపేళ్ళు

మద్ది గుణము.

శ్లో॥ సదీసర్జఃకటుశ్శీతో వ్రణదాహానిలాపహః।
కుష్ఠకండూతిశమనో బిడాలస్యవిషాపహః ॥

తా॥ మద్ది కారముగను శీతలముగనునుండు. మరియు నిది వ్రణము తాపము వాతము కుష్టువు దురద మార్జాలవిషము వీటిని నివర్తింపఁజేయు.

ప్రబ్బలి.

శ్లో॥ వేతసోనిచుళఃప్రోక్తో వంజులో దీర్ఘపత్రకః ।
కలనో మంజరీనమ్రస్సుషేణో గంధపుష్పకః .

టీక॥ 1 వేతస 2 నిచుళ 3 వంజుళ 4 దీర్ఘపత్రక 5 కలవ 6 మంజరీ 7 నమ్ర 8 సుషేణ 9 గంధపుష్పక యీ 9 న్ని ప్రబ్బలిపేళ్ళు.

నీరుప్రబ్బలి.

శ్లో॥ నాదేయోమేఘపుష్పశ్చజలకాంక్షోనికుంజకః ।
జలూకో భూతకశ్చైవవిదళో జలవేతసః॥

టీక॥ 1 నాదేయ 2 మేఘపుష్ప 3 జలకాంక్ష 4 నికుంజక 5 జలూక 6 భూతక 7 విదళ 8 జలవేతస యీ 8 న్ని నీరుప్రబ్బలిపేళ్లు.

ప్రబ్బలి గుణము.

శ్లో॥ వేతసఃక్రిమిగుల్మఘ్నో వాతజిత్ కుక్షిశూలజిత్ ॥

తా॥ ప్రబ్బలి క్రిమిరోగము గుల్మరోగము వాతము కడుపునొప్పి వీటిని నశింపఁజేయు.

ఉలిమిరి.

శ్లో॥ వరుణఃశ్వేతపుష్పశ్చతిక్తశాకఃకుమారకః ।
శ్వేతద్రుమోబోధివృక్షస్తిక్తాహ్వోమారుతశ్చసః॥

టీక॥ 1 వరుణ 2 శ్వేతపుష్ప 3 తిక్తశాక 4 కుమారక 5 శ్వేతద్రుమ 6 బోధివృక్ష 7 తిక్తాహ్వ 8 మారుత యీ 8 న్ని ఉలిమిరిపేళ్లు.

ఉలిమిరి గుణము.

శ్లో॥ వరుణఃకటుతిక్తోష్ణఃకఫమేదోగ్నిమాంద్యనుత్ ।
శూలగుల్మాదివాతంచహంతివస్తింసవిద్రధిం॥

తా॥ ఉలిమిరి కారముగను చేదుగను ఉష్ణముగనుండు. మరియు నిది కఫము మేదోరోగము అగ్నిమాంద్యము శూల గుల్మరోగము వాతము పొత్తికడుపునొప్పి విద్రధిరోగము వీటిని నివర్తింపంజేయు.

ఇ రు గు డు.

శ్లో॥ శింశపాపికశాలీచమహాగుప్తారసా ।
తీక్ష్ణదూర్వారుణాకృష్ణాబృహత్పుష్పాథకుంజరః ॥

టీక॥ 1 శింశిపా 2 పికశాలీ 3 మహాగుప్తా 4 రసా 5 తీక్ష్ణదూర్వా 6 అరుణా 7 కృష్ణా 1 బృహత్పుష్ప 9 కుంజర యీ 9 న్ని ఇరుగుడు పేళ్ళు.

ఇరుగుడు గుణము.

శ్లో॥ శింశపోష్ణామహాగేన్మేహార్శకుష్ఠశ్విత్రవమిక్రిమీన్ ।
వస్తిరుగ్వ్రణదాహాస్రగర్భపాతవినాశినీ ॥

తా॥ ఇరుగుడు ఉష్ణముగనుండు. మరియు మేహము కుష్ఠువు శ్విత్రము వాంతి కృములు వస్తిరోగము వ్రణము తాపము రక్తదోషము వీనిని పోగొట్టును. మరియు నిది గర్భపాతముజేసును.

వే గి స.

శ్లో॥ అనంతాచమహాసర్జస్త్వసనస్తుమహారసః ।
ప్రియకోబీజకస్శ్యామశ్శౌరిబంధూకపుష్పకః ।
ప్రియసాలకనిర్యాసోనీలకశ్చాసనాంఘ్రికా ॥

టీక॥ 1 అనంతా 2 మహాసర్జ 3 అసన 4 మహారస 5 ప్రియక 6 బీజక 7 స్యామ 8 శౌరి 9 బంధూకపుష్పక 10 ప్రియసాలకనిర్యాస 11 నీలక 12 అస నాంఘ్రికా యీ 12 న్ను వేగిసపేళ్లు.

వేగిస గుణము.

శ్లో॥ అనంతోవాతపిత్తఘ్నోదీపనీవ్రణశోధనః ॥

తా॥ వేగిస వాతము పిత్తము వ్రణము వీటిని పోగొట్టుటయేగాక అగ్నిదీపనమును సగా గలుగంజేయు.

బూ రు గు.

శ్లో॥ శాల్మలీరక్తపుష్పాచకుక్కుటీచిరజీవికా ।
పిచ్ఛిలాతూలినీమోచాకంటకాఢ్యాసుపుష్పికా॥

టీక॥ 1 శాల్మలీ 2 రక్తపుష్పా 3 కుక్కుటీ 4 చిరజీవికా 5 పిచ్ఛిలా 6 తూలినీ 7 మోచా 8 కంటకాఢ్యా 9 సుపుష్పికా యీ 9 న్ని బూరుగుపేళ్ళు.

బూరుగు గుణము.

శ్లో॥ శాల్మలీశీతలాస్నిగ్ధాశుక్లశ్లేష్మవివర్ధనీ।
అతిసారప్రశమనీరక్తపిత్తవినాశినీ॥

తా॥ బూరుగ శీతలముగను జిగటగనునుండు. మరియు నిది అతిసారము రక్తపైత్యము వీటిని నివర్తింపంజేయుటయేగాక ధాతుపుష్టి శ్లేష్మపుష్టి వీటిని సగా గలుగంజేయు.

బూరుగుబంక.

శ్లో॥ శాల్మలీవేష్టకఃపిచ్ఛానిర్యుక్తస్సారశాల్మలి।
మోచస్రావోమోచరసోమోచనిర్యాసకస్మృతః॥

టీక॥ 1 శాల్మలీవేష్టక 2 పిచ్ఛా 3 నిర్యుక్త 4 సారశాల్మలీ 5 మోచ 6 స్రావ 7 మోచరస 8 మోచనిర్యాస యీ 8 న్ను బూరుగుబంక పేళ్లు.

బూరుగుబంక గుణము.

శ్లో॥ శాల్మలీశీతగుణకోగురుస్నిగ్ధోతిసారజిత్।
ఆయుర్వృద్ధికరోవృష్యఃగుల్మప్రదరనాశనః॥

తా॥ బూరుగుబంక శీతలముగను గురుత్వముగను జిగటగనునుండు. మరియు నిది అతిసారము ప్రదరరోగము గుల్మరోగము కర్ణరోగము విషవేగము వీటిని నివర్తింపంజేయుటయేగాక ధాతుపుష్టి ఆయుర్వృద్ధి వీటిని సగా గలుగంజేయు

మొక్కపుచెట్టు.

శ్లో॥ ముష్కకోమోక్షకోముష్కోమూర్వణోమంజకస్తథా।
క్షీరశ్రేష్ఠోథగోలీఢోద్విపదఃశ్వేతకృష్ణకః॥

టీక॥ 1 ముష్కక 2 మోక్షక 3 ముష్క 4 మూర్వణ 5 మంజక 6 క్షీరశ్రేష్ఠ 7 గోలీఢ 8 ద్విపద 9 శ్వేతకృష్ణక యీ 9 న్ని మొక్కపుచెట్టుపేళ్లు.

మొక్కపుచెట్టు గుణము.

శ్లో॥ మోక్షకఃకఫవాతఘ్నోగ్రాహీహింగుల్మవిషకృమీన్।
హంత్యుష్ణోవస్తిరుక్కుందమాంతత్పుష్పంకఫపిత్తజిత్।
నిర్యాసోస్యపరంవృష్యశ్శ్లేష్మపిత్తానిలాపహః॥

తా॥ మొక్కపుచెట్టు ఉష్ణముగను మలబద్ధకారిగనునుండు. మరియు నిది కఫవాతము గుల్మము విషము నులిపురుగులు వ శిరోగము దురద వీనిని బోగొట్టును. దీని పూలు కఫపిత్తమును బోగొట్టును. దీనిబంక మిక్కుటముగ శుక్రమును వృద్ధిజేసును. మరియు శోష పిత్తము వాతము వీటిని బోగొట్టును.

## ఏపి.

శ్లో॥ శాలస్సజకారసస్సజకశ్శ్రీకృన్మారిచపత్రకః ॥

టీక॥ 1 సాల 2 సజకరస 3 సజక 4 శ్రీకృత్ 5 మారిచపత్రక యీ 5 న్ను ఏపిచెట్టుపేర్లు.

## ఏపి గుణము.

శ్లో॥ సాలోగ్రాహీవ్రణశ్లేష్మవిద్రధగుగ్వమనుద్ధిమః ॥

తా॥ ఏపి మలబద్ధకారిగను చల్లగనునుండు. మరియు నిది వ్రణము శ్లేష్మము కాలుటచే గలిగిన వ్రణములు విషము వీనిని బోగొట్టును.

## మల్లె.

శ్లో॥ మల్లికాశీతభీరుశ్చమదయంతీప్రమోదినీ ।
మదనీయాగవాక్షీచభూపదీఅష్టపదీతథా ।
భద్రవల్లీచసాప్రోక్తాచంద్రవల్లీచమాధవీ ॥

టీక॥ 1 మల్లికా 2 శీతభీరు 3 మదయంతీ 4 ప్రమోదినీ 5 మదనీయా 6 గవాక్షీ 7 భూపదీ 8 అష్టపదీ 9 భద్రవల్లి 10 చంద్రవల్లి 11 మాధవీ యీ 11 న్ను మల్లెపేర్లు.

## మల్లె గుణము.

శ్లో॥ మల్లికోష్ణాకటుస్స్వాదు వారయత్యాస్యజాన్గదాన్ ॥
సంత్రాసయతినేత్రోత్థరుజంపిత్తసమీరనుత్ ॥

తా॥ మల్లె ఉష్ణముగను కారముగను రుచిగనునుండు. మరియు నిది ముఖరోగములు నేత్రరోగము పిత్తము వాతము వీటిని బోగొట్టును.

## ఏకుమల్లె.

శ్లో॥ వాసంతికాత్రిపుటాన్యాసప్తసుపుష్పాచశుభప్రియా ॥
త్రిపుటాష్టపదానందాసన్నామూర్ధబంధనా ॥

టీక॥ 1 వార్షికా 2 త్రిపుటా 3 వ్యస్త్ర 4 సురూపా 5 శుభప్రియా 6 శ్రీపదా 7 షట్పదా 8 నందా 9 సవర్ణా 10 ముక్తబంధనా యీ 10 న్ను ఏరుమల్లె పేళ్లు.

ఏరుమల్లె గుణము.

శ్లో॥ వార్షికాకాకటుతిక్తోష్ణావాతజిత్ కుక్షిశోఫజిత్ ॥

తా॥ ఏరుమల్లె కారముగను చేదుగను ఉష్ణముగనునుండు. మరియు నిది వాతము కడుపునొప్పి వాపు వీటిని నివర్తింపం జేయు.

జాజి.

శ్లో॥ జాతీమనోజ్ఞాసుమనారాజపుత్రీప్రియంవదా ।
మాలతీహృద్యగంధాచ శ్వేతికాచైవభామినీ ।
రుచిరారాత్రిపుష్పాచరాజ్ఞీ కుసుమనాచసా ॥

టీక॥ 1 జాతీ 2 మనోజ్ఞా 3 సుమనా 4 రాజపుత్రీ 5 ప్రియంవదా 6 మాలతీ 7 హృద్యగంధా 8 శ్వేతికా 9 భామినీ 10 రుచిరా 11 రాత్రిపుష్పా 12 రాజ్ఞీ 13 సుమనా యీ 13 న్ను జాజి పేర్లు.

జాజి గుణము.

శ్లో॥ జాతీతుతిక్తకటుకావాతపిత్తకఫాస్రనుత్ ।
ముఖదంతరుజంనేత్రవ్రణాన్హంతిశిరోరుజం ॥

తా॥ జాజి చేదుగను కారముగనునుండు. మరియు నిది వాతము పిత్తము కఫము రక్తదోషము ముఖరోగము దంతరోగము నేత్రరోగము వ్రణములు శిరోరోగము వీటిని నివర్తింపం జేయు.

వసంతకాలపు మల్లె.

శ్లో॥ వాసంతీప్రహసంతీచసావసంతావసంతజా!
శోభనాశీతసంవాసాసిష్టాభ్రమరబాంధవా॥
విమలారాత్రిపుష్పీచఖేదకాతృణభామినీ ॥

టీక॥ 1 వాసంతీ 2 ప్రహసంతీ 3 వసంతా 4 వసంతజా 5 శోభనా 6 శీతసంవాసా 7 సిష్టా 8 భ్రమరబాంధవా 9 విమలా 10 రాత్రిపుష్పీ 11 ఖేదకా 12 తృణభామినీ యీ 12 న్ను వసంతకాలపు మల్లెపేర్లు.

తా॥ సంపెంగి మిగుల శీతలముగను వీర్యవృద్ధికరముగను పరిమళముగనునుండు మరియు నిది సర్పవిషము మేహము నేత్రరోగము వీటిని నివర్తింపఁజేయు.

## చేమంతి.

శ్లో॥ తరుణీరామతరుణీకర్ణికాచారుకేసరీ ॥
మహాకుమారీగంధాఢ్యాద్విరేఫాగణసమ్మతా ।
కుంజకాశతపత్రీచబృహత్పుష్పామహాసహా ॥

టీక॥ 1 తరుణీ 2 రామతరుణీ 3 కర్ణికా 4 చారుకేసరీ 5 మహాకుమారీ 6 గంధాఢ్యా 7 ద్విరేఫా 8 గణసమ్మతా 9 కుంజకా 10 శతపత్రీ 11 బృహత్పుష్పా 12 మహాసహా యీ 12 న్ను చేమంతి పేళ్ళు.

## ఎఱ్ఱచేమంతి

శ్లో॥ రక్తాపరారక్తపుష్పాలాక్షాపుష్పాతిమంజులా ॥

టీక॥ 1 రక్తపుష్పా 2 లాక్షాపుష్పా 3 అతిమంజులా యీ 3 న్ను యెఱ్ఱ చేమంతి పేళ్ళు.

## చేమంతి గుణము.

శ్లో॥ తరుణీపుష్పసౌగంధకేశవృద్ధికరీన్నృణాం ।
శిరోక్షిమేహాశమనీరక్తపైత్త్యానిలంజయేత్ ॥

తా॥ చేమంతి పరిమళముగను కేశవృద్ధికరముగనునుండు. మరియు నిది శిరోరోగము నేత్రరోగము మేహరోగము రక్తపైత్త్యము వాతము వీటిని బోగొట్టును.

## అడవిమొల్ల.

శ్లో॥ యూధికాబాలపుష్పాతుపుణ్యగంధాగుణోజ్వలా ।
గణికాచారుమోదాచశిఖండీస్వర్ణయూథికా ।
సువర్ణయూథీహారిణీశ్వేతాధవళయూధికా॥

టీక॥ 1 యూధికా 2 బాలపుష్పా 3 పుణ్యగంధా 4 గుణోజ్వలా 5 గణికా 6 చారుమోదా 7 శిఖండీ 8 స్వర్ణయూధికా 9 సువర్ణయూధీ 10 హారిణీ 11 శ్వేతా 12 ధవళయూధికా యీ 12 న్ను అడవిమొల్ల పేళ్ళు.

### అడవిమొల్ల గుణము.

శ్లో॥ యూధికాతి క్తకటుకావాతపైత్యకఫాపహా ।
ముఖదంతశిరోనేత్రరోగాన్ హన్తివ్రణానపి ॥

తా॥ అడవిమొల్ల చేదుగను కారముగనునుండు. మరియు నిది వాతము పైత్యము కఫము ముఖరోగము శిరోరోగము నేత్రరోగము వ్రణము వీటిని నశింపజేయు.

### మొల్ల.

శ్లో॥ కుందఃసుమకరందశ్చసదాపుష్పోమనోహరః ।
అట్టహాసోభృంగసుహృత్ శుక్లశాల్యోదనోపమః ।

టీక॥ 1 కుంద 2 సుమకరంద 3 సదాపుష్ప 4 మనోహర 5 అట్టహాస 6 భృంగసుహృత్ 7 శుక్ల 8 శాల్యోదనోపమ యీ 8 న్ని మొల్లపేర్లు.

### మొల్ల గుణము.

శ్లో॥ కుందస్యాచ్ఛీతలోత్యంతంభ్రమదాహశిరోర్తిజిత్ ।
విషలోచనరోగఘ్నోవిజ్ఞేయోవైద్యపారగైః ॥

తా॥ మొల్ల మిగుల శీతలముగనుండు. మరియు నిది భ్రమము దాహము శిరోరోగము విషము నేత్రరోగము వీటిని నివర్తింపజేయు.

### పచ్చమొల్ల.

శ్లో॥ అతిలోమోపరిమ్లాన స్తథా వామ్లాతకస్మృతః ॥

టీక॥ 1 అతిలోమ 2 పరిమ్లాన 3 అమ్లాతక యీ 3 న్ను పచ్చమొల్లపేర్లు.

### పచ్చమొల్ల గుణము.

శ్లో॥ అతిలోమాశీతపిత్తరుధిరాక్షిరుజాపహం ॥

తా॥ పచ్చమొల్ల శీతలముగనుండు. మరియు నిది పిత్తము రక్తదోషము నేత్రరోగము వీటిని బోగొట్టును.

### ఎఱ్ఱగురువింద

శ్లో॥ అతిముక్తోమాధవీతువసన్తోధపరాక్రమః।
అలీనకఃకార్ముకశ్చమండలభ్రమర స్తథా ॥

## మోదుగు.

శ్లో॥ కింశుకోరక్తపుష్పశ్చ వాతపుష్పోథయాగికః ।
క్షారశ్రేష్ఠపలాశశ్చ బీజస్నేహాస్సమిద్వరః ।
వాతపోతో సమీరాన్మృక్షుస్సువృతో బ్రహ్మవిక్షుకః ।
కృష్ణవృంతఃక్రిమిఘ్నశ్చ త్రివృతస్సమిదుత్తమః ॥

టీక॥ 1 కింశుక 2 రక్తపుష్ప 3 వాతపుష్ప 4 యాగిక 5 క్షారశ్రేష్ఠ 6 పలాశ 7 బీజస్నేహ 8 సమిద్వర 9 వాతపోత 10 సమీర్మృక్ష 11 సువృత 12 బ్రహ్మవిక్షుక 13 కృష్ణవంత 14 క్రిమిఘ్న 15 త్రివృత 16 సమిదుత్తమ యీ 16 న్ని మోదుగుపేళ్లు.

## మోదుగు గుణము.

శ్లో॥ కింశుకఃకటుతిక్తోష్ణఃప్లీహశ్లేష్మసమీరజిత్ ।
గ్రహణీగుల్మశూలఘ్నో రజోదోషనివారణః ॥

తా॥ మోదుగు కారముగను చేదుగను ఉష్ణముగనునుండు. మరియు నిది ప్లీహము శ్లేష్మము వాతము గ్రహణి గుల్మము శూల కుసుమరోగము వీటిని నివర్తింపం జేయు.

గద్య॥ ఇతి ధన్వంతరీయే నిఘంటౌ నానాద్రవ్య పర్యాయ గుణ ప్రకాశే పంచమ ఆమ్రాదివర్గః.



శ్రీరస్తు.

# ధన్వంతరినిఘంటువు.

## సువర్ణాద్యనుక్రమణిక.

శ్లో॥ సువర్ణరౌప్యతామ్రాణిత్రపురీతిశ్చసీసకం । కాంస్యంలోహం కృష్ణలోహంబహువర్ణాగిరిర్ధరా । శుభ్రాభ్రిగంధకాశ్చైవ రసలోహాస్తథైవచ।గ్రహదోషప్రశమనంవర్ణాయుర్బలవర్ధనం॥ తైలంసర్పిర్దధిపయఃక్షౌద్రంశుక్తంచకాంజికం। సురాచమజ్జికాచైవ జలంచపరికీర్తితాః । పానాయనాభిషేకాయ నశ్యాయాలోడనాయచ । భేషజానాంప్రయోజ్యంస్యాత్ యథా యోగంయథావిధి। రక్తశాలీశంబరశ్చ శ్వేతశాలీయవాస్తథా। గోధూమాఃకోద్రవామాషాఃఅవిస్కంధాస్తథాఢకాః । పురుష స్త్రీవపుర్వాణివాతపిత్తకఫాస్తథా । అస్థిమాంసంవసారక్తం శుక్లంమజ్జాలధారసః । ఇమానిసస్తధాతూనిజ్ఞాతవ్యానిభిష గ్వరైః।హస్త్యశ్వోష్ట్రఖరాశ్చైవశృంగిణోవ్యాఘ్రకేసరీ । వరాహోలావకస్తిత్తిరస్యేషాంమాంసంప్రయోజ్యంచబృంహణం । శ్వేమూషకబిడాలానాంసృగాలకపిబర్హిణాం। ద్వీపేభశుకయో శ్చైవ శారికాచక్రవాసయోః । హంసకుక్కుటకాకానాం కోకిలోలూకభోగినాం । బకాదీనాంచవిణ్మూత్ర మాంసత్వ గ్రోమశోణితైః । ధూపందద్యాజ్జ్వరార్తేభ్య ఉన్మత్తేభ్యో విశేషతః । అపస్మారాదిభూతేభ్యో గ్రహార్తేభ్యస్తథైవచ । యోగానేతాన్ప్రయుంజీతపురుషోనిత్యమాత్మవాన్।ప్రాప్నుయాద్ధాయురారోగ్యం బలంవర్ణంనసంశయః । సువర్ణాది చయాంపదాః షష్టిశ్చపరికీర్తితాః ॥

టీక॥ సువర్ణ - బంగారు - రౌప్య - వెండి - తామ్ర - రాగి-త్రపు - తగరము - రీతి - ఇత్తడి - రాజరీతి - బంగారుయిత్తడి - సీసకం - సీసము - కాంస్య - కంచు - లోహం - ఉక్కు - కృష్ణలోహం - ఇనుము - బహువర్ణ - ఇసుక - గిరి-పర్వతము - ధరా - భూమి - శుభ్రా - చవటినేల - అభ్ర - అభ్రకము గంధక - గంధకము - రసలోహ - పాదరసము - తైలం - నూనె - సర్పిక - నెయ్యి - దధి - పెరుగు - పయః - పాలు - క్షౌద్రం - తేనె - శుక్తం - ఆమ్లవిశేషము - కాంజికం - కలి - సురా - మద్యము - మజ్జికా - మజ్జస్సు - జల - ఉదకము - రక్తశాలీ - ఎఱ్ఱరాజనాలు - శంబర - నల్లరాజనాలు - శ్వేతశాలీ - తెల్లరాజనాలు - యవా - యవలు - గోధూమా - గోధుమలు - కోద్రవా - ఆళ్ళు - మాషా - మినుములు - ఆవిస్కంధా - పెసలు - అఢకా - కందులు - పురుష - పురుషుడు - స్త్రీ-ఆడది-వపుః-శరీరము-వాణి-సరస్వతి - వాత - వాతము - పిత్త - పిత్తము - కఫ - శ్లేష్మము - అస్థి - ఎముక - మాంస - మాంసము - వసా - మాంసములోనిక్రొవ్వు - రక్త - రక్తము - శుక్ల - శుక్లము - మజ్జా - ఎముకలోనిక్రొవ్వు - రస - రసధాతువు - హస్తి - ఏనుగు - అశ్వ-గుఱ్ఱము - ఉష్ట్రీ - లొట్టిపిట్ట - ఖరా - గాడిదె - శృంగి - కొమ్ములుగలజంతువులు - వ్యాఘ్రీ - పులి - కేసరి - సింహము - వరాహ - పంది - మృగ - జింక - శ్వ - కుక్క - మూషక - ఎలుక - బిడాలా - పిల్లి - సృగాల - నక్క - కపి - కోతి - బర్హిణ - నెమలి - ద్విరేఫ - తుమ్మెద - శుక - చిలుక - శారికా - గోరువంకపక్షి - చక్రవాక - చక్రవాకపక్షి - హంస - హంస - కుక్కుట - కోడి - కాకానాం - కాకి-కోకిల - కోకిల - ఉలూక - గుడ్లగూబ - భోగి - పాము - బక - కొంగ.

## సువర్ణాదివర్గప్రారంభః.

### బంగారు.

శ్లో॥ సువర్ణంకనకంరుక్మంశాతకుంభంచకాంచనం । జాంబూనదం జాతరూపంహిరణ్యంహేమహాటకం॥చామీకరంచారురత్నం తపనీయంచపీతకం । శ్రీకేతనంభూషణార్హం చారురూపంచ తత్స్మృతం।గర్భమష్టాపదంస్వర్ణంకల్యాణంచారుపుష్పకం । గాంగేయంకర్బురంప్రోక్తంమహారజతమేవచ ॥

టీక॥ 1 సువర్ణ 2 కనక 3 రుక్మ 4 శాతకుంభ 5 కాంచన 6 జాంబూనద 7 జాతరూప 8 హిరణ్య 9 హేమహాటక 10 చామీకర 11 చారురత్న 12 తపనీయ 13 పీతక 14 శ్రీకేతన 15 భూషణార్హ 16 చారురూప 17 గర్భ 18 అష్టాపద 19 స్వర్ణ 20 కల్యాణ 21 చారుపుష్పక 22 గాంగేయ 23 కర్బుర 24 మహారజత యీ 24 న్ను బంగారు పేళ్ళు.

### బంగారు గుణము.

శ్లో॥ సువర్ణంశీతలంవృష్యంబల్యంగురురసాయనమ్॥
కాన్తికారంవిషోన్మాదత్రిదోషజ్వరశోషజిత్ ।
కషాయంతిక్తమధురంసువర్ణంగురులేఖనమ్ ॥

తా॥ బంగారు శీతలముగను వీర్యవృద్ధికరముగను బలకరముగను గురువుగను ఆయురారోగ్యముల వృద్ధిచేయునదిగ నుండును. కాంతినిచ్చును. విషము ఉన్మాదము త్రిదోషములు జ్వరము శోష వీటిని పోగొట్టును. వగరుగను చేదుగను మధురముగను గురుత్వముగను లేఖనకారిగనునుండు.

### వెండి.

శ్లో॥ రౌప్యంసౌధంసితంతారంరజతంత్రపురూపకం ।
శుభంస్థూలంవసుశ్రేష్ఠంరుచిరంశ్వేతకంమనం ॥
చంద్రహాసంచంద్రవపుఃచంద్రభూతిర్మహాశుభం ॥

టీక॥ 1 రౌప్య 2 సౌధ 3 సిత 4 తార 5 రజత 6 త్రపురూపక 7 శుభ 8 స్థూల 9 వసుశ్రేష్ఠ 10 రుచిర 11 శ్వేతక 12 మన 13 చంద్రహాస 14 చంద్రవపుః 15 చంద్రభూతి 16 మహాశుభ యీ 16 న్ను వెండిపేళ్ళు.

## వెండి గుణము.

శ్లో॥ రూప్యంశీతంసరంవాతపిత్తహారిరసాయనమ్ ।
లేఖనంచకషాయామ్లంవిపాకేచాపరంరసమ్ ।
వయస్స్థాపనంస్నిగ్ధంధాతూనాంహితముచ్యతే ॥

తా॥ వెండి శీతలముగను వేగముగలదిగను బలకరముగను లేఖనకారిగను వగరుగను పుల్లగను పాకమువలన ఉత్తమమైన రసముగలదిగను జిగటగనునుండు. వయస్సును స్థాపించును. ధాతువులకు హితముచేయును. మరియు వాతము పిత్తము వీటిని బోగొట్టును.

## రాగి.

శ్లో॥ తామ్రంమ్లేచ్ఛముఖంశుల్బంరక్తకంరక్తధాతుకం ।
దుంబరంత్ర్యంబకంచవిద్యాత్తంకరవీరకం ।
నేపాళీయంతథాప్రాహుస్సర్వధాతుకనీయసం ।
సర్వలోహపవిత్రంస్యాదరిష్టంబ్రహ్మవర్చసం ।
అరవిందంసులోహంచతథైవచరవిప్రియం ॥

టీక॥ 1 తామ్ర 2 మ్లేచ్ఛముఖ 3 శుల్బ 4 రక్తక 5 రక్తధాతుక 6 ఉదుంబర 7 త్ర్యంబక 8 విద్యాత్త 9 కరవీరక 10 నేపాళీయ 11 సర్వధాతుకనీయస 12 సర్వలోహపవిత్ర 13 అరిష్ట 14 బ్రహ్మవర్చస 15 అరవింద 16 సులోహ 17 రవిప్రియ యీ 17 న్ను రాగిపేళ్ళు.

## రాగి గుణము.

శ్లో॥ తామ్రంచతిక్తంమధురంకషాయంకఫవాతనుత్ ।
ఉష్ణంప్లీహంహన్తికుష్ఠందుర్నామక్షయపాండునుత్ ॥

తా॥ రాగి చేదుగను మధురముగను వగరుగను ఉష్ణముగనునుండు. మరియు నిది కఫము వాతము ప్లీహము కుష్టువు దుర్నామరోగము క్షయము పాండువు వీటిని బోగొట్టును.

## తగరము.

శ్లో॥ త్రపుకంత్రపుమాలీనంరంగంవంగంచచిద్బటం ॥
గురుశ్రేష్ఠంసలవణంకరటీనీలికాఘునం ॥

టీక॥ 1 త్రపుక 2 త్రపు 3 మాలీన 4 రంగ 5 వంగ 6 చిప్పిట 7 గురు 8 శ్రేష్ఠ 9 నలపణ 10 కరటీ 11 నీలికా 12 ఘున యీ 12 న్ను తగరము పేర్లు.

తగరపు గుణము.

శ్లో॥ త్రపుకంతి క్తముష్ణంచవిషవాతహరంపరం ।
మేహశ్లేష్మామయఘ్నంచక్రిమిక్భృచ్ఛ్రివినాశనం ॥

తా॥ తగరము చేదుగను ఉష్ణముగనునుండు. మరియు నిది విషము వాతము మేహము శ్లేష్మము క్రిమిరోగము మూత్రకృచ్ఛ్రము వీనిని నశింపఁజేయు.

ఇత్తడి.

శ్లో॥ రీతిస్సులోహకంపీతంకపిలోహంసువర్ణకం ।
సారఃపింగళకశ్చైవనిష్ఠూరంచారుకుండలం ।
ప్రోక్తంసింహాలకంచైవమునిభిర్ధాతుకంటకః ॥

టీక॥ 1 రీతి 2 సులోహక 3 పీత 4 కపిలోహ 5 సువర్ణక 6 సార 7 పింగళక 8 నిష్ఠుర 9 చారుకుండల 10 సింహాలక 11 ధాతుకంటక యీ 11 న్ను యిత్తడి పేళ్ళు.

బంగారుయిత్తడి.

శ్లో॥ రాజరీతిస్సృతారాజీరాజపుత్రీమహేశ్వరీ ।
బ్రాహ్మణీబ్రహ్మరీతిశ్చకపిలాపింగళాపిచ ॥

టీక॥ 1 రాజరీతి 2 రాజీ 3 రాజపుత్రీ 4 మహేశ్వరీ 5 బ్రాహ్మణీ 6 బ్రహ్మరీతి 7 కపిలా 8 పింగళా యీ 8 న్ని బంగారుయిత్తడి పేళ్ళు.

ఇత్తడి గుణము.

శ్లో॥ రీతికాకటుకాత్యుష్ణాపిత్తప్లీహాసమీరజిత్ ।
రూక్షాకఫాస్రపిటికాకుష్ఠఘ్నీకాయకాంతిదా ॥

తా॥ ఇత్తడి కారముగను మిక్కిలి ఉష్ణముగను రూక్షముగనునుండు. మరియు నిది పిత్తము ప్లీహము వాతము కఫము రక్తదోషము పిటికలు కుష్టువు వీటిని పోగొట్టుటయేగాక శరీరకాంతిని గలుగఁజేయు.

## సీసము.

శ్లో॥ సీసకంనాగమురగంభుజంగంకృష్ణకంవిషః ।
యవనేష్టంవిశిష్టంచయోగేష్టంభజపిష్టకం ।
బ్రహ్మదారుమలంప్రోక్తంతథాచపరిపిష్టకం ।
ధాతోర్ద్విశోధనంవంగంమృదుచాపిప్రకీర్తితం ॥

టీక॥ 1 సీసక 2 నాగ 3 ఉరగ 4 భుజంగ 5 కృష్ణక 6 యవనేష్ట 9 విశిష్ట 10 యోగేష్ట 11 భజపిష్టక 12 బ్రహ్మదారుమల 13 పరిపిష్టక 14 ధాతోర్ద్విశోధన 13 వంగ 14 మృదు యీ 14 న్ను సీసముపేళ్ళు.

## సీసపు గుణము.

శ్లో॥ సీసకంప్రోక్తమత్యుష్ణంతిక్తంవాతకఫాపహం ।
ప్రమేహబహుమూత్రఘ్నందీపనంచాగ్నిమాంద్యజిత్ ॥

తా॥ సీసము అత్యుష్ణముగను చేదుగనునుండు. మరియు నిది వాతము కఫము ప్రమేహము బహుమూత్రము అగ్నిమాంద్యము వీటిని నివర్తింపజేయుటయేగాక అగ్నిదీపనమును సగా గలుగంజేయు.

## కంచు.

శ్లో॥ కాంస్యంలోహంనిజంఘోషంప్రకాశ్యంకంసకంబలం।
అనాలోహంపట్టలోహంపంచలోహంచనీలికా ।
ఘోషపుష్పంచపరితంవైద్యవిద్భిరుదాహృతం ॥

టీక॥ 1 కాంస్య 2 లోహ 3 నిజ 4 ఘోష 5 ప్రకాశ్య 6 కంసక 7 బల 8 అనాలోహ 9 పట్టలోహ 10 పంచలోహ 11 నీలికా 12 ఘోషపుష్ప 13 పరిత యీ 13 న్ను కంచుపేళ్ళు.

## కంచు గుణము.

శ్లో॥ కాంస్యంగురూష్ణంచక్షుష్యంకఫపిత్తహరంపరమ్ ।
రూక్షంకషాయంరుచ్యంచలఘుదీపనపాచనం ॥

తా॥ కంచు గురువుగను ఉష్ణముగను నేత్రహితకారిగను వేగముకలదిగను రూక్షగను వగరుగను రుచిగను లఘువుగనునుండు. మరియు నిది కఫము పిత్తము ను బోగొట్టుటయేగాక అగ్నిదీపనము పాచనము వీట్లను సగా గలుగంజేయు.

## ఉక్కు.

శ్లో॥ అశ్మలోహంఘనంపిండంతీక్ష్ణంపారశవంమతం ।
అయఃకృష్ణాయసంపీరంచర్మరంకృష్ణలోహకం ॥

టీక॥ 1 అశ్మలోహ 2 ఘన 3 పిండ 4 తీక్ష్ణ 5 పారశవ 6 అయః 7 కృష్ణాయస 8 పీర 9 చర్మర 10 కృష్ణలోహక యీ 10 న్ని ఉక్కు పేళ్ళు.

## ఉక్కు గుణము.

శ్లో॥ కృష్ణాయసంకటుతీక్ష్ణంకఫపాండువినాశనం ।
కాసశ్వాసహరంబల్యంవృద్ధాయుర్దేహవర్ధనం ।
పిత్తంచసర్వయధుంహన్తిగుల్మశూలానిలాపహం ॥

తా॥ ఉక్కు కారముగను తీక్ష్ణముగను బలకరముగను ఆయుర్వృద్ధికరముగను దేహపుష్టికరముగనునుండు. మరియు నిది కఫము పాండువు కాసము శ్వాసము పిత్తము వాపు గుల్మము శూల వాతము వీటిని నివర్తింపంజేయు.

## ఇనుము.

శ్లో॥ లోహంశస్త్రింఘనంపిండంకుష్టపారిప్లవంతథా ।
నారసింహబలంతీక్ష్ణంభీమరంకృష్ణలోహకం ॥

టీక॥ 1 లోహ 2 శస్త్రి 3 ఘన 4 పిండ 5 కుష్టపారిప్లవ 6 నారసింహ 7 బల 8 తీక్ష్ణ 9 భీమర 10 కృష్ణలోహక యీ 10 న్ని యినుము పేళ్ళు.

## ఇనప గుణము.

శ్లో॥ తీక్ష్ణంవిపాకమధురంతువరామ్లసారం । తిక్తంచదాహశమనం జఠరాగ్నికృత్స్యాత్ । శోఫార్శప్లీహజ్వరకామలశోణితఘ్న మోజస్కరంస్థిరవయస్కరణంచవృష్యం ॥

తా॥ ఇనుము పరిపాకమువలన మధురముగను వగరుగను పుల్లగను చేదుగను నుండు. మరియు నిది దాహము శోఫ అర్శస్సు ప్లీహము జ్వరము కామిల రక్తదోషము వీటిని నివర్తింపంజేయుటయేగాక అగ్నిదీపనము బలము వయస్థైర్యము ధాతుపుష్టి వీటిని సగా గలుగంజేయు.

## ఇ సు క.

శ్లో॥ వాలుకాసికతాశీతాలోహమాతాభ్రమరోహిణీ।
నానాధాతుమయీచైవబహువర్ణాతిథైవచ ॥

టీక॥ 1 వాలుకా 2 సికతా 3 శీతా 4 లోహమాతా 5 అభ్రమరోహిణీ 6 నానాధాతుమయీ 7 బహువర్ణా యీ 7 న్ను యిసుకపేళ్ళు.

## ఇసుక గుణము.

శ్లో॥ సికతాశీతళంకుర్యాత్తప్తోరఃక్షతవాతజిత్ ॥

తా॥ ఇసుక శీతలముగనుండు. దీనిని వెచ్చజేసికాపడమిచ్చిన రొమ్మునొప్పి వాతము యివి నివర్తించు.

## ప ర్వ త ము.

శ్లో॥ పర్వతశ్శిఖరశ్శృంగిగోత్రశైలోగిరిర్నగః।
ధరోద్రిరచలశ్శ్రీమాన్ అశ్మాగ్రావాశిలోచ్చయః॥

టీక॥ 1 పర్వత 2 శిఖర 3 శృంగి 4 గోత్ర 5 శైల 6 గిరి 7 నగ 8 ధర 9 అద్రి 10 అచల 11 శ్రీమత్ 12 అశ్మన్ 13 గ్రావన్ 14 శిలోచ్చయ యీ 14 న్ను పర్వతముపేళ్లు.

## పర్వతపు గుణము.

శ్లో॥ పర్వతారోహణంకుర్యాత్కాయసిద్ధిత్రిదోషజిత్ ।
జపసిద్ధికరంపుణ్యంవ్రతచర్యాఫలప్రదం ॥

తా॥ పర్వతవాసముచేసిన కాయసిద్ధి జపసిద్ధి పుణ్యము వ్రతఫలము యివి కలుగుటయేగాక త్రిదోషములు నివర్తించు.

## భూ మి.

శ్లో॥ శంబరీమేదినీకాంతాభూతమాతావసుంధరా ।
గౌఃపృథ్వీధరణీభూమిఃధరిత్రీక్షితిరేవచ ।
ఉర్వరావిపులానంతాధాత్రీవసుమతీధరా ।
ప్రతిష్ఠామహీమాతాచచతురంతాచలక్షమా ॥

టీక॥ 1 శంబరీ 2 మేదినీ 3 కాంతా 4 భూతమాతా 5 వసుంధరా 6 గౌః 7 పృధ్వీ 8 ధరణీ 9 భూమి 10 ధరిత్రీ 11 క్షితి 12 ఉర్వరా 13 విపులా 14 అనంతా 15 ధాత్రీ 16 వసుమతీ 17 ధరా 18 ప్రతిష్ఠా 19 మహీ 20 మాతా 21 చతురంతా 22 అచలక్షమా యీ 22 న్ను భూమిపేళ్లు.

భూమి గుణము.

శ్లో॥ శంబరీసర్వసస్యాఢ్యా ఫలితావృక్షజాతయః ।
శయనంజ్వరరక్తఘ్నంపాణిపాదాగ్నినాశనం ॥

తా॥ భూమి సమస్త ఓషధులు వృక్షములు వీటిని ఫలింపంజేయు. మరియు దీనిపైన శయనించిన జ్వరము రక్తదోషము అరిచేతులు అరికాళ్ళు వీటియందలి మంట యివి నివర్తించు.

చవటినేల.

శ్లో॥ శ్వేతా శ్వేతనికాశుభ్రాధవళాపాండరాసితా।
పాంకశుక్లాతథాధాతురూషరఃక్షితిదూషణః ॥

టీక॥ 1 శ్వేతా 2 శ్వేతనికా 3 శుభ్రా 4 ధవళా 5 పాండరాసితా 6 పాంకశుక్లా 7 ధాతు 8 ఊషర 9 క్షితిదూషణ యీ 9 న్ని చవటినేలపేళ్ళు.

చవటినేల గుణము.

శ్లో॥ ఊషరస్సర్వసస్యానాంనాశకఃపిత్తకృత్పరం ।
కుష్ఠగుల్మహరశ్శైత్యవస్వయధుజ్జ్వరపాండునుత్ ॥

తా॥ చవటిమన్ను సమస్తపైరులు కుష్టువు గుల్మము వాపు జ్వరము పాండువు వీటిని నశింపంజేయు. మరియు నిది పిత్తమును గలుగంజేయు.

అభ్రికము.

శ్లో॥ అభ్రికంస్వచ్ఛమాకాశంపటలంవరపీతకం ।
నిర్మలంపర్వతోద్భూతంతథాపర్వతసంభవం ॥

టీక॥ 1 అభ్రిక 2 స్వచ్ఛ 3 ఆకాశ 4 పటల 5 వరపీతక 6 నిర్మల 7 పర్వతోద్భూత 8 పర్వతసంభవ యీ 8 న్ని అభ్రికముపేళ్ళు.

అభ్రిక గుణము.

శ్లో॥ అభ్రికంగురుహిమంబల్యంకుష్ఠమేహాతిదోషనుత్ ॥

తా॥ అభ్రకము గురువుగను శీతలముగను బలకారిగనునుండు. మరియు కుష్ఠువు మేహము త్రిదోషములు వీనిని బోగొట్టును.

## గంధకము.

శ్లో॥ గంధస్సౌగన్ధికోలేఖీగన్ధాశ్మాగంధపీతకః ।
లేలీతకోబలివసానైగన్ధోగన్ధకోబలిః ॥

టీక॥ 1 గంధ 2 సౌగంధిక 3 లేఖీ 4 గంధాశ్మా 5 గంధపీతక 6 లేలీతక 7 బలివసా 8 నైగంధ 9 గంధక 10 బలి యీ 10 న్ని గంధకముపేళ్ళు.

## గంధకపు గుణము.

శ్లో॥ గంధకఃకటుకఃపాకేవీర్యోష్ణఃపిత్తలస్సరః ।
హన్తికుష్ఠక్షయప్లీహకఫవాతాన్రసాయనః ॥

తా॥ గంధకము పాకము వలన కారముగను ఉష్ణవీర్యముగలదిగను బలకరముగను వేగము కలదిగనునుండు. పిత్తమునుజేయును. మరియు నిది కుష్ఠువు క్షయము ప్లీహము కఫము వాతము వీనిని బోగొట్టును.

## పారదరసము.

శ్లో॥ పారదంరుద్రరేతశ్చరసలోహంమహారసః ।
రసశ్రేష్ఠంచలంసూతంపారదియ్యంరసోత్తమం ।
హారబీజంహారశ్శూలీరసేంద్రోభవజోరసః ।
త్రిలోచనఃప్రభుశ్శాంతోజీవాత్మాసూతకోఘనః ॥

టీక॥ 1 పారద 2 రుద్రరేత 3 రసలోహ 4 మహారస 5 రసశ్రేష్ఠ 6 చల 7 సూత 8 పారదియ్య 9 రసోత్తమ 10 హారబీజ 11 హార 12 శూలీ 13 రసేంద్ర 14 భవజ 15 రస 16 త్రిలోచన 17 ప్రభు 18 శాంత 19 జీవాత్మ 20 సూతక 21 ఘన యీ 21 న్ని పాదరసముపేళ్ళు.

## పాదరస గుణము.

శ్లో॥ పారదంక్రిమికుష్ఠఘ్నంచక్షుష్యంచరసాయనం ।
జరాభీతిప్రహరణంగ్రహభూతనివారణమ్ ॥

తా॥ పాదరసము బలకరముగను నేత్రములకు హితకరముగనునుండు మరియు నిది క్రిమిరోగము కుష్ఠము ముసలితనము గ్రహపీడ భూతబాధ వీటిని నివర్తింపం జేయును.

## సువర్ణాద్యవాంతరతైలాదివర్గప్రారంభః.

### నూనె.

శ్లో॥ తైలంస్నేహోత్తమంఖ్యాతంతిలజంతిలసంభవం ।
అభ్యంజనంపాపహారంవపుర్మర్దనకంస్మృతం ॥

టీక॥ 1 తైల 2 స్నేహోత్తమ 3 తిలజ 4 తిలసంభవ 5 అభ్యంజన 6 పాపహార 7 వపుర్మర్దనక యీ 7 న్ని నూనెపేళ్ళు.

### నూనె గుణము.

శ్లో॥ తైలంతిలోద్భవంస్వాదుతిక్తోష్ణంకఫవాతజిత్ ।
కండూకుష్ఠహరంబల్యంవపుస్నిగ్ధత్వకృత్పరం ।
క్రిమిదోషప్రశమనంశుక్లకృన్మేహనాశనం ॥

తా॥ మంచినూనె రుచికరముగను చేదుగను ఉష్ణముగను బలకరముగనునుండు. మరియు నిది కఫము వాతము దురద కుష్టువు క్రిమిరోగము మేహము వీటిని నశింపజేయుటయేగాక శరీరమునకు నునుపు వీర్యవృద్ధి వీటిని సగా గలుగంజేయు.

### నెయ్యి.

శ్లో॥ ఘృతమాజ్యంహవిస్సర్పిః పవిత్రంనవనీతజం ।
అమృతంచాభిఘారంచజీవనీయంచకీర్తితం ॥

టీక॥ 1 ఘృత 2 ఆజ్య 3 హవిః 4 సర్పిః 5 పవిత్ర 6 నవనీతజ 7 అమృత 8 అభిఘార 9 జీవనీయ యీ 9 న్ని నెయ్యిపేళ్లు.

### నెయ్యి గుణము.

శ్లో॥ ఘృతంత్రిదోషశమనంమేహాపస్మారతాపజిత్ ।
విషగ్రహాదిభూతఘ్నంబలవర్ణకరంపరం ॥

తా॥ నెయ్యి త్రిదోషములు మేహము అపస్మారము తాపము విషము గ్రహపీడ భూతబాధ వీటిని నివర్తింపంజేయుటయేగాక బలము దేహకాంతి వీటిని సగా గలుగంజేయు.

### పెరుగు.

శ్లో॥ దధిక్షీరవికారంచమాంగల్యంక్షీరపిండకం ।
సుసితాంశుకాంసల్యంక్షీరసంభవమేవచ ॥

టీక॥ 1 దధి 2 క్షీరవికార 3 మాంగల్య 4 క్షీరపిండక 5 నవనీతాంశు 6 కాంపిల్య 7 క్షీరసంభవ యీ 7 న్ను పెరుగుపేళ్లు.

పెరుగు గుణము.

శ్లో॥ దధిస్యాచ్ఛీతలంచోష్ణశమనంరక్తపైత్యజిత్ ।
వపుర్వృద్ధికరంవృష్యంప్రమేహంకామిలాంజయేత్ ॥

తా॥ పెరుగు శీతలముగనుండు. మరియు నిది ఉష్ణము రక్తపైత్యము ప్రమేహము కామిల వీటిని నివర్తింపంజేయుటయే గాక శరీరపుష్టి వీర్యవృద్ధి వీటిని సగా గలుగంజేయు.

పెరుగుమీాదినీళ్ళు.

శ్లో॥ దధ్నస్తూపరియత్తోయంతన్మస్తుపరికీర్తితం ॥

టీక॥ పెరుగుమీాదినీళ్ళు మస్తు అని జెప్పంబడు.

పెరుగుమీాదినీళ్ళ గుణము.

శ్లో॥ మస్తూష్ణందీపనంచైవవాతశ్లేష్మహరంలఘు ।
ఆనాహశూలవిధ్వంసీపిత్తస్యజనకంమతం ॥
తథాభ్రమహరంప్రోక్తంచక్షుష్యంశీతలప్రదం ।
జ్వరరక్తామయంహంతితృష్ణాదాహవినాశనం ॥

తా॥ పెరుగుమీాదినీళ్ళు శీతలముగనుండు. మరియు నిది వాతము శ్లేష్మము మలమూత్రబంధము శూల భ్రమ జ్వరము రక్తదోషము దప్పి తాపము వీటిని నివర్తింపంజేయుటయే గాక అగ్నిదీప్తి పైత్యము నేత్రములకుచలవ వీటిని సగా గలుగంజేయు.

మీాగడ.

శ్లో॥ యత్తుదధ్న్యుపరిస్నిగ్ధంతన్మండమభిధీయతే ॥

టీక॥ పెరుగుమీాది జిగటగనుండు భాగము మండమనంబడు. మండమనగా పెరుగుమీాది మీాగడ.

మీాగడ గుణము.

శ్లో॥ స్నిగ్ధంసాంతానికంబల్యంరక్తపిత్తప్రశాంతికృత్ ।
స్వాదుపాకేనరుచ్యంచవిజ్ఞేయంతర్పణంగురు ॥

తా॥ పెరుగుమీదిమీగడ రక్తదోషము పిత్తము వీటిని నివర్తింపజేయుటయే గాక సంతానకరముగను బలకరముగను తృప్తికరముగను గురువుగనునుండు.

తక్రము.

శ్లో॥ మథితంగోరసోగోళంద్రవమమ్లంవిలోడితం ।
శ్వేతందండాహతంసాంద్రంకాలసేయముదస్వితం ॥

టీక॥ 1 మథిత 2 గోరస గోళ 3 ద్రవ 4 అమ్ల 5 విలోడిత 6 శ్వేత 7 దండాహత 8 సాంద్ర 9 కాలసేయ 10 ఉదస్విత యీ 11 న్ను చల్లపేర్లు.

తక్రభేదములు.

శ్లో॥ తక్రంచతుర్విధంజ్ఞేయంఘోళంమథితమేవచ ।
ఉదశ్విత్తక్రమిత్యేవంకథితానియథాక్రమమ్ ।
సరసంసర్గలంఘోలంమథితంరసవర్జితం ।
సమోదకంశ్వేతమథముదశ్విత్వర్ధవారికం ।
పాదోదకంభవేత్తక్రమర్ధాంభోన్యేవభాషిరే ॥

తా॥ ఘోళము మథితము ఉదశ్విత్తు తక్రము యిటుల చల్ల నాలుగు విధములు వాటిలో నీరుగలుపకుండా చిలికినచల్ల ఘోళమనంబడు. పెరుగుకు సమముగ నీళ్ళు పోసి చిలికినమజ్జిగ మథితమనంబడు. « మథితంజలవర్జితం » అను వాక్యము ప్రకారము నీళ్ళు గలుపకుండ చిలికినమజ్జిగ మథితమని కొందరు వచించెదరు. పెరుగుకు అరపడినీళ్లుబోసి చిలికినమజ్జిగ ఉదశ్విత్తమనంబడును. పెరుగుకు నాలవపాలు నీళ్లు బోసి చిలికినమజ్జిగ తక్రమనంబడు. అర్ధభాగము నీళ్లుబోసి చిలికినమజ్జిగనే తక్రమని మఱికొందరు వచించెదరు. « మథితమిళితఘోలంషాడబం కాలశేయంకరమథితము దశ్విత్తక్రదండాహతేచ । అతిమిళితమితీహప్రాయశః ప్రాహురాగ్యాదశవిధమరుచిఘ్నంతక్రమంబ్వంశభేదాత్ » అనువాక్యముప్రకారము జలాంశభేదముచే మథితము మిళితము ఘోళము షాడబము కాలశేయము కరమథితము ఉదశ్విత్తు తక్రము దండాహతము అతిమిళితము యిటుల చల్ల పదివిధములని కొందరు వచించెదరు.

తక్ర గుణము.

శ్లో॥ తక్రంగ్రాహికషాయామ్లంమధురందీపనంలఘు ।
వీర్యోష్ణంబలదంరూక్షంప్రీణనంవాతనాశనం ।
హంతిశోథగరచ్ఛర్దిప్రసేకవిషమజ్వరాన్ ।

పాండుమేదోగ్రహణ్యర్శోమూత్రగ్రహాభగందరాన్ ।
మేహాంగుల్మమతీసారంశూలప్లీహకఫక్రిమీన్ ।
శ్విత్రకోష్ఠకఫవ్యాపికుష్ఠతృష్ణోదరాపచీః ॥

తా॥ మజ్జిగ మలబద్ధకారిగను వగరుగను పుల్లగను తియ్యగను చులకనగను రూక్షముగను దీపనకారిగను ఉష్ణవీర్యముగలదిగను బలకరముగను తృప్తికరముగను నుండు. మరియు నిది వాతము వాపు విషము వాంతి నోటనీరూరుట విషమజ్వరము పాండువు మేదోరోగము గ్రహణి అర్శస్సు మూత్రబంధము భగందరము మేహము గుల్మము అతిసారము శూల ప్లీహము కఫము క్రిములు శ్విత్రము కోష్ఠరోగము కఫము వ్యాపించేకుష్ఠము దప్పి ఉదరరోగము అపచి వీటిని నశింపంజేయు.

పాలు.

శ్లో॥ క్షీరందుగ్ధంపయస్స్వాదురసాయనవరంస్మృతం।
సౌమ్యంప్రస్రవణంస్తన్యంవారిసాత్మ్యంచజీవితం ।
ధవళంఫేనిలంశీతంమంగళ్యంశిశువర్ధనం ॥

టీక॥ 1 క్షీర 2 దుగ్ధ 3 పయః 4 స్వాదు 5 రసాయనవర 6 సౌమ్య 7 ప్రస్రవణ 8 స్తన్య 9 వారిశాత్మ్య 10 జీవిత 11 ధవళ 12 ఫేనిల 13 శీత 14 మంగళ్య 15 శిశువర్ధన యీ 15 న్ను పాలుపేళ్లు.

పాలు గుణము.

శ్లో॥ దుగ్ధమత్యంతమధురంబలమేధాగ్నివర్ధనం ।
కార్శ్యఘ్నంబృంహణంవృష్యంహస్తపాదాంగదాహజిత్ ॥

తా॥ పాలు మిక్కిలి మధురముగను గురువుగను వీర్యవృద్ధికరముగనునుండు. మరియు నిది కృశత్వము అరిచేతులు అరికాళ్ళు వీటియందలిమంట వీటిని నివర్తింపం జేయుటయేగాక బలము సూక్ష్మబుద్ధి అగ్నిదీపనము వీటిని సగా గలుగంజేయు.

వెన్న.

శ్లో॥ ఉద్ధృతంతన్నవాద్దధ్నోనవనీతంనవోద్ధృతం॥

టీక॥ నూతనమగు పెరుగునుచిలికి యెత్తబడిన ద్రవ్యము నవనీతమనియు నవో ధృతమనియు జెప్పంబడు. ఇదియే వెన్నయనంబడు.

## వెన్న గుణము.

శ్లో॥ నవనీతంతుదుగ్ధోత్థంకషాయంమధురంహిమం ।
కఫపిత్తహరంగ్రాహివృష్యంవై నేత్రరోగహృత్ ॥

తా॥ వెన్న వగరుగను మధురముగను శీతలముగను మలబద్ధకరముగను వీర్య వృద్ధికరముగనునుండు. మరియు నిది కఫము పిత్తము నేత్రరోగము వీటిని నివర్తింపం జేయు.

## తేనె.

శ్లో॥ మధుపుష్పాసవఃపుష్పరసోమాక్షికమీరితమ్ ॥

టీక. 1 మధు 2 పుష్పాసవ 3 పుష్పరస 4 మాక్షిక యీ 4 న్ను తేనెపేర్లు.

## తేనెభేదములు.

శ్లో॥ మాక్షికంపైత్తికంక్షౌద్రంభ్రామరంమధువిస్తరాత్ ।
మాక్షికంతైలసంకాశంపైత్తికంఘృతసన్నిభం ।
క్షౌద్రంకపిలవర్ణంస్యాత్ భ్రామరంస్ఫటికోపమమ్ ॥

టీక॥ 1 మాక్షికం 2 పైత్తికం 3 క్షౌద్రం 4 భ్రామరం అని తేనె 4 విధములుగనుండు. మాక్షికమును తేనె తైలమువలెను పైత్తికమును తేనె నెయ్యివలెను క్షౌద్రమను తేనె కపిలవర్ణముగను భ్రామరమను తేనె స్ఫటికమువలెనుండు.

## తేనెసామాన్య గుణము.

శ్లో॥ మధుశీతంలఘుస్వాదురూక్షంగ్రాహివిలేఖనమ్। చక్షుష్యందీపనంస్వర్యం వ్రణశోధనరోపణమ్ । వర్ణ్యంమేధాకరంవృష్యం విశదంరోచనంజగేత్ । కుష్ఠార్శఃకాసపిత్తాసృక్ కఫమేహక్లమక్రిమీన్ । మదతృష్ణావమిశ్వాస హిక్కాతీసారహృద్గ్రహాన్।దాహక్షతక్షయాంస్త్రింతుయోగవాహ్యల్పవాతలం॥

తా॥ తేనె శీతలముగను చులకనగను తీపుగను రూక్షముగను మలబద్ధకారిగనునుండు. లేఖనము నేత్రములకు హితము వీటినిజేయును. దీపనకారిగను స్వరమునకు హితకారిగనునుండు. వ్రణములను మాన్పును. శరీరకాంతిని కలుగంజేయు. బుద్ధి శుక్రము వీటిని వృద్ధిజేయును. శోధనకారి రుచినిచ్చును. మరియు కుష్ఠము అర్శస్సు కాసము పిత్తరక్తము కఫము మేహము బడలిక క్రిములు మదము దప్పి వాంతి శ్వాసము

యొక్క ళ్ళు అతిసారము రొమ్మున పట్టుకొనుట తాపము గాయము క్షయము రక్త దోషము వీటిని హరించును. మరియు నిది స్వల్పముగ వాతమునుజేసును.

మాక్షికాదిమధు గుణము.

శ్లో॥ మాక్షికంమధుషుశ్రేష్ఠంనేత్రామయహరంలఘు ।
పైత్తికంమధురూక్షోష్ణంపిత్తదాహాస్రవాతకృత్ ।
క్షౌద్రంమాక్షికమప్యేవవిశేషాన్మేహనాశనమ్ ।
భ్రామరంరక్తపిత్తఘ్నంమూత్రజాడ్యకరంగురు ॥

తా॥ మాక్షికమను తేనె తేనెలకన్నిటికి శ్రేష్ఠమైనది. నేత్రరోగమును హరించును. చులకనగనుండు. పైత్తికమను తేనె రూక్షముగను ఉష్ణముగనునుండు. మరియు పిత్తము తాపము రక్తదోషము వాతము వీటిని గలుగంజేయు. క్షౌద్రమను తేనె మాక్షికమను తేనె గుణముగలదైయుండును. విశేషముగ మేహరోగమును బోగొట్టును. భ్రామరమను తేనె రక్తపిత్తమును హరించును. మూత్రరోగమును గలుగజేయును. గురుత్వము గలదిగనుండు.

క్రొత్తపాత తేనె గుణము.

శ్లో॥ నవీనంమధ్వభిష్యందిస్నిగ్ధంశ్లేష్మహరంపరం ।
పురాణంగ్రాహితద్రూక్షంమేదోఘ్నమతిలేఖనం ॥

తా॥ క్రొత్తతేనె మలమును విసర్జింపజేసును. జిగటగనుండును. శ్లేష్మమును హరించును. శరీరమునందతివేగముగ వ్యాపించును. పాతతేనె మలమును గట్టిపరచును. రూక్షముగను లేఖనకారిగనునుండు. మరియు మేదస్సును హరించును.

వర్జనీయమైన తేనె.

శ్లో॥ విషాదిదుష్టపుష్పేభ్యఃసవిషామాక్షికాదయః । మధుచిన్వం తితస్మాత్తత్స్వభావాత్సవిషంస్మృతం । తస్మాదగ్న్యాతపాత్తప్తంకద్రుక్తంహన్తిమానవం।ఉష్ణేకాలేచదేశేచద్రవ్యైరుక్తైశ్చయోజితం । నిరూహేంధదర్జనేతజ్జైష్ఠ్యస్తదుక్తంననివార్యతే। తస్మాత్పాకమలభైవ్యవతయోస్తద్వినివర్తతే । ఆమామయేజలేనాపితద్ద్రవేనవిరుధ్యతే ॥

తా॥ విషముతోఁగూడియుండు తేనెటీగలు విషాదులచే దుష్టమైన నానావిధ పుష్పములనుండి తేనెచేర్చుటవలన స్వభావముగ తేనె విషముతోఁగూడియుండు. కావున సూర్యకిరణములచేతను అగ్నిచేతను తప్తమైన తేనెను పానముజేసిన విషమువలెనే మనుజుని జంపును. ఉష్ణదేశమునందును యెండకాలమునందును వైద్యశాస్త్రములోఁ జెప్పియుండు ద్రవ్యములతోఁజేర్చికాచబడిన తేనెను నిరూహవస్తిభరణక్రియ వీటియందుపయోగపరచవచ్చును.

## తేనెతెట్టు.

శ్లో॥ మదనంమధుజంసిక్థంమధూచ్ఛిష్టంమధూలితం ॥

టీక॥ 1 మదన 2 మధుజ 3 సిక్థ 4 మధూచ్ఛిష్ట 5 మధూళిత యీ 5 న్ను తేనెతెట్టుపేర్లు.

## తేనెతెట్టు గుణము.

శ్లో॥ మదనంమృదుసంస్నిగ్ధంభూతఘ్నంవ్రణరోపణం ।
భగ్నసంధానకృద్వాతకుష్ఠవీసర్పరక్తజిత్ ॥

తా॥ తేనెతెట్టు మృదువుగను జిగటగనుండు. విరిగినయెముకల నొకటిగ జేర్చును. మరియు భూతబాధ వ్రణము వాతము కుష్ఠువు విసర్పిరోగము రక్తదోషము వీనిని బోఁగొట్టును.

## ఆమ్లవిశేషము.

శ్లో॥ శుక్తంసహస్రభేదంచరసామ్లంచుక్లమేవచ ॥
వివిదాభిషుతంచండంభేదనంచామ్లమేవచ ॥

టీక॥ 1 శుక్త 2 సహస్రభేద 3 రసామ్ల 4 చుక్ల 5 వివిధాభిషుత 6 చండ 7 భేదన 8 ఆమ్ల యీ 8 న్ను ఆమ్లవిశేషముపేర్లు. (అనగా మంటికుండ మొదలైనవాటియందున తేనె బెల్లము కలి యీ మూటినిగూర్చి ధాన్యరాశియందున మూడురాత్రులుంచబడిన పులుసు.)

## ఆమ్లవిశేష గుణము.

శ్లో॥ శుక్తలఘూష్ణంస్యాద్భేదిశీతళంరక్తపిత్తనుత్ ।
పాండురోగహరంశ్లేష్మహరంకటువిపాకతః ॥
మేదోఘ్నంమూత్రళంతీక్ష్ణందీపనంజరణంరసం ॥

తా॥ అమ్ల విశేషము లఘువుగను ఉష్ణముగను విరేచనకారిగను శీతలముగను పాకమువలన కారముగను తీక్ష్ణముగను రుచికరముగనునుండు. మరియు నిది రక్తపిత్తము పాండురోగము శ్లేష్మము మేదోవృద్ధి మూత్రబద్ధము వీటిని పోగొట్టుటయే గాక అగ్నిదీపనము జీర్ణము వీటిని సగా గలుగంజేయు.

## కలి.

శ్లో॥ శుక్లసారతథాశుక్లందహనీయంచసారణం ॥
కాంజికంచైవసౌవీరంకుల్మాషాభిప్లుతంతథా ।
అవంతీసోమధాన్యామ్లంఆరనాళంమహారసః ॥

టీక॥ 1 శుక్లసార 2 శుక్ల 3 దహనీయ 4 సారణ 5 కాంజిక 6 సౌవీర 7 కుల్మాషాభిప్లుత 8 అవంతీ 9 సోమధాన్యామ్ల 10 ఆరనాళ 11 మహారస యీ 11 న్ను కలిపేర్లు.

## కలి గుణము.

శ్లో॥ కాంజికంభేదితీక్ష్ణోష్ణంకఫమారుతనాశనం ।
అరుచిశ్రమదాహఘ్నంమస్తకంభ్రమనాశనం ॥

తా॥ కలి విరేచనకారిగను తీక్ష్ణమును ఉష్ణముగనునుండు. మరియు నిది కఫము వాతము అరుచి శ్రమ తాపము తలదిరుగుట వీటిని నశింపంజేయు.

## మద్యము.

శ్లో॥ మద్యంహాలాసురాశుండామదిరావరుణాత్మజా ।
సురాగంధోత్తమాకల్యాదేవసృష్టాచవారుణీ ।

టీక॥ 1 మద్య 2 హాలా 3 సురా 4 శుండా 5 మదిరా 6 వరుణాత్మజా 7 సురా 8 గంధోత్తమా 9 కల్యా 10 దేవసృష్టా 11 వారుణీ యీ 11 న్ను మద్యము పేర్లు.

## మద్య గుణము.

శ్లో॥ మద్యంపిత్తకరంప్రాయస్సరంరోచనదీపనం ।
విదాహిస్సృష్టవిణ్మూత్రంతీక్ష్ణంవాతకఫాపహం ।
విధినాన్నయుతంపీతంతస్మాదమృతసన్నిభం ॥
అన్యథాకురుతేరోగానతిపీతంవిషోపమం ॥

తా॥ మద్యము మిగుల పిత్తకారిగను శరీరమున వేగముగ వ్యాపించునదిగను రుచిగను దీపనకారిగను తీక్ష్ణముగనునుండు. తాపముజేసును. మలమూత్రముల విన జీర్ణంపజేసును. మరియు నిది వాతము కఫము వీటిని బోగొట్టును. అన్నము భుజించు నపుడు ప్రమాణానుగుణముగ పానముజేసిన అమృతమువలె దేహమునకు హితము జేసును. ప్రమాణాతీతముగ పానముజేసిన విషమువలె బరిణమించి యనేకరోగముల బుట్టించును.

మజ్జస్సు.

శ్లో॥ మజ్జికాశిఖరిణ్యుక్తారసాలాసురభిస్తథా ॥
ఉల్లేఖనిషధారమ్యాచాతుజాతంతుసంయుతా ॥

టీక॥ 1 మజ్జికా 2 శిఖరిణీ 3 రసాలా 4 సురభీ 5 ఉల్లేఖనిషధ 6 రమ్య 7 చాతుజాతర 8 సంయుతా యీ 8 న్ని మజ్జస్సుపేళ్ళు.

మజ్జస్సు గుణము.

శ్లో॥ రసస్తుబలదఃపథ్యంప్రసోహర్షణంతథా ॥

తా॥ మజ్జస్సు ఆరురసములుగలవిగను బలకరముగను పథ్యకారిగను సంతోష కరముగనునుండు.

ఉదకము.

శ్లో॥ పానీయమాపఃకీలాలంనీరంకంసలిలంజలం ।
అమృతంజీవనంతోయంవార్యంభఉదకంపయః।
మేఘపుష్పంఘనరసంనీరకంభువనంవనం ॥

టీక॥ 1 పానీయ 2 ఆపః 3 కీలాల 4 నీరక 5 సలిల 6 జల 7 అమృత 8 జీవన 9 తోయ 10 వారి 11 అంభః 12 ఉదక 13 పయః 14 మేఘపుష్ప 15 ఘనరస 16 నీరక 17 భువన 18 వన యీ 18 న్ని ఉదకముపేళ్ళు.

ఉదక గుణము.

శ్లో॥ పానీయ్యంబృహణంసౌమ్యం సంజీవనముచ్యతే।
గురుస్వభావతోయుక్తంసర్వరోగేషుచేష్యతే ॥

తా॥ ఉదకము వృద్ధికరముగను శాంతముగను రుచికరముగను ప్రాణాధారము గను గురువుగనునుండు. ఇది సమస్తరోగముల కుపయుక్తముగనుండు.

## ఎఱ్ఱరాజనాలు.

శ్లో॥ రక్తశాలీమహాశాలీగంధప్రసవశాలినీ ।
బృందారకష్షష్టికశ్చశాలినీసురభిశాలినీ ॥

టీక॥ 1 రక్తశాలీ 2 మహాశాలీ 3 గంధప్రసవశాలినీ 4 బృందారక 5 షష్టిక 6 శాలినీ 7 సురభిశాలినీ యీ 7 న్ను యెఱ్ఱరాజనాలపేళ్ళు.

## ఎఱ్ఱరాజనాల గుణము.

శ్లో॥ రక్తశాలీర్వరస్తేషాంబల్యోవర్ణ్యస్త్రిదోషజిత్ ।
చక్షుష్యోమూత్రలస్స్వర్యశ్శుక్రలస్తృడ్జ్వరాపహః ।
విషవ్రణహరఃకించిత్తస్మాదల్పగుణాఃపరే ॥

తా॥ ధాన్యములలో యెఱ్ఱరాజనాలు శ్రేష్ఠమైనది. బలము శరీరవర్ణము వీటిని గలుగంజేయును. త్రిదోషములు హరించును. నేత్రహితకారి. మూత్రమును వృద్ధి జేయును స్వరమునకు హితమైనది. శుక్రమును వృద్ధిజేసును. దప్పి జ్వరము వీటిని పోకడచును విషమును హరించును. వ్రణమును మాన్పును. తక్కినసంభాధాన్యములు యెఱ్ఱధాన్యముకంటె స్వల్పమైన గుణముగలవి.

## నల్లరాజనాలు-వాటి గుణము.

శ్లో॥ శమ్బరఃకృష్ణశాలీచహ్రాసోహృత్కణ్ఠఏవచ ।
కృష్ణాపదీగౌరవశ్చవిహాయోవివిధఃస్మృతః ॥

టీక॥ 1 శంబర 2 కృష్ణశాలీ 3 హ్రాస 4 హృత్కంఠ 5 కృష్ణాపదీ 6 గౌరవ 7 విహాయ 8 వివిధ యీ 8 న్ని నల్లరాజనాలపేళ్ళు.

తా॥ ఇది కొంచము తక్కువగ యెఱ్ఱరాజనాలగుణము కలదైయుండును.

## తెల్లరాజనాలు-వాటి గుణము.

శ్లో॥ శ్వేతశాలీమహాశాలీసాచోక్తాపర్ణశాలికా ।
ఖరశూకస్తథాప్రోక్తోనవశూకశ్చపాలవః ।
పౌష్టికస్తుమహాశ్వేతాకృష్ణవ్రీహిస్తతోనవ ॥

టీక॥ 1 శ్వేతశాలీ 2 మహాశాలీ 3 పర్ణశాలికా 4 ఖరశూక 5 నవశూక 6 పాలవ 7 పౌష్టిక 8 మహాశ్వేత 9 అకృష్ణవ్రీహి యీ 9 న్ని తెల్లరాజనాలపేళ్ళు.

తా॥ ఇదియునుగూడ కొంచము తక్కువగ యెఱ్ఱరాజనాలగుణము కలదైయుండును.

## యవలు.

శ్లో॥ యవకశ్చైవపాకశ్చరక్తసారముఖస్తథా ।
వ్రజవాసనకశ్చైవమునిభక్షః ప్రబోధకః ।
వర్ణకస్సికతాసారోజలజశ్చక్రసారకః ।
అక్షితశ్చయవశ్చైవయవనాచప్రకీర్తితా ॥

టీక॥ 1 యవక 2 పాక 3 రక్తసారముఖ 4 వ్రజవాసనక 5 మునిభక్ష 6 ప్రబోధక 7 వర్ణక 8 సికతాసార 9 జలజ 10 చక్రసారక 11 అక్షిత 12 యవ 13 యవనా యీ 13 న్ను యవలపేళ్ళు.

## యవల గుణము.

శ్లో॥ యవఃకషాయోమధురశ్శీతపిత్తకఫాస్రజిత్ । వ్రణేషుతిలవత్పథ్యోరూక్షోమేధాగ్నివర్ధనః । లేఖనోబద్ధనిస్యందఃస్వర్యో మేహతృషాపహః॥బహువాతమలస్థైర్యవర్ణకారీసపిచ్ఛిలః
అస్మాదతియవఃకించిద్గుణైర్న్యూనతరఃస్మృతః ॥

తా॥ యవలు వగరుగ మధురముగ శీతలముగనుండును. పిత్తము కఫము రక్తదోషము వీటిని హరించును. వ్రణరోగములయందు నువ్వులవలెనే పథ్యకారి. రూక్షజేసును. బుద్ధి అగ్నిదీపనము వీటిని వృద్ధిజేయును. లేఖనకారి. మలమును బంధించును. స్వరమునకు హితకారి. మేహము దప్పి వీటిని పోకడచును. వాతము మలవృద్ధి స్థైర్యము దేహవర్ణము వీటిని గలుగంజేయు. జిగటగనుండును. అతియవలు యవలకంటె నికృష్టమైనవి.

## గోధుమలు.

శ్లో॥ గోధూమోయవమశ్చైవబహుళోమ్లేచ్ఛభోజనః ।
దృఢకాంతికరోగౌరశ్చక్రీదాకీర్తిసంవృతః ॥

టీక॥ 1 గోధూమ 2 యవళ 3 బహుళ 4 మ్లేచ్ఛభోజన 5 దృఢకాంతికర 6 గౌర 7 చక్రికా 8 కీతిఞసంవృత యీ 8 న్ని గోధుమలపేళ్ళు.

## గోధుమల గుణము.

శ్లో॥ వృష్యస్స్నిగ్ధోగురుశ్శీతోబృంహణోవాతపైత్యజిత్ ।
దృఢకాన్తికరంబల్యంమూత్రదోషహరంపరం ॥

తా॥ గోధుమలు ధాతుపుష్టికరముగను జిగటగను గురువుగను శీతలముగను శరీర వృద్ధికరముగను బలకరముగనునుండును. మరియు నిది వాతము పైత్యము మూత్ర దోషము వీటిని నివర్తింపఁజేయు.

ఆ ళ్లు.

శ్లో॥ కోద్రవఃకోరదూషశ్చమదనాదోనిరూక్షకః ।
ప్రియఙ్గుకశ్చకస్సారఃపీతతండులసారకః ॥

టీక॥ 1 కోద్రవ 2 కోగదూష 3 మదనాద 4 నిరూక్షక 5 ప్రియంగుక 6 చక 7 సార 8 పీతతండులసారక యీ 8 న్ని అరిక పేళ్ళు.

అళ్ల గుణము.

శ్లో॥ కోద్రవఃశ్వాసవాతఘ్నోదీపనోలఘుమూత్రజిత్ ॥

తా॥ అళ్ళు చులకనగనుండు. మరియు నిది శ్వాస వాతము మూత్రరోగము వీటిని నివర్తింపఁజేయుటయేగాక అగ్నిదీప్తిని సగా గలుగఁజేయు.

మినుములు.

శ్లో॥ మధురామసురానూపధాన్యోమాషస్తుమాషకః ।
హారేణుఃవసతీకాలఃకరాళశ్చారుముద్గకః ॥

టీక॥ 1 మధురా 2 మసురా 3 నూపధాన్య 4 మాష 5 మాషక 6 హారేణు 7 వసతీ 8 కాల 9 కరాళ 10 చారుముద్గక యీ 10 న్ని మినుముల పేళ్ళు.

మినుముల గుణము.

శ్లో॥ మాషస్స్నిగ్ధోభవేచ్ఛ్లేష్మవాతకృద్గురుశీతళః।
శుక్లవృద్ధికరోనృణాంపుష్టికృత్ క్షయనాశనః ॥

తా॥ మినుములు జిగటగను గురుత్వముగను శీతలముగనునుండు. మరియు నిది శ్లేష్మము వాతము శుక్లవృద్ధి శరీరపుష్టి వీటిని గలుగఁజేయు. మరియు నిది క్షయ రోగమును నివర్తింపఁజేయు.

పెసలు.

శ్లో॥ అనిష్కంధఃకృష్ణముద్గోహరిమందస్సుగంధకః ।
వనస్తచణకోర్వారుకరాళస్త్రిపుటాత్మకః ॥

టీక॥ 1 అవిస్కంధ 2 కృష్ణముద్గ 3 హరిమంద 4 సుగంధిక 5 వసంత 6 చణక 7 ఉర్వారు 8 కరాళ 9 త్రిపుటాత్మక యీ 9 న్ని పెసలపేళ్ళు.

పెసల గుణము.

శ్లో॥ ముద్గఃకషాయోమధురఃపిత్తదాహాతిసారజిత్ ।
ప్రమేహశమనోవృష్యోరక్తపైత్యానిలాపహః ॥

తా॥ పెసలు వగరుగను మధురముగనునుండు. మరియు నిది పిత్తము తాపము అతిసారము ప్రమేహము రక్తపైత్యము వాతము వీటిని నివర్తింపంజేయుటయేగాక వీర్యవృద్ధిని సగా గలుగంజేయు.

కందులు.

శ్లో॥ కరమర్దస్తామ్రపర్ణః కాలవృంతఃకరీరకః ।
ఆఢకీతువరీప్రోక్తా నరక్తధాన్యోత్తమస్తథా ॥

టీక॥ 1 కరమర్ద 2 తామ్రపర్ణ 3 కాలవృంత 4 కరీరక 5 ఆఢకి 6 తువరీ 7 రక్తధాన్యోత్తమ యీ 7 న్ను కందులపేళ్ళు.

కందుల గుణము.

శ్లో॥ ఆఢకీకఫపిత్తఘ్నీగ్రహణీకృచ్ఛ్రనాశినీ ।
సమీరవ్రణదోషఘ్నీబహుమూత్రహరాపరం ॥

తా॥ కందులు కఫము పిత్తము గ్రహిణి మూత్రకృచ్ఛ్రము వాతము వ్రణము బహుమూత్రము వీటిని నశింపంజేయు.

పురుషుడు.

శ్లో॥ మనుష్యఃపురుషశ్చైవశతాయుర్నరఏవచ।
కాంతోమర్త్యఃపుమాన్కర్తాదీర్ఘప్రేషీచమానవః ॥

టీక॥ 1 మనుష్య 2 పురుష 3 శతాయుః 4 నర 5 కాంత 6 మర్త్య 7 పుమాన్ 8 కర్తా 9 దీర్ఘప్రేషీ 10 మానవ యీ 10 న్ని పురుషునిపేళ్లు.

ఆడది.

శ్లో॥ స్త్రీయోషిద్వనితాయోషా వాశితావామలోచనా । ప్రతీ
పదర్శినీశ్యామాకాంతాచైవాంగనాబలా । కోపినీకామినీభీరు
స్సుందరీచవధూస్తథా । మహిళాలలనాగౌరీప్రోక్తాసీమంతినీ

తిచ॥ప్రమదాయువతీచైవహ్యేకవాసాశ్చవర్ణినీ। నారీరామా వరారోహాసాప్రోక్తావరకామినీ । కృతాభిషేకామహిషీభోగి న్యఇతరాస్తృతాః । అవ్యక్తస్తనికాగౌరీ ఈషద్వ్యక్తాతువ ర్ణినీ। స్తనభారోన్నతాశ్యామాఏకవాసాఃప్రసూతికా ॥

టీక॥ 1 స్త్రీ 2 యోషిత్ 3 వనితా 4 యోషా 5 వాశితా 6 వామలోచనా 7 ప్రతీపదర్శనీ 8 శ్యామా 9 కాంతా 10 అంగనా 11 అబలా 12 కోపినీ 13 కామినీ 14 భీరు 15 సుందరీ 16 వధూ 17 మహిళా 18 లలనా 19 గౌరీ 20 సీమంతినీ 21 ప్రమదా 22 యువతీ 23 ఏకవాసాః 24 వర్ణినీ 25 నారీ 26 రామా 27 వరారోహా 28 వరకామినీ యీ 28 న్ని స్త్రీలకుపేర్లు. పట్టాభిషిక్తురాలైన రాజస్త్రీకి మహిషియనియు యితర రాజస్త్రీలకు భోగినియనియు వ్యక్తముగాని స్తనములుగల స్త్రీకి గౌరియనియు మొలకరించిన స్తనములుగల స్త్రీకి వర్ణినియనియు గొప్ప స్తనములుగల స్త్రీకి శ్యామయనియు ప్రసవించిన స్త్రీకి ఏకవాసయనియు నామములు వెలసిల్లు.

## శరీరము.

శ్లో॥ శరీరంశకటందేహంపురంకాయంకళేబరం ।
వపుశ్చావయవస్థానంఆత్మావ్యద్విగ్రహస్తథా ॥

టీక॥ 1 శరీర 2 శకట 3 దేహ 4 పుర 5 కాయ 6 కళేబర 7 వపుః 8 అవయవస్థాన 9 ఆత్మ 10 విగ్రహ యీ 10 న్ని శరీరముపేళ్ళు.

## సరస్వతి.

శ్లో॥ బ్రాహ్మీసరస్వతీవాణీవాగ్దేవీవచనంతథా ।
వర్ణినీభారతీభాషారసనావాగ్విభామినీ ॥

టీక॥ 1 బ్రాహ్మీ 2 సరస్వతీ 3 వాణీ 4 వాగ్దేవీ 5 వచన 6 వర్ణినీ 7 భారతీ 8 భాషా 9 రసనా 10 వాక్ 11 విభామినీ యీ 11 న్ను సరస్వతిపేళ్ళు.

## వాతము.

శ్లో॥ వాయుఃప్రభంజనఃకర్తామారుతఃశ్వసనోనిలః ।
సమీరణోమారుతశ్చపవనశ్చసదాగతిః ॥

టీక॥ 1 వాయు 2 ప్రభంజన 3 కర్తా 4 మారుత 5 శ్వసన 6 అనిల 7 సమీరణ 8 మారుత 9 పవన 10 సదాగతి యీ 10 న్ని వాతముపేళ్ళు.

## పిత్తము.

శ్లో॥ పిత్తంతేజోమయంతిక్తంశిఖివైశ్వానరోనలః ।
జ్వరకర్తాతృషాకర్తాహ్యర్కశ్చైవప్రకీర్తితః ॥

టీక॥ 1 పిత్త 2 తేజోమయ 3 తిక్త 4 శిఖి 5 వైశ్వానర 6 అనల 7 జ్వరకర్తా 8 తృషాకర్తా 9 అర్క యీ 9 న్ని పిత్తముపేళ్లు.

## శ్లేష్మము.

శ్లో॥ శ్లేష్మాకఫశ్శివశ్శీతోబలమాంసకరస్తథా ।
అనిలశ్వాసయోనిశ్చనిద్రాజనితకస్తథా ॥

టీక॥ 1 శ్లేష్మ 2 కఫ 3 శివ 4 శీత 5 బలమాంసకర 6 అనిల 7 శ్వాసయోని 8 నిద్రాజనితక యీ 8 న్ని శ్లేష్మముపేళ్లు.

## త్రిదోషము.

శ్లో॥ త్రిదోషసంభవోమోహస్సంకరోమిశ్రఏవచ।
సన్నిపాతోమతిభ్రంశస్సన్యాసోనష్టసంజ్ఞకః ॥

టీక॥ 1 త్రిదోషసంభవ 2 మోహ 3 సంకర 4 మిశ్ర 5 సన్నిపాత 6 మతిభ్రంశ 7 సన్యాస 8 నష్టసంజ్ఞక యీ 9 న్ని త్రిదోషములపేళ్ళు.

## అస్థి.

శ్లో॥ అస్థికుల్యంసుసంభూతంశల్యంస్యాద్దేహధారణం ।
సపిత్తంకీకసంశంఖంసర్వమేదస్సముద్భవం॥

టీక॥ 1 అస్థి 2 కుల్య 3 సుసంభూత 4 శల్య 5 దేహధారణ 6 సపిత్త 7 కీకస 8 శంఖ 9 సర్వమేదస్సముద్భవ యీ 9 న్ని అస్థిపేర్లు.

## మాంసము.

శ్లో॥ అమిషంలోభనంమాంసంరసంశోణితసంభవం ।
తరసంపిశితంచైవక్రవ్యంరాక్షసభోజనం ॥

టీక॥ 1 అమిష 2 లోభన 3 మాంస 4 రస 5 శోణితసంభవ 6 తరస 7 పిశిత 8 క్రవ్య 9 రాక్షసభోజన యీ 9 న్ని మాంసముపేర్లు.

## మాంసములోని క్రొవ్వు.

శ్లో॥ వసాంవరాపీవరాచమేదోమాంససముద్భవా।
సర్వస్నేహప్రధానాచవపా౽స్థిమాతృకా ॥

టీక॥ 1 వసా 2 వరా 3 పీవరా 4 మేదః 5 మాంససముద్భవా 6 సర్వస్నేహప్రధానా 7 వపా 8 అస్థిమాతృకా యీ 8 న్ని మాంసములోనిక్రొవ్వుపేర్లు.

## ర క్త ము.

శ్లో॥ రక్తంశోణితమస్రంస్యాదసృగ్లోహితమేనచ ॥
రుధిరంచామిషకరంప్రాణదంరససంభవం ॥

టీక॥ 1 రక్త 2 శోణిత 3 అస్ర 4 అసృక్ 5 లోహిత 6 రుధిర 7 ఆమిషకర 8 ప్రాణద 9 రససంభవ యీ 9 న్ని రక్తముపేర్లు.

## శు క్ల ము.

శ్లో॥ శుక్లంతేజోవపుఃపుంస్త్వంపౌరుషంహర్షసంభవం ।
మదోద్రేకకరంభీమంబీజవీర్యేంద్రియాణిచ ॥

టీక॥ 1 శుక్ల 2 తేజః 3 వపుః 4 పుంస్త్వ 5 పౌరుష 6 హర్షసంభవ 7 మదోద్రేకకర 8 భీమ 9 బీజ 10 వీర్య 11 ఇంద్రియ యీ 11 న్ను శుక్లముపేర్లు.

## ఎముకలోనిక్రొవ్వు.

శ్లో॥ అస్థిసారశ్చమజ్జాచతథాతేజో౽స్థిసంభవం ॥

టీక॥ 1 అస్థిసార 2 మజ్జ 3 తేజ 4 అస్థిసంభవ యీ 4 న్ను మజ్జ అనగా ఎముకలోని క్రొవ్వుపేర్లు.

## రసధాతువు.

శ్లో॥ సన్నిపాతప్రదంపథ్యంషడ్రసోంహ్యన్నసంభవః ॥

టీక॥ 1 సన్నిపాతప్రద 2 పథ్య 3 షడ్రస 4 అన్నసంభవ యీ 4 న్ను రసధాతువుపేర్లు.

## ఏనుగు.

శ్లో॥ హస్తిద్విపోగజోనాగఇభశ్చద్విరదఃకరీ ॥
వారణఃకుంజరోదస్తీమాతంగష్షష్టిహాయనః ॥

దంతావళోగజశ్చైవపద్మీస్తంభేరమోమతః ।
సపవకలభఃప్రోక్తఃకుంభీచకథితోబుధైః ॥

టీక॥ 1 హస్తి 2 ద్వీప 3 గజ 4 నాగ 5 ఇభ 6 ద్విరద 7 కరి 8 వారణ 9 కుంజర 10 దంతీ 11 మాతంగ 12 షష్టిహాయన 13 దంతావళ 14 గజ 15 పద్మీ 16 స్తంభేరమ 17 కలభ 18 కుంభీ యీ 18 న్ని ఏనుగుపేళ్ళు.

ఏనుగు గుణము.

శ్లో॥ కుంజరారోహణంకుర్యాత్త్రిదోషశమనంపరం ।
దుగ్ధంప్రమేహశమనంకుష్ఠగుల్మహరంపరం ॥

తా॥ ఏనుగనుయెక్కి సవారిచేసిన త్రిదోషములు శమించు. దీనిపాలు ప్రమేహము కుష్టువు గుల్మము వీటిని నివర్తింపంజేయు.

గుఱ్ఱము.

శ్లో॥ ఘోటాశ్వస్తురగోవాజీహరిర్హంసస్తురంగమః ।
శాలిహోత్రజవీసప్తిస్తురంగస్సైంధవోహయః ॥

టీక॥ 1 ఘోటా 2 అశ్వ 3 తురగ 4 వాజీ 5 హరి 6 హంస 7 తురంగమ 8 శాలిహోత్ర 9 జవీ 10 సప్తి 11 తురంగ 12 సైంధవ 13 హయ యీ 13 న్ని గుఱ్ఱముపేళ్ళు.

గుఱ్ఱపు గుణము.

శ్లో॥ అశ్వారోహణమాత్రంతుమూత్రకృచ్ఛ్రవినాశయేత్ ॥
త్రిదోషశమనంబల్యంతద్దుగ్ధంభ్రమనాశకం ॥

తా॥ అశ్వారోహణము మూత్రకృచ్ఛ్రము నశింపంజేయు. దీనిపాలు త్రిదోషములు చిత్తభ్రమ వీటిని నివర్తింపంజేయుటయేగాక శరీరమునకు బలమును సగా గలుగంజేయు.

లొట్టిపిట.

శ్లో॥ ఉష్ట్రఃక్రమేళకోఘూమ్రమఃకరభోదీర్ఘమార్గకః ।
ద్వికకుచ్ఛంకునాసశ్చదీర్ఘగ్రీవోధఘూమ్రకః ॥

టీక॥ 1 ఉష్ట్ర 2 క్రమేళక 3 ఘూమ్ర 4 కరభ 5 దీర్ఘమార్గక 6 ద్వికకుత్ 7 శంకునాస 8 దీర్ఘగ్రీవ 9 ఘూమ్రక యీ 9 న్ని లొట్టిపిటపేళ్ళు.

## లొటిపిటపాల గుణము.

శ్లో॥ ప్రమేళదుగ్ధంశీతఘ్నమర్శఃక్రిమ్యుదరాపహం ।
గ్రహాభూతప్రశమనంనష్టేంద్రియకరంపరం ॥

తా॥ లొటిపిటయొక్క పాలు శీతలము అర్శస్సు క్రిమిరోగము మహోదరము గ్రహపీడ భూతబాధ వీటిని నివర్తింపంజేయుటయేగాక వీర్యక్షీణత్వమునుబోగొట్టి ధాతుపుష్టిని గలుగంజేయు.

## గా డి దె.

శ్లో॥ గర్దభశ్శంకుకర్ణశ్చబాలేయరాసభఃఖరః ।
భారవాహీంభూరిగమోధూసరోరేణుభూషితః ॥

టీక॥ 1 గర్దభ 2 శంకుకర్ణ 3 బాలేయ 4 రాసభ 5 ఖర 6 భారవాహీ 7 భూరిగను 8 ధూసర 9 రేణభూషిత యీ 9 న్ని గాడిదపేళ్ళు.

## గాడిదెపాల గుణము.

శ్లో॥ ఖరదుగ్ధంభ్రమహరంకాయసిద్ధికరంపరం ।
కామిలామూత్రకృచ్ఛ్రఘ్నంతధావోష్ణాతిశీతళం ॥

తా॥ గాడిదయొక్క పాలు ఉష్ణముగను అతిశీతలముగనునుండు. మరియు నిది భ్రమము శరీరస్థైర్యము కామిల మూత్రకృచ్ఛ్రము వీటిని బోగొట్టును.

## మే క.

శ్లో॥ ఛాగలోబర్బరశ్ఛాగఃచలపాదస్తుబస్తకః।
బోళకశ్చైడకోజాచలంబకర్ణస్తథైవచ॥

టీక॥ 1 ఛాగల 2 బర్బర 3 ఛాగ 4 చలపాద 5 బస్తక 6 బోళక 7 ఏడక 8 అజా 9 లంబకర్ణ యీ 9 న్ని మేకపేళ్ళు.

## మేకమాంస గుణము.

శ్లో॥ అజామాంసంగురుస్నిగ్ధంశ్వాసకాసానిలాపహం ।
ప్రదరంహంతిశోషంచపిత్తఘ్నంకఫదోషజిత్ ॥

తా॥ మేకమాంసము గురువుగను జిగటగనునుండు. మరియు నిది శ్వాసము కాసము వాతము ప్రదరరోగము శోష పిత్తము కఫము వీటిని నివర్తింపంజేయు.

## గొర్రె.

శ్లో॥ తగరుర్మేండమేషౌచహుర్యురభ్రిరురణస్తథా ।
అవిర్లోమ స్తథోర్ణాయురేడకశ్చవృష్ణిరేవచ ॥

టీక॥ 1 తగరు 2 మేండ 3 మేష 4 ఉరభ్రి 5 ఉరణ 6 అవిలోమ 7 ఊర్ణాయు 8 ఏడక 9 వృష్ణి యీ 9 న్ని గొర్రెపేళ్ళు.

## గొర్రెమాంస గుణము.

శ్లో॥ తగరోర్మధురంమాంసంశీతవీర్యంత్రిదోషజిత్ ।
ప్రతిశ్యాయజ్వరహరంగురుకాంతిప్రదంనృణామ్ ॥

తా॥ గొర్రెమాంసము మధురముగను శీతవీర్యముగలదిగను గురువుగనునుండు. మరియు నిది త్రిదోషములు పీనస జ్వరము వీటిని నివర్తింపజేయుటయేగాక శరీర కాంతిని గలుగజేయు.

## ఎనుబోతు.

శ్లో॥ మహిషశ్శకునశ్శృంగిశ్యామఃకృష్ణోఘనాఘనః ।
విషాణీకురుపోదంశిపీనస్కంధోరజస్వలః ॥

టీక॥ 1 మహిష 2 శకున 3 శృంగి 4 శ్యామ 5 కృష్ణ 6 ఘనాఘన 7 విషాణీ 8 కురుప 9 దంశి 10 పీనస్కంధ 11 రజస్వల యీ 11 న్ను ఎనుబోతు పేళ్ళు.

## ఎనుబోతు గుణము.

శ్లో॥ మహిషఃసలిలప్రీతిస్సక్తోర్భారవాహకః ॥

తా॥ ఎనుబోతు ఉదకప్రీతిగలదిగను స్వశక్తిగలదిగను బరువునుమోయునదిగనునుండు.

## ఆంబోతు.

శ్లో॥ అనడ్వాంస్తుబలీవర్దఃకకుద్మాన్వృషభోవృషః ।
ఉక్షాచసౌరభేయశ్చగోపతిశ్శంకరప్రియః ॥

టీక॥ 1 అనడ్వాన్ 2 బలీవర్ద 3 కకుద్మాన్ 4 వృషభ 5 వృష 6 ఉక్ష 7 సౌరభేయ 8 గోపతి 9 శంకరప్రియ యీ 9 న్ని ఆంబోతుపేళ్ళు.

అంబోతు గుణము.

శ్లో॥ ప్రాతర్దర్శీచవృషభంకల్యాణంచఫలప్రదం।
ఐశ్వర్యంలభతేనిత్యంశంకరస్యానువాహనం॥

తా॥ అంబోతును ప్రాతఃకాలమున దర్శించిన ఫలమునిచ్చు. శుభము ఐశ్వర్యము యివి సిద్ధించు.

ఆవు.

శ్లో॥ తస్యపుత్రీభానుమతీగౌరశ్చసురభిర్వసు।
మాహేయీచబహులాధేనుస్సౌరభేయీచనందినీ॥

టీక॥ 1 భానుమతీ 2 గౌః 3 సురభి 4 వసు 5 మాహేయీ 6 బహులా 7 ధేను 8 సౌరభేయీ 9 నందినీ యీ 9 న్ని ఆవుపేర్లు.

అడవిఆవుమాంస గుణము.

శ్లో॥ గవయస్యతుమాంసంతువృష్యంబల్యంరుచిప్రదం।
ధాతువృద్ధికరంప్రోక్తమునిభిఃపరికీర్తితం॥

తా॥ అడవిఆవుమాంసము వృష్యము బలము రుచి ధాతువృద్ధి వీటిని గలుగంజేయు.

పులి.

శ్లో॥ వ్యాఘ్రఃపంచనఖోవ్యాళశ్శార్దూలశ్చగుహాశయః।
పుండరీకస్తీక్ష్ణదంష్ట్రస్తరస్వీఘోరదర్శనః॥

టీక॥ 1 వ్యాఘ్ర 2 పంచనఖ 3 వ్యాళ 4 శార్దూల 5 గుహాశయ 6 పుండరీక 7 తీక్ష్ణదంష్ట్ర 8 తరస్వీ 9 ఘోరదర్శన యీ 9 న్ని పులిపేర్లు.

పులిచర్మ గుణము.

శ్లో॥ సుఖాసనంవ్యాఘ్రచర్మభిక్షుప్రీతికరంతథా।
తన్నఖోగ్రహదోషఘ్నస్తథాయుర్దేహవర్ధనః।

తా॥ పులిచర్మము సుఖమైన ఆసనమైనదిగను సన్యాసులకు ప్రీతికరముగను నుండు. దానిగోళ్ళు గ్రహదోషములను పోగొట్టుటయేగాక ఆయుస్సు శరీరము వీటి వృద్ధినిగలుగంజేయు.

## సింహము.

శ్లో॥ సింహఃపంచాననోద్రుప్తక్రవ్యాదశ్చనఖీహరిః ।
కేసరీమృగరాజశ్చవిక్రాంతశ్శ్వేతపింగళః ॥

టీక॥ 1 సింహ 2 పంచానన 3 దృప్త 4 క్రవ్యాద 5 నఖీ 6 హరి 7 కేసరీ 8 మృగరాజ 9 విక్రాంత 10 శ్వేతపింగళ యీ 10 న్ను సింహముపేర్లు.

## సింహచర్మ గుణము.

శ్లో॥ హరిచర్మకృతోధూపఃకాసనన్యాసవాతజిత్ ।
కుష్ఠకండూవ్రణస్ఫోటగళదద్రువినాశనః ॥

తా॥ సింహచర్మముతో ధూపము వేసిన కాసము సన్యాసరోగము వాతము కుష్టువు దురద వ్రణములు దద్దులు గళరోగము దద్రురోగము యివి నివర్తించు.

## పంది.

శ్లో॥ సూకరోవక్త్రదంష్ట్రశ్చవరాహోరోమశఃకిటిః ।
దంష్ట్రీదంష్ట్రాయుధఃక్రోడోపీరస్కంధోబహుప్రజః ।
స్తబ్ధరోమాతథాకోలోఘృష్టిఃపోత్రీకిరిస్మృతః ।
సపనకథితోఘోణీపృథువారాహనామతః ॥

టీక॥ 1 సూకర 2 వక్త్రదంష్ట్ర 3 వరాహ 4 రోమశ 5 కిటి 6 దంష్ట్రీ 7 దంష్ట్రాయుధ 8 క్రోడ 9 పీరస్కంధ 10 బహుప్రజ 11 స్తబ్ధరోమా 12 కోల 13 ఘృష్టి 14 పోత్రీ 15 కిరి 16 ఘోణీ 17 పృథువారాహ యీ 17 న్ను పందిపేర్లు.

## పందిమాంస గుణము.

శ్లో॥ కిటిమాంసంవాతకరంబలవర్ణకరంపరం ।
తద్ధూమోజ్వరభూతఘ్నోదుష్టవ్రణహరఃపరం ॥

తా॥ పందిమాంసము వాతము బలము కాంతి వీటిని గలుగంజేయు. మాంసపు ధూపము జ్వరము భూతబాధ దుష్టవ్రణములు వీటిని నివర్తింపంజేయు.

## జింక.

శ్లో॥ మృగోధహరిణోస్యంకుఃసారంగఃపృషతోరురుః ।
ఏణశ్చబలపృష్ఠశ్చపిశంగఃశ్యామలోచనః ॥

టీక॥ 1 మృగ 2 హరిణ 3 న్యంకు 4 సారంగ 5 పృషత 6 రురు 7 ఏణ 8 శబలపృష్ఠ 9 పిశంగ 10 చారులోచన యీ 10 న్ని జింక పేళ్ళు.

జింకమాంస గుణము.

శ్లో॥ న్యఙ్కుస్స్వాదుర్లఘుర్బల్యో వృష్యో దోషత్రయాపహః ॥

తా॥ జింకమాంసము మధురముగను చులకనగను బలకరముగను వీర్యపుష్టికరముగనునుండు. మరియు నిది త్రిదోషములను బోగొట్టును.

కుక్క.

శ్లో॥ కుక్కురః సారమేయశ్చ భీషణః శునకస్తథా ।
భూసరో భషకశ్శ్వాస్యాదలర్కో రాత్రిజాగరః ।
కాలేయో మృగదంశశ్చ వాంతాదః సుముఖస్తథా ।
సూకరారిః కృతజ్ఞశ్చ మృగయాకుశలస్తథా ॥

తా॥ 1 కుక్కుర 2 సారమేయ 3 భీషణ 4 శునక 5 భూసర 6 భషక 7 శ్వాస్య 8 అలర్క 9 రాత్రిజాగర 10 కాలేయ 11 మృగదంశ 12 వాంతాద 13 సుముఖ 14 సూకరారి 15 కృతజ్ఞ 16 మృగయాకుశల యీ 16 న్ను కుక్క పేళ్ళు.

కుక్కమాంస గుణము.

శ్లో॥ పాకే చోష్ణం శ్వానమాంసం వాతనాశకరం మతం ॥

తా॥ కుక్కమాంసము పాకమువలన ఉష్ణవీర్యముగలదిగ నుండుటయేగాక వాతనాశకరమైయుండు.

ఎలుక.

శ్లో॥ మూషకః కర్షకః పింగ ఉందురుశ్చాఖురేవచ ॥

టీక॥ 1 మూషక 2 కర్షక 3 పింగ 4 ఉందురు 5 ఆఖు యీ 5 న్ను ఎలుక పేర్లు.

ఎలుకమాంస గుణము.

శ్లో॥ మూషీకామాంసకటుకాకఫఘ్ని పిత్తనాశినీ ॥

తా॥ ఎలుకమాంసము కారముగనుండు. మరియు నిది కఫము పిత్తము వీటిని బోగొట్టును.

## పిల్లి.

శ్లో॥ బిడాలోవిషదంష్ట్రీశ్చమూషికారిర్బిడాలకః।
వృషదంశశ్చమార్జాలోమాయావీదీప్తలోచనః॥

టీక॥ 1 బిడాల 2 విషదంష్ట్రి 3 మూషికారి 4 బిడాలక 5 వృషదంశ 6 మార్జాల 7 మాయావీ 8 దీప్తలోచన యీ 8 న్ని పిల్లిపేళ్లు.

## పిల్లిచర్మ గుణము.

శ్లో॥ మార్జాలచర్మజోధూపోగ్రహఘ్నోభూతనాశనః।
జ్వరదోషహరఃకుష్ఠకండూదద్రువినాశనః॥

తా॥ పిల్లిచర్మముచే వేయబడిన ధూపము గ్రహపీడ భూతబాధ జ్వరదోషము కుష్ఠువు దురద దద్రురోగము వీటిని నశింపంజేయు.

## పునుగుపిల్లి.

శ్లో॥ చిత్రరేఖాకరీఘూర్ణీమార్జాలీగంధమార్జనీ।
సుగంధగాత్రావసనాకస్తూరీరోమశాల్యపి।
సుగంధపూతవృషణీబిడాలీకాండచాలినీ॥

టీక॥ 1 చిత్రరేఖాకరీ 2 ఘూర్ణీ 3 మార్జాలీ 4 గంధమార్జనీ 5 సుగంధగాత్రా 6 వసనా 7 కస్తూరీ 8 రోమశాలి 9 సుగంధపూతవృషణీ 10 బిడాలీ 11 కాండచాలినీ యీ 11 న్ను పునుగుపిల్లిపేళ్లు.

## పునుగుచట్టపు గుణము.

శ్లో॥ తద్రోకశంవృష్యంమాయుష్యసౌరభంగాత్రగంధజిత్॥

తా॥ పునుగుచట్టము వీర్యవృద్ధికరముగను ఆయుర్వృద్ధికరముగను పరిమళము గనునుండు. మరియు నిది శరీరదుర్గంధమును బోగొట్టును.

## నక్క.

శ్లో॥ శృగాలోజంబుకఃక్రోష్టాగోమాయుఃక్రోష్టుకఃశివా।
పంచకోమృగధూర్తశ్చభూరిమాయోథభైరవః॥

టీక॥ 1 సృగాల 2 జంబుక 3 క్రోష్ట 4 గోమాయు 5 క్రోష్టుక 6 శివా 7 పంచక 8 మృగధూర్త 9 భూరిమాయా 10 భైరవ యీ 10 న్ని నక్కపేళ్లు.

నక్కమాంస గుణము.

శ్లో॥ శృగాలమాంసంకటుకంగంధర్వవ్యాధినాశనం ।
పృష్యంపుష్టికరంబల్యంసర్వవాతక్షయాపహం ॥

తా॥ నక్కమాంసము కారముగనుండు. మరియు నిది గంధర్వరోగము సమస్త వాతములు క్షయము వీటిని పోగొట్టుటయేగాక ధాతుపుష్టి శరీరపుష్టి బలము వీటిని గలుగంజేయు.

కోతి.

శ్లో॥ మర్కటోవానరఃకీశోహరిఃశాఖామృగఃకపిః ।
ప్లవంగకోవనౌకాశ్చప్లవంగఃప్లవగఃప్లవః॥

టీక॥ 1 మర్కట 2 వానర 3 కీశ 4 హరి 5 శాఖామృగ 6 కపి 7 ప్లవంగక 8 వనౌకః 9 ప్లవంగ 10 ప్లవగ 11 ప్లవ యీ 11 న్ను కోతి పేళ్లు.

కోతిపాల గుణము.

శ్లో॥ ప్లవంగక్షీరంకటుకంకాసస్యాసశ్వాసజిత్ ॥

తా॥ కోతిపాలు కారముగనుండు. మరియు నిది కాసము సన్యాసరోగము శ్వాసము వీటిని పోగొట్టును.

నెమలి.

శ్లో॥ మయూరోనర్తకోబర్హీణనీలకంఠశ్శిఖిధ్వజీ ।
మేఘనాదఃకలాపీచశిఖండీచిత్రపింఛకః ॥

టీక॥ 1 మయూర 2 నర్తక 3 బర్హిణ 4 నీలకంఠ 5 శిఖిధ్వజీ 6 మేఘనాద 7 కలాపి 8 శిఖండి 9 చిత్రపింఛక యీ 9 న్ని నెమలిపేళ్లు.

నెమలిమాంస గుణము.

శ్లో॥ మయూరమాంసంపిత్తఘ్నంచక్షుష్యంరక్తపైత్యజిత్ ॥

తా॥ నెమలిమాంసము పిత్తము రక్తపైత్యము వీటిని పోగొట్టుటయేగాక నేత్రములకు హితకరముగనుండు.

తుమ్మెద.

శ్లో॥ భ్రమరఃషట్పదోభృంగోభృంగరాజఃశిలీముఖః ।
ద్విరేఫోళిర్మధుకరోమధుపోమధులిట్ శిఖీ ।

మధుర్వ్రతశ్చంచరీకోఘుంకారీపుష్పలోలుపః ।
రోలంబోబంభరశ్చైవమధుకృన్మధురస్వరః ॥

టీ॥ 1 భ్రమర 2 షట్పద 3 భృంగరాజ 4 శిలీముఖ 5 ద్విరేఫ 6 అళి 7 మధుకర 8 మధుప 9 మధులిట్ 10 శిలీ 11 మధువ్రత 12 చంచరీక 13 ఘుంకారీ 14 పుష్పలోలుప 15 రోలంబ 16 బంభర 17 మధుకృత్ 18 మధురస్వర యీ 18 న్ని తుమ్మెదపేళ్లు.

## తుమ్మెద గుణము.

శ్లో॥ భ్రమరీమృణ్మయఃకుర్యా ద్వాతగ్రంధివినాశనం ॥

తా॥ తుమ్మెదచేత గట్టబడిన గూటిమన్ను వాతము గ్రంధిరోగము వీటిని నివర్తింపంజేయు.

## చిలుక.

శ్లో॥ శుకఃకీరోరక్తతుండో మేధావీప్రియదర్శనః ॥

టీక॥ 1 శుక 2 కీర 3 రక్తతుండ 4 మేధావీ 5 ప్రియదర్శన యీ 5 న్ని చిలుకపేర్లు.

## చిలుకమాంస గుణము.

శ్లో॥ శుకశ్శీతోలఘుర్గ్రాహీ క్షతకాసక్షయాపహః ॥

తా॥ చిలుకమాంసము శీతలముగను చులకనగను మలబద్ధకారిగనునుండు. గాయములను మాన్పును. మరియు కాసము క్షయము వీటిని నివర్తింపంజేయు.

## గోరువంక పక్షి.

శ్లో॥ గోరాటికాగోకిరాటి. గౌరికాకలహాకుల ।
మేధావికాశారికాస్యాద్దూతికాప్రియదర్శనీ ॥

టీక॥ 1 గోరాటికా 2 గోకిరాటి 3 గౌరికా 4 కలహాకులా 5 మేధావికా 6 శారికా 7 దూతికా 8 ప్రియదర్శనీ యీ 8 న్ని గోరువంకపక్షిపేర్లు.

## గోరువంకపక్షిమాంస గుణము.

శ్లో॥ రూక్షస్తద్వన్మతాసారీస్నిగ్ధాబుద్ధిబలాగ్నికృత్ ॥

తా॥ గోరువంకపక్షి మాంసమునకు చిలుకమాంసగుణమే కలిగియుండు. మరియు రూక్షముగను జిగటగనునుండు. బుద్ధి బలము అగ్నిదీపనము వీటిని వృద్ధిజేసును.

చక్రవాకపక్షి.

శ్లో॥ చక్రవాకస్తుచక్రాహ్వశ్చక్రీశ్చక్రరథోరథి ।
రథాంగనామరథికఃకామీరక్తోధచక్రవాః ॥

టీక॥ 1 చక్రవాక 2 చక్రాహ్వ 3 చక్రీ 4 చక్రరథ 5 రథి 6 రథాంగనామా 7 రథిక 8 కామీ 9 రక్త 10 చక్రవాః యీ 10 న్ని చక్రవాకపక్షి పేర్లు.

చక్రవాకపక్షిమాంస గుణము.

శ్లో॥ చకోరోబృంహణోబల్యః స్నిగ్ధోష్ణోవాతనాశనః ॥

తా॥ చక్రవాకపక్షి మాంసము శరీరమునకు పుష్టి బలము వీటిని గలుగంజేయు. జిగటగను ఉష్ణముగనునుండు. వాతమును బోగొట్టును.

హంస.

శ్లో॥ హంసశ్వేతోధార్తరాష్ట్రోరాజహంసోమనోరమః ॥

టీక॥ 1 హంస 2 శ్వేత 3 ధార్తరాష్ట్ర 4 రాజహంస 5 మనోరమ యీ 5 న్ను హంసపేర్లు.

కలహంస.

శ్లో॥ కలహంసోవరఃప్రోక్తోరక్తపాదోర్ధతుండకః ॥

టీక॥ 1 కలహంస 2 వర 3 రక్తపాద 4 అర్ధతుండక యీ 4 న్ను కలహంస పేర్లు.

హంసమాంస గుణము.

శ్లో॥ హంసస్నిగ్ధోగురుర్వృష్యోవీర్యోష్ణఃస్వరవర్ణకృత్ ।
వాతాస్రపిత్తశమనోబృంహణోబలహ్లాదః ॥

తా॥ హంసమాంసము జిగటగను గురువుగను వీర్యవృద్ధికరముగను ఉష్ణవీర్యము గలదిగనునుండు. మరియు నిది వాతము రక్తపిత్తము వీటిని నివర్తింపంజేయుటయే గాక స్వరశుద్ధి దేహకాంతి శరీరపుష్టి బలము అగ్నిదీపనము వీటిని వగాగలుగంజేయు.

## కోడి.

శ్లో॥ కుక్కుటస్తామ్రచూడశ్చదక్షచూడోథవిష్కిరః ॥
అరుణీచూడికోబోధిశంకరశ్చరణాయుధః ।
కాలజ్ఞః కృకవాకుశ్చకీర్తితశ్చశిఖండికః ॥

టీక॥ 1 కుక్కుట 2 తామ్రచూడ 3 దక్షచూడ 4 విష్కిర 5 అరుణి 6 చూడిక 7 బోధి 8 శంకర 9 చరణాయుధ 10 కాలజ్ఞ 11 కృకవాకు 12 శిఖండిక యీ 12 న్ను కోడిపేళ్లు.

## కోడిమాంస గుణము.

శ్లో॥ కుక్కుటోబృంహణస్స్నిగ్ధోవీర్యోష్ణోనిలజిద్గురుః ।
చక్షుష్యశ్శుక్రకఫకృద్వన్యోరూక్షఃకషాయకః ।
పానీయకుక్కుటస్స్నిగ్ధోబృంహణశ్లేష్మలోగురుః ॥

తా॥ కోడిమాంసము జిగటగను ఉష్ణవీర్యముగలదిగను గురువుగను వీర్యపుష్టికరముగనుండు. ఇది వాతము పోగొట్టుటయే గాక శరీరపుష్టి నేత్రహితము కఫము వీటిని సగా గలుగంజేయు, అడవికోడిమాంసము రూక్షముగను వగరుగనుండు. నీరుకోడిమాంసము జిగటగనుండును. మరియు శరీరపుష్టి శ్లేష్మము గురుత్వము వీటిని జేయును.

## కాకి.

శ్లో॥ కాకోథవాయసోధ్వాంక్షఃకాణోరిష్టఉలూకజిత్ ।
బలిభుక్ చిరజీవీచధూలిజంఘోనిమిత్తకృత్ ।
కరటోబలిపుష్టశ్చహ్యేకదృష్టిఃసకృత్ప్రజః ॥

టీక॥ 1 కాక 2 వాయస 3 ధ్వాంక్ష 4 కాణ 5 అరిష్ట 6 ఉలూకజిత్ 7 బలిభుక్ 8 చిరజీవి 9 ధూలిజంఘ 10 నిమిత్తకృత్ 11 కరట 12 బలిపుష్ట 13 ఏకదృష్టి 14 సకృత్ప్రజ యీ 14 న్ను కాకిపేళ్లు.

## కాకిమాంస గుణము.

శ్లో॥ కాకమాంసంతుచక్షుష్యంలఘుచాగ్నిప్రదీపనం ।
ధాతువృద్ధికరంబల్యంక్షతరోగంక్షయంహరేత్ ।
కృష్ణకాకస్యమాంసం [illegible] ముంకాకసమంగుణైః ॥

తా॥ కాకిమాంసము లఘువుగనుండుటయేగాక నేత్రములకు హితము అగ్ని దీప్తి ధాతువృద్ధి బలము వీటిని గలుగంజేయు. మఱియు క్షయరోగము క్షయ వీటిని నివర్తింపంజేయు. నల్లకాకిమాంసము సగా గుణముచే సామాన్యకాకిమాంస సమముగనుండు.

కోకిల.

శ్లో॥ కోకిలఃపరపుష్టశ్చకృష్ణఃపరభృతోసితః।
వసంతదూతస్తామ్రాక్షోగంధర్వోవనభూషణః॥
కలకంఠోన్యభృచ్చైవపికోథమధురస్వరః॥

టీక॥ 1 కోకిల 2 పరపుష్ట 3 కృష్ణ 4 పరభృత 5 సిత 6 వసంతదూత 7 తామ్రాక్ష 8 గంధర్వ 9 వనభూషణ 10 కలకంఠ 11 అన్యభృత్ 12 పిక 13 మధురస్వర యీ 13 న్ను కోకిలపేర్లు.

కోకిలమాంస గుణము.

శ్లో॥ కోకిలోదీపనోగ్రాహీచక్షుష్యఃక్షయకాసజిత్॥

తా॥ కోకిలమాంసము దీపనకారిగను మలబద్ధకారిగను నేత్రహితకారిగనునుండు. మరియునిది క్షయము కాసము వీటిని హరింపంజేయు.

గుడ్లగూబ.

శ్లో॥ ఉలూకోరక్తచారీచదివాంధఃకౌశికస్తథా।
కోపీనిశాటనోభీరుఃకాకశతృశ్చసస్మృతః॥

టీక॥ 1 ఉలూక 2 రక్తచారీ 3 దివాంధ 4 కౌశిక 5 కోపీ 6 నిశాటన 7 భీరు 8 కాకశత్రు యీ 8 న్ని గుడ్లగూబపేర్లు.

గుడ్లగూబమాంస గుణము.

శ్లో॥ ఉలూకపలలంభ్రాంతి కరంవాతప్రకోపనమ్॥

తా॥ గుడ్లగూబమాంసము భ్రాంతినిబుట్టించును. వాతమును బ్రకోపింపంజేయు.

పాము.

శ్లో॥ సర్పోదంష్ట్రీభుజంగోహీభుజగోథసరీసృపః।
ఉరగఃకంచుకీవ్యాళోద్విజిహ్వోథభుజంగమః।

సచనాగోవిషధరఃకుండలీపన్నగఃఫణీ ।
చక్షుశ్రవాదందశూకోభోగిచాతివిషఃశరః ॥

టీక॥ 1 సర్ప 2 దంష్ట్రి 3 భుజంగ 4 అహి 5 భుజగ 6 సరీసృప 7 ఉరగ 8 కంచుకి 9 వ్యాళ 10 ద్విజిహ్వ 11 భుజంగమ 12 నాగ 13 విషధర 14 కుండలీ 15 పన్నగ 16 ఫణీ 17 చక్షుశ్రవాః 18 దందశూక 19 భోగి 20 అతివిష 21 శర యీ 21 న్ని పాముపేళ్ళు.

పాముమాంస గుణము.

శ్లో॥ సర్పాణాంస్నేహనంమాంసంచక్షుష్యంబృంహణంగురు ।
దూషీవిషకృమిహరంమేధాగ్నిబలవర్ధనమ్ ॥

తా॥ సర్పమాంసము చమురుతోగూడియుండునదిగను నేత్రహితకారిగనుశరీరమునకు పుష్టికరముగను గురువుగనునుండు. మరియునిది కంటిపుసి విషము క్రిములు వీటిని హరించుటయేగాక బుద్ధి అగ్నిదీపనము బలము వీటివృద్ధిని సగా గలుగంజేయు.

కొంగ.

శ్లో॥ కృక్క్రౌంచోథబకఃకహ్వశ్శ్వేతచ్ఛత్రకఉచ్యతే ॥

టీక॥ 1 కృక్ 2 క్రౌంచ 3 బక 4 కహ్వ 5 శ్వేతచ్ఛత్రక యీ 5 న్ను కొంగ పేళ్ళు.

కొంగమాంస గుణము.

శ్లో॥ బకమాంసంక్రిమిహరం కాయకాంతికరంపరం ॥

తా॥ కొంగమాంసము క్రిమిరోగమును బోగొట్టుటయేగాక శరీరకాంతిని గలుగంజేయు.

తొండ.

శ్లో॥ కృకలాసోవరాకశ్చహల్లినోథశిఖండికః ।
సరటోబహురూపశ్చప్రతిసర్యోవిరూపకృత్ ॥

టీక॥ 1 కృకలాస 2 వరాక 3 హల్లిన 4 శిఖండిక 5 సరట 6 బహురూప 7 ప్రతిసర్య 8 విరూపకృత్ యీ 8 న్ని తొండపేళ్లు.

తొండమాంస గుణము.

శ్లో॥ తన్మాంసందుష్టవ్రణకృత్ భగందరవినాశనమ్ ॥

తా॥ తొండమాంసము దుష్టవ్రణములను గలుగంజేయు. మరియునిది భగందరరోగమును బోగొట్టును.

తే లు.

శ్లో॥ వృశ్చికశ్శూకకీటస్స్యాత్ విషపుచ్ఛ యతిస్మృతః ॥

టీక॥ 1 వృశ్చిక 2 శూకకీట 3 విషపుచ్ఛ యీ 3 న్ను తేలుపేర్లు.

క ప్ప.

శ్లో॥ మండూకోదర్దురోగండూహారిర్భేకశ్చమూజవాన్ ।
శాలూరశ్చైవవసఫాణభూప్లవశ్చైవప్రకీర్తితః ।
మహాభేకశ్చమాండవ్యోరాజమండూకఉచ్యతే ॥

టీక. 1 మండూక 2 దర్దుర 3 గండూ 4 హారిర్భేక 5 మూజవాన్ 6 శాలూర 7 వసాణభూ 8 ప్లవ 9 మహాభేక 10 మాండవ్య 11 రాజమండూక యీ 11 న్ను కప్పపేర్లు.

కప్పమాంస గుణము.

శ్లో॥ మండూకఃశ్లేష్మలోనాతి పిత్తలోబలకారకః ॥

తా॥ కప్పమాంసము శ్లేష్మము స్వల్పముగ పిత్తము బలము వీటిని గలుగంజేయు.

మత్స్యము.

శ్లో॥ మత్స్యోమీనోథశఫరీప్రోష్ఠీమంగల్యదర్శనః ।
వైసారిణోవిసారశ్చగండకఃశకులార్భకః ॥

టీక॥ 1 మత్స్య 2 మీన 3 శఫరీ 4 ప్రోష్ఠీ 5 మంగల్యదర్శన 6 వైసారిణ 7 విసార 8 గండక 6 శకులార్భక యీ 9 న్ని మత్స్యముపేర్లు.

మత్స్యముల గుణము.

శ్లో॥ మత్స్యాబలప్రదావృష్యాగురవఃకఫపిత్తలాః ।
ఉష్ణాభిష్యన్దినస్స్నిగ్ధాబృంహణాఃపవనాపహాః ॥

తా॥ మత్స్యమాంసము బలకరముగను వీర్యపుష్టికరముగను గురువుగను ఉష్ణముగను మలవిసర్జనకారిగను శరీరపుష్టికరముగను జిగటగనుమండు. మరియు నిది కఫము పిత్తము వీటిని బెంచును. వాతమును బోగొట్టును.

## తాబేలు.

శ్లో॥ కచ్ఛపోన్యోమహామత్స్యఃకూర్మఃకమఠక స్తథా ॥

టీక॥ 1 కచ్ఛప 2 మహామత్స్య 3 కూర్మ 4 కమఠక యీ 4 న్ను తాబేలు పేర్లు.

## తాబేలుమాంస గుణము.

శ్లో॥ కచ్ఛపోబలదస్స్నిగ్ధోవాతజిత్ పుం స్త్వకారకః ॥

తా॥ తాబేలుమాంసము బలకరముగను జిగటగనుండు. మరియునిది వాతమును బోగొట్టుటయేగాక పుంస్త్వమును సగా గలుగంజేయు.

గద్య॥ ఇతి ధన్వంతరీయ్యే నిఘంటౌ నానాద్రవ్య పర్యాయ
శబ్దగుణ ప్రకాశే సువర్ణాది షష్టోవర్గః.



శ్రీరస్తు.

# ధన్వంతరినిఘంటువు.



## మిశ్రకాదివర్గప్రారంభః

### త్రి ఫ ల ము లు.

శ్లో॥ హరీతకీచామలకీవిభీతకమితిత్రయం ।
త్రిఫలాఫలమిత్యుక్తంఫలత్రయమితిస్మృతం ॥

టీక॥ 1 కరక 2 ఉసిరిక 3 తాడి యీ 3 న్ను నేకముగాజేరిన త్రిఫలమనియు ఫలమనియు ఫలత్రయమనియు జెప్పంబడు.

### త్రిఫలముల గుణము.

శ్లో॥ త్రిఫలాకఫరక్తఘ్నీ మేహార్శకుష్ఠనాశనీ ।
దీపనీలఘువాతఘ్నీప్రదరంచాగ్నిమాంద్యజిత్ ।
కఫఘ్నీక్షౌద్రసంయుక్తాఘృతయుక్తాతుపిత్తజిత్ ।
పవనంతైలసంయుక్తసతతంసేవితాన్నృణాం ।
కార్యసిద్ధికరీచస్యాద్వలీపలితనాశినీ ॥

తా॥ త్రిఫలములు కఫము రక్తదోషము మేహము అర్శస్సు కుష్టువు వాతము ప్రదరోగము అగ్నిమాంద్యము వీటిని నివర్తింపంజేయుయేగాక దీపనకారిగను చులకనగనునుండు. మరియు దీనిని తేనెతో సేవించిన కఫమును బోగొట్టు. నేతితో సేవించిన పిత్తమునుబోగొట్టు. తైలముతో సేవించిన వాతమునుబోగొట్టు. సర్వదా సేవించిన కాయసిద్ధికరముగనుండుటయేగాక వార్ధకమువలన శరీరము శిథిలమగుట వెండ్రుకలు తెల్లబారుట వీటిని గలుగజేయక నుండు.

### త్రికటుకములు.

శ్లో॥ పిప్పలీమరిచంశుంఠీత్రయమేకత్రమిశ్రితం ।
త్రికటుత్ర్యూషణంవ్యోషంకటుత్రికమిహోచ్యతే॥

టీక॥ 1 పిప్పలి 2 మిరియాలు 3 శొంఠి యీ 3 ను నేకముగజేరిన త్రికటుక మనియు త్ర్యూషణమనియు వ్యోషమనియు కటుత్రికమనియు జెప్పంబడు.

త్రికటుకముల గుణము.

శ్లో॥ త్ర్యూషణంకఫదోషఘ్నంకృష్ఠవాతగదాపహం।
స్థౌల్యాగ్నిమాంద్యశమనంకాయకాంతికరంపరం॥

తా॥ త్రికటుకములు కఫము దోషము కుష్టువు వాతము మిగుల శరీరస్థౌల్యము అగ్నిమాంద్యము వీటిని నివర్తింపంజేయుటయే గాక శరీరకాంతిని సగా గలుగం జేయు.

చాతుర్భద్రకము.

శ్లో॥ నాగరాతివిషాముస్తాత్రయమేకత్రఘర్షితం।
గుడూచిసంయుతంచాపిచాతుర్భద్రకముచ్యతే॥

టిక॥ శొంఠి 2 అతివస 3 తుంగముస్తెలు 4 తిప్పతీగ వీటిని నేకముగజేసి చూర్ణముజేసిన ఆచూర్ణము చాతుర్భద్రకమనంబడు.

చాతుర్భద్రక గుణము.

శ్లో॥ చాతుర్భద్రయుతంక్వాథంజ్వరమామాతిసారజిత్॥

తా॥ చాతుర్భద్రకషాయము జ్వరము ఆమాతిసారము వీటిని బోగొట్టు.

చాతుర్జాతకములు.

శ్లో॥ ఏలాలవంగపత్రంచత్రిసుగంధంత్రిజాతకం।
నాగకేసరసంయుక్తంచాతుర్జాతకముచ్యతే॥

టీక॥ 1 ఏలకులు 2 లవంగములు 3 లవంగపత్రి యీ 3 న్ను జేరిన త్రిసుగంధం మనియు త్రిజాతకమనియు జెప్పంబడు. ఇవి నాగకేసరములతో జేరిన చాతుర్జాతకమని జెప్పంబడు.

చాతుర్జాతక గుణము.

శ్లో॥ చాతుర్జాతకషాయస్తుహిక్కాఛర్ద్యతిసారజిత్।
రక్తపైత్యహరోవృష్యోబలవర్ణవివర్ధనః॥

తా॥ చాతుర్జాతకషాయము ఎక్కిళ్ళు వాంతి అతిసారము రక్తపైత్యము వీటిని నివర్తింపజేయుటయేగాక వీర్యవృద్ధి బలము శరీరకాంతి వీటిని వృద్ధిజేయు.

పంచకోలములు.

శ్లో॥ పిప్పలీపిప్పలీమూలంచవ్యంచిత్రకనాగరైః।
యేకత్రమిశ్రితంచైభిఃపంచకోలకముచ్యతే॥

టీక॥ 1 పిప్పలి 2 పిప్పలిమూలము 3 చవ్యము 4 చిత్రమూలము 5 శొంఠి యీ 5 న్ను నేకముగజేరిన పంచకోల మనంబడు.

పంచకోల గుణము.

శ్లో॥ పంచకోలయుతంక్వాథంమారుతంసన్నిపాతజిత్ ।
గుల్మప్లీహోదరానాహశూలఘ్నందీపనంపరం॥

తా॥ పంచకోలకషాయము వాతము సన్నిపాతము గుల్మము ప్లీహరోగము మహోదరము మలమూత్రబద్ధము శూలము వీటిని నివర్తింపజేయుటయేగాక అగ్ని దీపనమును సగా గలుగంజేయు.

పంచవల్కలములు.

శ్లో॥ న్యగ్రోధోదుంబరాశ్వత్థప్లక్షవేతసవల్కలైః।
సర్వైరేకత్రసంయుక్తంపంచవల్కలముచ్యతే॥

టీక॥ 1 మఱ్ఱి 2 అత్తి 3 రావి 4 జువ్వి 5 ప్రబ్బలి వీటిపట్టలసముదాయము పంచవల్కలములని జెప్పంబడు.

పంచవల్కల గుణము.

శ్లో॥ పంచవల్కకృతంక్వాథమంతర్దాహాతిసారజిత్ ।
అత్యుష్ణంతీవ్రజ్వరహృత్కృచ్ఛ్రంహంతినసంశయః॥

తా॥ పంచవల్కలకషాయము అత్యుష్ణముగనుండు. మరియు నిది అంతర్దాహము అతిసారము తీవ్రజ్వరము మూత్రకృచ్ఛ్రము వీటిని బోగొట్టును.

పంచపల్లవములు.

శ్లో॥ మాతులుంగకపిత్థంచజంబూబిల్వామ్రమేవచ ।
సర్వమేకత్రసంయుక్తఃపంచపల్లవముచ్యతే॥

టీక॥ 1 మాదీఫలము 2 వెలగ 3 నేరేడు 4 బిల్వము 5 మామిడి వీటిచిగుళ్ళ సముదాయము పంచపల్లవములనంబడు.

## కనిష్ఠపంచమూలము.

శ్లో॥ శాలపర్ణీపృశ్నిపర్ణీబృహతీకంటకారికా।
తథాగోక్షురకశ్చైవపంచమూలకనిష్ఠకం॥

టీక॥ 1 ముయ్యాకుపొన్న 2 కోలపొన్న 3 ములక 4 వాకుడు 5 పల్లేరు వీటిసముదాయము కనిష్ఠపంచమూల మనంబడు.

## కనిష్ఠపంచమూల గుణము.

శ్లో॥ పంచమూలయుతంక్వాథంసన్నిపాతజ్వరాపహం।
భ్రమదాహవిబంధఘ్నంమారుతఃక్రిమినాశనం॥

తా॥ కనిష్ఠపంచమూల కషాయము సన్నిపాతజ్వరము భ్రమ దాహము విబంధ రోగము వాతము క్రిములు వీటిని నశింపజేయు.

## మధ్యమపంచమూలము-తద్గుణము.

శ్లో॥ బలాపునర్నవైరండసూర్యపర్ణీద్వయంతథా।
కషాయంకఫవాతఘ్నంరక్తపైత్యవినాశనమ్॥

తా॥ ముత్తవపులగము తెల్లగలిజేరు ఆముదము సూర్యపర్ణీద్వయము వీటి సముదాయము మధ్యమపంచమూలమనంబడు. వీటి కషాయము కఫము వాతము రక్తపైత్యము వీటిని నశింపజేయు.

## జీవనాఖ్యపంచమూలము-తద్గుణము.

శ్లో॥ అభీర్వరాచజీవంతీజీవకర్షభకావృతం।
జీవనాఖ్యంతుచక్షుష్యంవృష్యంపిత్తానిలాపహః॥

తా॥ 1 అభీ 2 వరా 3 జీవంతీ 4 జీవక 5 ఋషభక వీటి సముదాయము జీవనాఖ్యపంచమూలమని చెప్పంబడు. ఇది పిత్తము వాతము వీటిని పోగొట్టుటయే గాక నేత్రహితము వీర్యవృద్ధి వీటిని సగా గలుగజేయు.

## తృణాఖ్యపంచమూలము-తద్గుణము.

శ్లో॥ తృణాఖ్యంపిత్తజిద్దర్భశరకాశేక్షుశాలిభిః।
తత్కషాయంజ్వరహరంహిక్కాశ్వాసనివారణం॥

తా॥ 1 కుశదర్భ 2 కాకివెదురు 3 రెల్లు చెరుకు 4 సంభాపైరు వీటి సముదాయము తృణాఖ్యపంచమూలమని చెప్పంబడు. దీని కషాయము జ్వరము ఎక్కిళ్ళు శ్వాసము వీటిని నివర్తింపఁజేయు.

జీవంత్యాదిగణము-తద్గుణము.

శ్లో॥ జీవకర్షభకౌమేధాకాకోళ్యౌ ద్వేచయోజితే। ద్విషూర్పపర్ణ్యౌ
జీవంతీమధుకంచేత్యయంగణః। నామ్నామధుకఇత్యుక్తోజీవ
కాదిస్తథైవచ। జీవనోజీవనీయశ్చశ్వాసకృచ్ఛ్రాతిసారజిత్॥

తా॥ జీవకము ఋషభకము మేద కాకోళిద్వయము శూర్పపర్ణిద్వయము పాలకూర అతిమధురము వీటి సముదాయము జీవంత్యాదిగణమనియు మధుకమనియు జీవనమనియు జీవనీయమనియు చెప్పంబడు. ఇది శ్వాసము మూత్రకృచ్ఛ్రము అతిసారము వీటిని బోగొట్టును.

బిదార్యాదిగణము-తద్గుణము.

శ్లో॥ బిదారిగంధాబృహతీపృశ్నిపర్ణీనిదిగ్ధికా।
శ్వదంష్ట్రాగణఇత్యుక్తఃబలదఃకృచ్ఛ్రమేహజిత్॥

తా॥ ముయ్యాకుపొన్న ములక కోలపొన్న వాకుడు ఏనుగపల్లేరు వీటి సముదాయము బిదార్యాదిగణమని చెప్పంబడు. ఇది మూత్రకృచ్ఛ్రము మేహము వీటిని బోగొట్టుటయేగాక బలమును సగా గలుగఁజేయు.

వేశవారము-తద్గుణము.

శ్లో॥ శుంఠీమరీచపిప్పల్యౌధాన్యకంక్షీరదాడిమం।
పిప్పలీమూలసంయుక్తంవేశవారమితిస్మృతం।
శ్వాసకాసజ్వరహరంపవనంచాగ్నిమాంద్యజిత్॥

తా॥ శుంఠి పిప్పలి ధనియాలు పాలు దానిమ్మ మోడి వీటి సముదాయము వేశవారమనంబడు. ఇది శ్వాస కాస జ్వరము వాతము అగ్నిమాంద్యము వీటిని నివర్తింపఁజేయు.

కాసమర్దకసంభారవటకములు-తద్గుణము.

శ్లో॥ కాసమర్దకపత్రాణాంకృతంచూర్ణములూఖలే। వేశవార
సమాయుక్తంసప్తాహంభాజనేస్థితం। తతోహింగురసాక్తేననిర్మి

తావివిధాన్సృతాః । దివాకరకరై శ్శుష్కాః వటకాః కాసమర్దకాః। శాకవ్యంజనమాంసానాంసంభారయతితేమతాః । అనేనసంయుతాపాకాద్వహ్నివీర్యప్రదాయకః ॥

తా॥ కసివిందపత్రములను రోటిలోవైచి చూర్ణము చేసి వేళవారముతో చేర్చి ఏడుదినములు పాత్రమునందునిచి పిదప ఇంగువరసములో తడిపి నానావిధములగు వటకములుచేసి యెండబెట్టిన నివి కాస మర్దకవటకములనంబడు. ఇవి ఆకుకూరలు కాయకూరలు మాంసము వీటికి సంభారములనంబడు. వటకములతో పైజెప్పిన శాకవ్యంజనమాంసములను పాకముజేసి భుజించిన అగ్నిదీప్తి వీర్యవృద్ధి ఇవి గలుగు.

శిఖరిణీ-తద్గుణము.

శ్లో॥ దధ్నఃపలానిద్వాత్రింశత్త్వగేలార్ధపలంతథా । మధ్వాజ్యస్యపలార్ధార్ధంమరిచస్యపలార్ధకం।పలాన్యష్టౌతుఖండస్యపటేశుక్లేతుగాలయేత్। కర్పూరమేదితేభాండేచ్ఛాయాయాంస్థాపయేదిదం।యేషాశిఖరిణీత్యుక్తానృష్యాతృప్తివివర్ధనీ । సదాపథ్యాచయుక్తాచ క్షీణదేహస్యపుష్టిదా।అయుః ప్రవర్ధనేచైవసర్వరోగప్రమర్దనీ । తథారుచిస్థిర్యకరీనరాణాంసర్వదాహితా॥

తా॥ పెరుగు 32 పలములు లవంగము $\frac{1}{2}$ పలము ఏలకులు $\frac{1}{2}$ పలము తేనె నెయ్యి ఇవి ప్రత్యేకముగ $\frac{1}{4}$ పలము మిరియాలు $\frac{1}{2}$ పలము కలకండ 8 పలములు వీటిని చూర్ణించి నేకముగజేర్చి తెల్లవస్త్రమునందు వస్త్రగాలితముచేసి లోభాగము పచ్చకర్పూరముచే పూయబడిన కుండయందునిచి నీడలో బెట్టవలయు. ఇది శిఖరిణియనంబడు. ఇది వీర్యవృద్ధికరముగను తృప్తికరముగను యెల్లప్పుడు పథ్యకారిగను యుక్తముగను ఆయుర్వృద్ధికరముగను సదా రుచికరముగనునుండు. మరియు నిది సమస్తరోగములను నివర్తింపంజేయుటయేగాక కృశించిన శరీరముగలవానికి పుష్టిని సగా గలుగంజేయు.

సర్వౌషధి-తద్గుణము.

శ్లో॥ కుష్ఠంమాంసీహరిద్రేద్వేమురావైశైలేయపంచకైః ।
త్వచాకర్పూరముస్తైశ్చసర్వౌషధికముచ్యతే॥
తచ్చూర్ణంశరభేదఘ్నంమాంద్యజిద్రుచిదీప్తికృత్ ॥

తా॥ చెంగల్వకోష్ఠు జటామాంసి వసపు మ్రానిపసపు చాగ బావుర్వు సంపెంగ లవంగము పచ్చకర్పూరము తుంగముస్తెలు యివియన్నియు జేరిన సర్వౌషధియనంబడు. సర్వౌషధిచూర్ణమును సేవించిన గాయములు అగ్నిమాంద్యము వీటిని నివర్తింపం జేయు. మరియు నిది అగ్నిదీపనము రుచి వీటిని గలుగంజేయు.

సుగంధామలక.

శ్లో॥ సర్వౌషధిసమాయుక్తంసహస్యామలకత్వచం ।
సుగంధామలకంహ్యేతత్ప్రోచ్యతేచవిచక్షణైః॥

తా॥ సర్వౌషధులు యెండిన నుసిరికవరుగు లవంగములు వీటి సముదాయము సుగంధామలకమనంబడు. దీనికి సర్వౌషధియొక్క గుణములు గలిగియుండుటయేగాక పరిమళగుణమునుగూడ గలిగియుండు.

పంచసుగంధికము-తద్గుణము.

శ్లో॥ కంకోలకంపూగఫలంలవంగకుసుమానిచ ।
జాతిఫలానికర్పూరమేతత్పంచసుగంధికం ॥
తద్గుణస్యాత్క్రిమిహరంరుచ్యందీపనపిత్తజిత్ ॥

తా॥ తక్కోలాలు పోక లవంగకుసుమములు జాజికాయ పచ్చకర్పూరము వీటి సముదాయము పంచసుగంధిక మనంబడు. ఇది రుచికరముగనుండు. మరియు క్రిములు పిత్తము వీటిని బోగొట్టుటయేగాక అగ్నిదీపనమును సగా గలుగంజేయు.

వరాంగము.

శ్లో॥ చందనంకుంకుమంతుల్యంవరాఙ్గమభిదీయ్యతే ॥

తా॥ చందనము కుంకుమపుర్వు యీ రెంటిని సమభాగములుగ జేర్చిన వరాఙ్గ మనంబడు.

వాట్యపుష్పకము.

శ్లో॥ త్రిభాగంకుంకుమంయచ్చతదుక్తంవాట్యపుష్పకం ॥

తా॥ 2 భాగములు చందనము 1 భాగము కుంకుమపుర్వు యివిచేరిన వాట్య పుష్పమనంబడు.

### వరాఙ్గము-పాట్యపుష్పము వీటిగుణము-

శ్లో॥ వరాఙ్గంపాట్యపుష్పంచవపుర్దుర్గంధనాశనం ॥

తా॥ వరాఙ్గము పాట్యపుష్పము యివి శరీరదుర్గంధమును బోగొట్టు.

### యక్షకర్దము-తద్గుణము.

శ్లో॥ కుంకుమాగరుకర్పూరకస్తూరీచందనానిచ ।
మహాసుగంధయుక్తోనామతోయక్షకర్దమః ॥
వపుర్దుర్గంధహరణంసౌరభ్యంవశ్యముత్తమం ॥

తా॥ కుంకుమపువ్వు అగరుగంధము పచ్చకర్పూరము కస్తూరి చందనము వీటి సముదాయము మహాసుగంధమనియు యక్షకర్దమయనియు జెప్పంబడు. ఇది శరీర దుర్గంధమును బోగొట్టుటయేగాక పరిమళముగను వశ్యకరముగనునుండు.

### మండము.

శ్లో॥ సక్తవఃసఘృతాభృష్టాశ్శీతోదకపరిప్లుతాః ।
నాతిద్రవానాతిసాంద్రామండమిత్యభిధీయతే ॥

తా॥ ఆవాలచూర్ణమును సత్తుపిండితో జేర్చి శీతోదకమునైచి గట్టిగను నీళ్ళుగనుగాక గలిపిన యది మండమనంబడు.

### సంతర్పణము-తద్గుణము.

శ్లో॥ ద్రాక్షాదాడిమఖర్జూరంవరాళంత్రుటిశర్కరం ।
లాజాచూర్ణంసమధ్వాజ్యంసంతర్పణముదాహృతం ।
పిత్తారుచిప్రశమనంభ్రమిమేహనివారణం ॥

తా॥ ద్రాక్ష దానిమ్మ ఖర్జూరము లవంగములు ఏలకులు శర్కర పిండి తేనె నెయ్యి వీటి సముదాయము సంతర్పణమనంబడు. ఇది పిత్తము అరుచి భ్రమ మేహము వీటిని నివర్తింపంజేయు.

### షడ్రసములు.

శ్లో॥ కటుస్తిక్తఃకషాయశ్చలవణోమ్లశ్చపంచమః ।
మధురశ్చసమాఖ్యాతాష్షడ్రసానుదాహృతాః ॥

తా॥ క్షారము చేదు వగరు ఉప్పు పులుసు తీపు యివి ఆరున్ను షడ్రసము లనంబడు.

## పంచగవ్యము.

శ్లో॥ గోమూత్రంగోమయంక్షీరందధిసర్పిస్తథైవచ ।
సమంయోజితమేకత్రపంచగవ్యమితిస్మృతం ॥
తద్గుణస్సర్వపాపఘ్నంగుల్మవిద్రధినాశనం ॥

తా॥ గోమూత్రము గోమయము గోక్షీరము ఆవుపెరుగు ఆవునెయ్యి వీటిని సమముగజేర్చిన పంచగవ్యమనంబడు. ఇది సమస్తపాపములు గుల్మము విద్రధి వీటిని నశింపంజేయు.

## మూత్రాష్టకము-తద్గుణము.

శ్లో॥ గజోష్ట్రగవ్యమహిషీఖరవాద్యజికాస్పృణాం।
మూత్రంమూత్రాష్టకమదంశ్వయథుంకామిలాంహరేత్ ॥

తా॥ ఏనుగ ఒంటె ఆవు గేదె గాడిద గుఱ్ఱము మేక నరుడు వీటియొక్క మూత్రము మూత్రాష్టకమనంబడు. ఇది వాపు కామిల వీటిని పోగొట్టును.

## క్షారాష్టకము-తద్గుణము.

శ్లో॥ పలాశశింశ్వపామార్గతిలముష్కయవాగ్రజం ।
స్వర్జటంకణసంయుక్తంక్షారాష్టకముదాహృతం ॥
అష్టశూలహరంగుల్మపవనోదరనాశనం ॥

తా॥ మోదుగ ఇరుగుడుచెట్టు ఉత్తరేణి నువ్వుచెట్టు మొక్కపుచెట్టు యవక్షారము వేగిచెట్టు వెలిగారము, వీటి భస్మములయొక్క సముదాయము క్షారాష్టకమనం ఇవి అష్టశూలలు గుల్మము వాతము మహోదరము వీటిని నివర్తింపంజేయును.

## క్షారషట్కం.

శ్లో॥ తిలక్షారంచలాంగల్యంవచాపామార్గయోస్తథా।
కుటుజంముష్కకంచైవక్షారషట్కమిదంభవేత్ ॥

తా॥ నువ్వుకాడలు చన్నచెర్లి వస ఉత్తరేణు కొడిశపాల ముష్కమను గ్రంథ్యము వీటి సముదాయము క్షారషట్కమనంబడు.

క్షారత్రయం.

శ్లో॥ సర్జక్షారంయవక్షారంటంకణక్షారమేవచ ।
క్షారత్రయమితిఖ్యాతంవైద్యశాస్త్రవిశారదైః ॥

తా॥ సర్జక్షారము యవక్షారము టంకణక్షారము యివి క్షారత్రయమనంబడు.

లవణపంచకము.

శ్లో॥ సౌవర్చలంసైంధవంచబిడమౌద్భిదమేవచ ।
సాముద్రేణసమాయుక్తంజ్ఞేయంలవణపంచకం ॥

తా॥ సౌవర్చలవణము సైంధవలవణము బిడాలవణము ఔద్భిదలవణము సముద్రలవణము యీ 5 న్ను లవణపంచకమనంబడు.

లవణత్రయము.

శ్లో॥ సైంధవంసౌవర్చలంచైవబిడంచలవణత్రయం ।
అగ్నిమాంద్యహరంగుల్మనిద్రాదిసనాశనం ॥

తా॥ సైంధవలవణము సౌవర్చలవణము బిడాలవణము యీ 3 న్ను లవణత్రయమనంబడు. ఇది అగ్నిమాంద్యము గుల్మము నిద్రాధి వాతము వీటిని నశింపంజేయు.

నింబపంచకము.

శ్లో॥ నింబస్యపత్రంపుష్పంచత్వఙ్మూలఫలమేవచ ।
పంచనింబమితిఖ్యాతంనామతఃశాస్త్రకోవిదైః॥

తా॥ వేపాకు వేపపువ్వు వేపపట్ట వేపవేరు వేపపండు వీటి సముదాయము నింబపంచకమనంబడు.

శిరీషపంచకము.

శ్లో॥ శిరీషపత్రత్వక్పుష్పఫలమూలసమన్వితం ।
శిరీషపంచకంఖ్యాతంనామతఃశాస్త్రకోవిదైః ॥

తా॥ దిరిసెనపత్రము దిరిసెనపట్ట దిరిసెనపుష్పము దిరిసెనఫలము దిరిసెనవేరు వీటిసముదాయము శిరీషపంచకమనంబడు.

తా॥ శర్కర పాలు ద్రాక్ష నెయ్యి నీటి సముదాయము పానచతుష్టయ మనంబడు.

## అగదం-తద్గుణము.

శ్లో॥ శిరీషమేవపంచాంగంమాగదంపంచశిషకః ।
సర్వదష్టవిషధ్వంసివిజ్ఞేయంశాస్త్రకోవిదైః ॥

తా॥ శిరీషపంచాంగములో శిషపంచకముజేరిన అగదమనంబడు. ఇది సర్వ విషములను నివర్తింపంజేయు.

## ఉపవిషము.

శ్లో॥ అర్కక్షీరంస్నుహిక్షీరంతిధాచాంజలికారికా ।
కరవీరంచదుత్తూరంపంచధోపవిషంస్మృతం ॥

తా॥ జిల్లేడుపాలు బొంతజెముడుపాలు [illegible] గన్నేరు ఉమ్మెత్త యీ 5 న్ను ఉపవిషమనంబడు.

గద్య॥ ఇతి ధన్వంతరీయే నిఘంటౌ నానాద్రవ్య పర్యాయ
శబ్ద[illegible] ప్రకాశే మిశ్రక వ[illegible]

సమాప్తము.



హిందూరత్నాకరముద్రాక్షరశాల, చెన్నపురి, 1923.

శ్రీరస్తు.

# గ్రంథముల జాబితా.

## వైద్యములు.

| | రూ. | అ. |
|---|---|---|
| వైద్యామృతము | 1 | 4 |
| చికిత్సారత్నము | 1 | 4 |
| నాడీనక్షత్రమాల, నాడీనిర్ణయం ప్రాచీనము | 0 | 4 |
| నాడీజ్ఞానము ప్రాచీనము | 0 | 3 |
| కాలజ్ఞానము ,, | 0 | 4 |
| ధన్వంతరినిఘంటువు | 2 | 8 |
| గుణపాఠము ద్రవ్యపర్యాయనామ గుణములను తెలుపునది | 2 | 8 |
| ,, మేలుప్రతి | 3 | 0 |
| వైద్యచింతామణి 2 వాల్యములు | 8 | 0 |
| అనుపానరత్నాకరము | 0 | 12 |
| ,, మేలుప్రతి | 1 | 0 |
| అనుపానమంజరి ప్రాచీనము | 0 | 8 |
| వాజీకరణ కల్పద్రుమము | 1 | 8 |
| అనుపానతరంగిణి | 0 | 12 |
| ,, మేలుప్రతి | 1 | 0 |
| సద్వైద్యజీవనము అను లోలింబ రాజీయము మేలుప్రతి | 0 | 8 |
| చికిత్సాసారము | 2 | 8 |
| సర్వౌషధి గుణకల్పము | 2 | 8 |
| సుశ్రుతము శారీరస్థానము ప్రాచీనం | 2 | 8 |
| బసవరాజీయము | 7 | 0 |
| అష్టాంగహృదయము సూత్రస్థానం | 6 | 0 |
| ,, చికిత్సాస్థానము | 5 | 0 |
| షడ్రసనిఘంటువు | 0 | 8 |
| వ్యాసప్రోక్తవైద్యశాస్త్రము | 1 | 8 |
| వశిష్ఠప్రోక్తపులిప్పాణివైద్యము | 1 | 8 |
| మానవధర్మచంద్రిక | 2 | 0 |
| గదనిగ్రహము | 2 | 8 |
| శారంగధరసంహిత ప్రాచీనము | 3 | 0 |
| కుమారతంత్రము | 0 | 6 |
| వైద్యశతశ్లోకి సాంధ్రటీకా॥ | 0 | 6 |
| భేషజకల్పము | 0 | 6 |
| శారంగధరకృతత్రిశతి | 0 | 8 |
| స్వరశాస్త్రము | 1 | 8 |
| అగస్త్యప్రోక్తవైద్యము | 1 | 8 |
| ధనంజయనిఘంటువు | 0 | 8 |
| ఇలాజుల్ గుర్బా | 3 | 0 |
| ప్రమేహనివారణబోధిని | 0 | 14 |
| ప్లేగుచికిత్సాబోధిని | 0 | 10 |
| యూనానిదారుఢ్యవృద్ధిబోధిని 1 భా॥ | 1 | 5 |
| ,, 2 భా॥ | 2 | 5 |
| ,, దర్పణము 3 భా॥ | 0 | 12 |
| స్రావకనివారణబోధిని | 0 | 13 |
| రసప్రదీపిక | 0 | 12 |
| చక్రదత్త | 3 | 12 |
| బృహద్వైద్యరత్నాకరము | 2 | 8 |
| రాజమార్తాండము | 0 | 10 |
| శిశువైద్యచింతామణి | 3 | 0 |
| గురుశిష్యసంవాదవైద్యచింతామణి | 1 | 12 |
| వృక్షాయుర్వేదము | 0 | 2 |
| ,, మేలుప్రతి | 0 | 4 |
| సహదేవ పశువైద్యశాస్త్రము | 0 | 6 |
| నేత్రదర్పణము | 0 | 8 |
| వైద్యరత్నము | 1 | 0 |
| అనుభవవైద్యము 4 భాగములు | 2 | 0 |
| ,, 5 6 7 8 భాగములు | 2 | 0 |
| ,, 8 భా॥ యేకబైండు | 4 | 0 |
| షర్బత్ పాకావళి | 0 | 6 |
| మాధవనిదానము | 2 | 8 |
| దంతశోధని | | [illegible] |
| వ్రణచికిత్స | [illegible] | |
| యూనానివైద్యామృతము | 0 | [illegible] |
| రసయోగరత్నాకరము | 0 | 12 |
| సిద్ధులుచెప్పిన మూలికారహస్యము | 1 | 0 |

